నానాచంద్షాహ్ పకీల్, బాలచంద్

ఛత్రసాలుఁడు

పిఠాపురము, 1928

Record no. 505

# Nānācandṣāhā Pakīl, Bālacand

# Chatrasālum̐ḍu

Piṭhāpuramu, 1928

Record no. 505

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

నానాచంద్షాహా పకీల్, బాలచంద్.

ఛత్రసాలుండు / మూలలేఖకులు బాలచంద్ నానాచంద్షాహా పకీల్ ; అనువాదకులు పత్రివాది భయంకరం రంగాచార్యులు, కొంపెల్ల జనార్దనరావు.- 1. కూర్పు.- పిఠాపురము : వేంకట పార్వతీశ్వరకవులు, 1928.

2 volumes ;22 cm.

Record no. 505

Nānācandṣāhā Pakīl, Bālacand.

Chatrasālumḍu / mūlalēkhakulu Bālacand Nānācandṣāhā Pakīl ; anuvādakulu Patrivādi Bhayaṅkaraṃ Raṅgācāryulu, Kompella Janārdanarāvu.- 1. kūrpu.- Piṭhāpuramu : Vēṅkaṭa Pārvatīśvarakavulu, 1928.

2 volumes ;22 cm.

Record no. 505

35 mm microfilm

Image placement: IA IIA IB IIB

Date filming began:

ప్రచారిణీగ్రంథము

# ఛత్రసాలుఁడు

(మొదటిభాగము.)

మూలలేఖకులు,

శ్రీయుత బాలచంద్ నానాచంద్‌షాహా వకీల్‌గారు.

అనువాదకులు,

ప్రతివాదిభయంకరం రంగాచార్యులుగారు.

కొంపెల్ల జనార్దనరావుగారు.





మొదటికూర్పు.

ప్రకాశకులు

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు.

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

పిఠాపురము.

1928.

 [వెల రు ౧—౮—౦.




పిఠాపురము.

శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల.

౧౯౨౫.




# ప్రధానపోషకులు.



మ. రా. శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావుపంతులుగారు, ప్రొప్రయిటరు, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ.

---

# రాజపోషకులు.



,, శ్రీరాజా ఇనుగంటి వేంకటసూర్యప్రకాశ రావుగారు, ఉంపూరు.

,, శ్రీ కలిదిండి వేంకటరామరాజుగారు, భీమవరము.

,, శ్రీ కొవ్వూరి సూర్యనారాయణ రెడ్డిగారు, జమీందారు, కాకినాడ

,, శ్రీ కఱ్ఱి చినవేంకటరెడ్డిగారు, మర్చంటు, కాకినాడ.

,, శ్రీ ముత్యాల సుబ్రహ్మణ్యముగారు, రంగూన్.

,, శ్రీ వనచర్ల సత్తెయ్యగారు, రంగూన్.

,, శ్రీ బత్తుల బసవయ్యగారు, రాజమండ్రి.

,, శ్రీ ఆకారపు వెంకన్నగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ ఆకారపు చెన్నయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ వెలగల గోవిందరాజుగారి కుమారులు వేంకటరెడ్డిగారు, ఇతిహాసగ్రంథమాలాసంపాదకులు, ఆరపిల్లి.

# రాజపోషకులు.

మ. రా. శ్రీశ్రీరాజా వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మ జగపతి బహద్దరు జమీందారిణీవారు, తుని.

---

# పోషకులు.

మ. రా. శ్రీ దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు, కాకినాడ.

,, శ్రీ వాడ్రేవు వేంకటరత్నము పంతులుగారు, పిఠాపురము.

,, శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ ద్రోణంరాజు వేంకటరమణారావు పంతులుగారు, మొఖాసాదారు, తణుకు.

,, శ్రీ బందాసూర్యనారాయణపంతులుగారు బి. ఎ యల్ టి. తణుకు.

,, శ్రీ పండ్రాజు వీర్రాజుగారు, కాకినాడ.

,, శ్రీ కొప్పూర్వారి వేంకట రెడ్డిగారు, పిట్టలవేమవరము.

,, శ్రీ కర్రి పల్లారెడ్డిగారు, మారుటేరు.

,, శ్రీ తేతల గంగిరెడ్డి సోదరులు, పెనుకొండ.

# పోషకులు.

మ. రా. శ్రీ దివాన్ బహద్దరు పి. పరాంకుశము నాయఁడుగారు, రిటైర్డుస్పెషల్ పోలీసుకమీషనరువారు, చెన్నపురి.

శ్రీ అల్లి వెంటయ్యగారు, నరసాపురము.

శ్రీ బి. యల్. నరసింహారావుగారు. మారుటేరు.

,, శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, తంగూర్.

,, శ్రీ పులగం వెంకన్నగారు, మారుటేరు.



---

# సహాయులు.

మ. రా. శ్రీ ఉదయరాజు వేంకటరంగారావుపంతులుగారు, దేశముఖ్ సర్ దేశపాండ్యా, మతేవాడ, ఒరంగల్లు. (దక్కన్.)

,, శ్రీ నేరెళ్ళ నరసింహరాములుగారు, కలపవర్తకులు, ఒరంగల్లు (దక్కన్.)

,, శ్రీ గుండా పుల్లయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు (దక్కన్.)

,, శ్రీ పింజల సుబ్రహ్మణ్యం చెట్టిగారు, వర్తకులు నె 16 అన్నపిళ్ళవీధి, జి. టి., మదరాసు.

# ఆంధ్రప్రబంధగ్రంథమాల.

ఇందుఁ బ్రాచీనకవులచే రచియింపఁబడి యింతవఱకును ముద్రితములు కానట్టియు, ముద్రితములైనను నిపుడు ప్రచారములో లేనట్టియు సత్యుత్తమప్రబంధములును పురాణములును ప్రకటింపఁ బడుచుండును.

2. ఇందు చందాదారులుగా చేరువారు చందారుసు మీయనక్కరలేదు. ప్రకటింపఁబడిన గ్రంథములను గొనుచుండుటయే.

## —• రాధామాధవము •—

కృష్ణదేవరాయల కాలములోనివాఁడై రాయలచే రాధామాధవ బిరుదము నందిన చింతలపూడి యెల్లయకవికృతమైన రాధామాధవమను శృంగారప్రబంధమును మొదటిగ్రంథముగాఁ బ్రకటించుచున్నారము. అల్లసాని పెద్దనకవీంద్రుఁడు రాయలయాస్థానమున 'నగరు' 'తగరు' 'తొగరు' 'వగరు' అనుపదములను ప్రాసస్థానములయందుంచి రామాయణభారతభాగవతపరములుగా పద్యములను చెప్పుమని సమస్య యీయగా మనోహరములుగా పద్యములనువిరచించిన మహాకవి యీతఁడే.

విభవసంవత్సర మకరసంక్రాంతిదినమున వెలువడును. క్రౌను సైజున నించుమించు 300 పేజీలు. చక్కనిపేపరుమీఁద సందముగా ముద్రింపఁబడును.

| | |
|---|---|
| క్యాలికోబయిండు | రు 1—8—0 |
| రేపరుబయిండు | 1—4—0 |

వి. పి. ఖర్చులు కొనువారివి.

వలయువారు:—

మేనేజరు:—ఆంధ్రప్రబంధగ్రంథమాల,
కపిలేశ్వరపురము.
(తూర్పుగోదావరిజిల్లా.)

అని వ్రాయవలయును.



# పీఠిక.

దేశభక్తిపూర్ణంబును రాజనీతిబోధకంబును నగుని "ఛత్రసాలుఁడు" చరిత్రాత్మకమగు చక్కనినవల. స్వధర్మసంరక్షణార్థమై స్వరాజ్యసంపాదనావశ్యకత, స్వదేశాభిమానము, స్వరాజ్యతృష్ణ, స్వరాజ్యముసిద్ధింపఁజేసికొనుటకు వలయు గుణవిశేషములు నిందు బహునైపుణ్యముతోడను, ఎక్కువలోకానుభవముతోడను, చిత్రింపఁబడియున్నవి. విదేశప్రభుత్వముతోడనే వైరముకాని, వ్యక్తులయెడ ద్వేషానవానము ఉండరాదనుధర్మమునకు మొగలురాజ్యముపైఁ గత్తిగట్టి యౌరంగజీబుప్రాణముల నాచక్రవర్తిసోదరి హరింపకుండఁగఁ గాపాడి అయేషాకు పతిభిక్షపెట్టిన ఛత్రసాలుఁడే లక్ష్యమగుచుండెను. మరియు చంపతరాయలు, అవసానకాలమునఁ దనకుమారుఁడగు ఛత్రసాలునికిఁ జేసినయుపదేశ మహామాహాత్మ్యము. అందలి యైకమత్యావశ్యకతనుగూర్చిన గుణపాఠము నేటిమనదేశీయమహానాయకు లెల్లరు శిరసావహించి గ్రహింపఁదగినదై యున్నది. భారతీయస్వాతంత్ర్యయోధాగ్రగణ్యులలో నొకఁడగు శివాజీ ఛత్రసాలునికిఁ గావించిన రాజనీతిబోధ ఛత్రసాలుని స్వాతంత్ర్యసంపాదనమార్గము నేకాక నవలనుగూడ నుజ్జ్వలతరముగఁ జేసినది.

ఈనవల ముఖ్యముగ వీరరసప్రధానమయి సాఁగిపోవుచుండగ విమలావిజయుల ప్రణయశృంగార మందు గలియుట త్రివేణీసంగమమునవలె మనోహరమై రెండును శోభాయమానమై యొప్పుచుండె. ఛత్రసాలుఁడు వీరధర్మముయొక్క పారము ముట్టుచుండ, నౌరంగజీబు పాదుషాయొక్క గాదిలితనయయందు నిర్మలప్రేమయొక్క పరమావధి దివ్యకళామయమై ద్యోతకమగుచుండెను.

బాహ్యప్రకృతివిలాసములకును మానవునిమనోహృదయాంతరంగిక పరిణామములకును గలయవినాభావసంబంధమును కవి [illegible] టులఁ జిత్రిం[illegible] ప్రాకృతలోకమునం [illegible] సచేతనము—సజీవము—ఏక[illegible] ఏకమార్గమునే యనుసరించుచుఁ బాఠకుని భావనాశక్తి నుత్తేజము గలిగించి వానిచంచలహృదయము సృష్టికర్తమ్రోల నమ్రమై ధ్యాననిశ్చలమగునట్లొనర్చుచుండెను.

ముందుప్రకరణమున నేమిచెప్పఁబడుచున్నదోయని యేప్రకరణమున కాప్రకరణమునందే చదువరి యుత్కంఠ యుద్దీపించులాగున నింతలికథ కడునేర్పుతో, కూర్చి వ్రాయఁబడినది. వివిధపాత్రలనిర్మాణమునందును పాత్రలవ్యక్తిత్వపోషణమునందును రసస్ఫూర్తికి ననువుగఁ బరిస్థితులఁగూర్చి దేశకాలపాత్రింబుల సంఘటింపఁజేయుటయందును, కవి గొప్పనేర్పు కనఁబఱిచెను.

ఈగొప్పనవలను భాషాంతరీకరించిన యువకుల కిదియె ప్రథమప్రయత్నము; అనువాదకులును ఎచ్చటికచ్చట నొప్పియుండు శైలితో నీనవలను మదివఱకును రచియించిరి. ఆంధ్రలోకమునకు మిక్కిలి యావశ్యకములగు చరిత్రాత్మకనవలలను, ఇంకను వీరువ్రాసి, భాషాసేవయు, దేశసేవయుఁ జేయుటకు "భారతభాగ్యవిధాత" ఈయువకులకుఁ జిరాయురారోగ్యధీవికాసములఁ బరిపూర్ణానురాగంబున నొసంగుఁగాక. ఈగ్రంథకర్తలు ముందు ఆంధ్రలోకచరిత్రను వెలుఁగుచను వరులకుఁ బరిచితముగావింతురని యెదురుచూచుచుందుము.

బులుసు వెంకటసుబ్బారావు.

22—7—28

# ఉపోద్ఘాతము

సుప్రసిద్ధరచయిత శ్రీయుత బాలచంద్ నానాచంద్ సాహావకీలో గారీనవలను తొలుత మహారాష్ట్రభాషయందు రచించిరి. దానిని శ్రీయుత బాబూ రామచంద్రవర్మగారు కొలఁదిమార్పులతో హిందీభాష ననువదించిరి. దాని కిది యాంధ్రానువాదము. మేమిది వ్రాసి డాదాపు మూఁడేండ్లు కడచినవి.

ఇది యొకగొప్పనవల యని తలఁచి మాతృభాష ననువదింప మేముత్సహించితిమి.

మేము సాధ్యమగునంతవఱ కిందు హిందీలోని యర్థముచెడకుండ వ్రాయఁజూచితిమి. భాషాంతరీకరణమున రూపాంతరీకరణమను పలుకుఁబడి కిది పాల్పడకుండఁజేయుటకు మేము యత్నించినను ఒకనూతనప్రకరణమును వ్రాయు నావశ్యకత మానిర్మాణసౌష్ఠవాభిరీతి దప్పించుకొనఁజాలకపోయెను.

మాతృకయందు పదియవప్రకరణమునకుఁ బిమ్మట [illegible] యొక పెద్దయాంతరంగభాగమునకుఁ [illegible]. "ఔరంగజేబు [illegible] అంగాపాడఁ[illegible] [illegible] చెనో యెఱుంగుటకుఁ జదువరి యెంతయు నుత్సహించును. అచటపరిస్థితులు మిగులఁ గ్లిష్టములై విషమములుగ నున్నవి. ఇట్టికథాసందర్భములు కల్పించుటే గొప్పనేర్పు. ఇట్టితావులయందే రచయితనేర్పు వెంపు వెల్లడియగును. ఈసందర్భమున రచయిత నెగ్గునా యని యుత్కంఠతము చదువరి యాకథాభాగమే లుప్తమగుటఁగాంచి వెలవెల

బోవును. నవల కంతకును మినుకురాళ్లయిన "రసపట్లు" ఇట్టివే. ఈ నవల కిదియొక గొప్పపట్టు. వీరరసప్రధానమగు నీనవలయందు నాయకుఁడగు ఛత్రసాలుని వీరత్వ మీఘట్టమునఁ బరిస్ఫుటముగ గోచరించును. ఛత్రసాలుని కీకార్యము నిర్వహించుట సాధ్యమా యనిపించు పరిస్థితులందు ఆనిర్వహణవిధానము వివరింపకుండుట యొకలోపమనిమెంచి, యది తొలఁగించుటకై మేమిందలి పదునొకండవప్రకరణము సొంతముగ రచించితిమి. అది యధమము 'లేనిబావ' కన్న నయమనిపించునేమో యని మేమూహించుచున్నాము.

మాకీనూతనప్రకరణరచనమున నుత్సాహమొసఁగి, మాయీగ్రంథము సొంతముగఁ జదివి పీఠికవ్రాసియిచ్చిన రసజ్ఞులగు మాగురువర్యులు శ్రీయుత బులుసు వెంకటసుబ్బారావుగారికి మాభక్తిపూర్వక వందనములు.

ఆంధ్రవిమర్శకాగ్రణులలో నొకరగు బ్రహ్మశ్రీ శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిలవారు మాగ్రంథముపైఁ దమయమూల్యాభిప్రాయము నొసంగినందులకు వారికిని మాప్రారంభప్రయత్నమునకుఁ దమగ్రంథమాలయం దాశ్రయ మొసంగిన శ్రీ ఆంధ్రప్రచారిణీగ్రంథమాలాధికారులకును మేమెంతయుఁ గృతజ్ఞులము.

ఈమాచిన్నికానుక నాంధ్రవాణి వాత్సల్యమున స్వీకరించుఁగాక !

ఇట్లు,
భాషాసేవకులు,
ప్రతివాదిభయంకరం రంగాచార్యులు,
కొంపెల్ల జనార్దనరావు.

మదరాసు.
శ్రీకృష్ణజయంతి
౭-౯-౧౯౨౫.



శ్రీరస్తు

# ఛత్రసాలుఁడు

(ప్రథమ భాగము.)

## మొదటిప్రకరణము

### దేవీప్రసాదము

"జయము, వింధ్యవాసినీదేవికి జయము" అని ముక్తకంఠమున జయఘోష మొనర్చుచంపతరాయని మనమున వివిధభావముల విమలతరంగము లుప్పతిల్లసాగెను. ఆతనిముఖమున మానసౌన్నత్యసూచకమగు మనోహరవికాసము గన్పట్టఁదొడఁగెను. నిసర్గగాంభీర్యతేజోవిరాజమాన మగు నాతనియాననమున సౌజన్యాభిమానముల యలౌకికచిత్రము చిత్రితమాయెను. భక్త్యాధిక్యమును జూప దేవిచరణములఁ దనమస్తకము నర్పింప సంసిద్ధుఁడైన బుందేలరాజవంశపు మూలపురుషుని స్మరించినంతనే యాతనిస్నేహభావము జాగరితమయ్యెను. దేవియనుగ్రహమున నాత్మకరవాలమున విశ్వాసముంచి స్వాతంత్ర్యమార్గము ననుసరించిన తనప్రపితామహుఁ డగురుద్రప్రతాపుని స్మరించినంతనే యాతనిమానస మభిమానభరిత మయ్యెను. ఇరువురు నొకదేవినే యుపాసించిరి. కాని, వారియుపాసనామార్గములు మాత్రము భిన్నములు. ఒకఁడు దేవీసమక్షమున నాత్మరక్తముఁ బ్రవహింపఁజేసి బుందేలరాజవంశస్థాపన మొనరించెను. మఱియొకఁడు శత్రురక్తముఁ బ్రవహింపఁజేసి తన్మానుసుష్ట్వుల తతముఁ గ్లానించెను.

బోవును. నవల కంతకును మిన్నకురాళ్లయిన "రసపట్లు" ఇట్టివే. ఈ నవల కిదియొక గొప్పపట్టు. వీరరసప్రధానమగు నీనవలయందు నాయకుఁడగు ఛత్రసాలుని వీరత్వ మీఘట్టమునఁ బరిస్ఫుటముగ గోచరించును. ఛత్రసాలుని కీకార్యము నిర్వహించుట సాధ్యమా యనిపించు పరిస్థితులందు ఆనిర్వహణవిధానము వివరింపఁబడుట యొకలోపమనిమెంచి, యది తొలఁగించుటకై మేమిందలి పదునొకండవప్రకరణము సొంతముగ రచించితిమి. అది యథమము 'లేనిబావ' కన్న నయమనిపించునేమో యని మేమాశించుచున్నాము.

మాకీనూతనప్రకరణరచనమున నుత్సాహమొసఁగి, మాయీగ్రంథము సాంతముగఁ జదివి పీఠికవ్రాసియిచ్చిన రసజ్ఞులగు మాగురువర్యులు శ్రీయుత బులుసు వెంకటసుబ్బారావుగారికి మాభక్తిపూర్వకవందనములు.

ఆంధ్రవిమర్శకాగ్రణులలో నొకరగు బ్రహ్మశ్రీ శ్రీ బ్రహ్మయ్యశాస్త్రులవారు మాగ్రంథముపైఁ దమయమూల్యాభిప్రాయము నొసంగినందులకు వారికిని మాప్రారంభప్రయత్నమునకుఁ దమగ్రంథమాలయందు దావొసంగిన శ్రీ ఆంధ్రప్రచారిణీగ్రంథమాలాధికారులకును మేమెంతయుఁ గృతజ్ఞులము.

ఈమాచిన్నికానుక నాంధ్రవాణి వాత్సల్యమున స్వీకరించుఁ గాక!

ఇట్లు,

భాషాసేవకులు,

ప్రతివాదిభయంకరం రంగాచార్యులు,

కొంపెల్ల జనార్దనరావు.

మదరాసు.
శ్రీకృష్ణజయంతి
౭-౯-౧౯౨౧.



శ్రీరస్తు

# ఛత్రసాలుఁడు

(ప్రథమభాగము.)

## మొదటిప్రకరణము

### దేవీప్రసాదము

"జయము, వింధ్యవాసినీదేవికి జయము" అని ముక్తకంఠమున జయఘోషమొనర్చుచంపతరాయుని మనమున వివిధభావముల విమలతరంగము లుప్పతిల్లసాగెను. ఆతనిముఖమున మానసౌన్నత్యసూచకమగు మనోహరవికాసము గన్పట్టఁదొడఁగెను. నిసర్గగాంభీర్యతేజోవిరాజమానమగు నాతనియాననమున సౌజన్యాభిమానముల యలౌకికచిత్రము చిత్రితమాయెను. భక్త్యాధిక్యమును జూప దేవిచరణములఁ దనమస్తకము నర్పింప సంసిద్ధుఁడైన బుందేలరాజవంశపు మూలపురుషుని స్మరించినంతనే యాతనిస్నేహభావము జాగరితమయ్యెను. దేవియనుగ్రహమున నాత్మకరవాలమున విశ్వాసముంచి స్వాతంత్ర్యమార్గము ననుసరించిన తనప్రపితామహుఁడగురుద్రప్రతాపుని స్మరించినంతనే యాతనిమానస మభిమానభరిత మయ్యెను. ఇరువురు నొకదేవినే యుపాసించిరి. కాని, వారియుపాసనామార్గములు మాత్రము భిన్నములు. ఒకఁడు దేవీసమక్షమున నాత్మరక్తముఁ బ్రవహింపఁజేసి బుందేలరాజవంశస్థాపన మొనరించెను. మఱియొకఁడు శత్రురక్తముఁ బ్రవహింపఁజేసి తన్నాముసుమ్ముసుపునుల తతముఁ గావించెను.

ఆలయమునఁ బ్రవేశించుతతిఁ జంపతరాయలకన్నులయెదుట నాత్మవంశోత్పత్తివైభవములు చిత్రితములయ్యెను. ఆతనినేత్రములు ప్రేమాశ్రుపూరితము లయ్యెను. అభిమానమున నతనిసర్వాంగముఁ బులకితమయ్యెను. ఆలయమండపమున దేవీసముఖమునఁజేరి యాతఁడు మరల దేవింగూర్చి జయజయధ్వని మొనర్చెను. కాని యాసమయమున నాతనికి దేవీదర్శనము లభింపలేదు. ఇదివఱకుఁ జాలదూరమున నుండఁగనే దేవీదర్శనము లభించుచుండెను. ఇపుడు సమీపమునకు వచ్చినను లభింపకుండుటకుఁ జంపతరాయల కాశ్చర్యముకలిగెను. కలఁతఁజెందినతనమనమును శాంతింపఁజేసికొని యుత్తరీయాంచలమునఁ గన్నీటిని దుడుచుకొనెను. కొంచెముసేపటికి వింధ్యవాసినీదేవి స్వర్ణసింహాసనమున నిశ్చలరూపమున నాసీనయైయుండు టాతనికిఁ గానవచ్చెను.

చంపతరాయలు దేవీదర్శనముఁ గావించుకొని మరలుచున్న సమయమున మరల జయజయధ్వనము వినఁబడెను. చంపతరాయ లచ్చెరువందెను. నేఁడు దేవీవార్షికోత్సవమగుటచేఁ దమకులదైవమును దర్శింప వింధ్యనగముపై బుందేలులందఱును సమకూడిరని యాతఁ డెఱిఁగియే యుండెను. దేవీజయజయధ్వనముల నాఁడాప్రదేశమంతయుఁ బ్రతిధ్వనించిపోవునని యాతఁడెఱుఁగును. అట్లయ్యు నాజయధ్వని వినినంతనే చంపతరాయ లులికిపడెను. కంపితమై నిస్సత్త్వమైయున్న యాధ్వని చావసిద్ధముగనున్న యొకముదుసలినోటినుండి వెలువడినట్లుండెను. వెనుకకుఁ దిరిగిచూడఁగనే రణవీరుఁడగు శుభకరణుఁడు నిలిచియుండెను. యుద్ధక్షేత్రమునఁ బరాక్రమాతిశయమున విహరించువీరుఁడు దేవీసముఖమున నంతటిభీరు వేలయయ్యెనో యాతనికిఁ దెలియలేదు. ఆహవరంగమునెల్ల గడగడలాడించి వైరులపై



నాశ్మపరాక్రమశాసన మొనరించుసమరసింహము దేవీమందిరమున గోమాయువులీల నేలయఁబడెను! దేవీజయజయధ్వని మొనర్చుసమయమున తనహృదయముంబోలి యాతనిహృదయము వికసితమై ప్రసన్నమై లేకుండుటకుఁ గారణమేమి? పాపాత్ముని మొగమువలె నాతని మొగ మేలనల్లవడిపోయెను! ఆతనికంఠస్వర మింతనిస్సత్త్వమై యేల యున్నది! ఇదియేమియుఁ జంపతరాయనికి బోధపడలేదు. చంపతరాయనికి శుభకరుఁడు ఘోరశత్రువు. అట్లయ్యు నప్పటిశుభకరణుని యవస్థం గాంచ నాతనికి విచారముగలిగెను. చంపతరాయలు జాలితో నాతనిఁజూచుచుండెను. అప్పు డాతనికి శుభకరణునికపోలములపై నశ్రుబిందువులు రెండు ప్రకాశించుచుండుట కానవచ్చెను. అవి ప్రేమాశ్రువులు కావు; దుఃఖాశ్రువులు. శూరుఁడగు శుభకరణుఁడు తాఁ జేసినదుష్కర్మములకై పశ్చాత్తపించుచున్నాఁడు; శోకించుచున్నాఁడు; అని యప్పుడు చంపతరాయలు తలపోయసాగెను. తామిద్దఱుఁ గలిసి యాత్మావలంబనమార్గమున మాతృభూమియగు బుందేలఖండమును, యవనులదాస్యమునుండి కాపాడ నుపాయములఁ బన్నుచుండిన తమ చిన్ననాఁటియవస్థ నప్పుడు చంపతరాయలు స్మరించెను. తాము తమ మధురస్వప్నముల ఫల మనుభవింపనున్న తఱి హఠాత్తుగఁ దమయాశయములును దమమైత్రియు నెట్లువినష్టములయ్యెనో, పరస్పరసాహాయ్యభూతములగు తమఖడ్గము లెట్లు లన్యోన్యరక్తపిపాసాసక్తము లయ్యెనో, యావిషయముఁగూడ నాతనిజ్ఞప్తికివచ్చెను. ఆతఁడు మఱల నొకసారి తనబాల్యమిత్రునివైపు చూచెను. తమచిన్ననాఁటి యాశాంకురములపై నేర్పడఁదగుమహావృక్షము జన్మింపకున్నను, నాయంకురము మాత్ర మవిచ్ఛిన్నమై నాఁటివలెనే యున్నదని యాతఁడు బాగుగఁ దెలిసికొనెను. "నాప్రియమిత్రుని యాదర్శనముల [illegible]

దించుటకు మాఱుగ వానిని దీవ్రాఘాతముల పాలొనర్చితిని. అతని యవివేకమునకు నవిచారతకుఁ బ్రతీకారమొనర్చుటకే సంతృప్తుఁడనైతిని." అనియెంచి చంపతరాయలు మిగుల దుఃఖించెను. నేటిదనుకనైన ప్రమాదము సవరించుకొనవలయును. శామిత్రుని మానసిక మాలిన్యమునకుఁ గారణ మెఱింగి తన్నిర్మూలన మొనర్పవలయును." అని వెంటనే యాతఁడు నిశ్చయించుకొనెను. వెనుకటి తనమానావమానముల నన్నిటిని మఱచి, చంపతరాయలు స్నేహపూర్వకముగ శుభకరణునిఁ బలుకరింపనున్న సమయముననే యాతఁడు నిర్లక్ష్యభావముసఁ జూచుచు దూరమున నిలిచియున్న ధాంధేర దేశాధిపతియగు కంచుకిరాయనితో మాటాడఁదొడఁగుట కానవచ్చెను. చంపతరాయని స్వాభిమానము మరల జాగరితమయ్యెను. ఈ దేశద్రోహి ప్రాణముల హరించి వీని కళేబరము మీఁదనే బుందేలఖండ స్వాతంత్ర్య పతాకాస్థాపన మొనరించెదఁగాక యని తన మనమున నిశ్చయించుకొని చంపతరాయలు సమీపస్థమగు నొకయాసనముపైఁ గూరుచుండెను.

ప్రేమపూర్వకమగు శుభకరణునిచిన్ననాఁటిమైత్రిఁ దలఁచినఁ జంపతరాయని హృదయము ప్రేమభరితమగుచుండెను. కాని, తరువాతి యాతని దౌష్ట్యముం దలంచిన తత్‌క్షణమే యాతని మానసమున నసహ్యత యలముకొనుచుండెను. ఇంతలో ఓర్ఛాదేశాధిపతియగు పర్వతసింహుఁడును నాతని భార్యయగు హీరాదేవియు సపరివారముగ నేతెంచిరి. వేత్రహస్తులు నన్యసేవకులు నపుడుఁగూడ వారివెంట నుండిరి. వారిపల్లకి దేవాలయద్వారముం జేరఁగనే వందిజనులు గొంతెత్తి వారిబిరుదావళులఁ బాడఁదొడంగిరి. ఆప్రశంసలకు దేవి యెట్టి ప్రత్యుత్తర మొసంగునో తెలిసికొనుటకోయనఁ బల్లకి కొంతసేపటిదనుక ద్వారముకడనే నిలిచియుండెను. ఈనత్యోక్తి దేవికి నమ్మకముగా



దని గర్వియగు పర్వతసింహునకును బరిజనమునకును దెలుపుటకోయన వారిభాషణమునందలి ప్రతిశబ్దమును బ్రతిధ్వనిరూపమున వారికర్ణములఁ జేరెను. అదివిని పర్వతసింహుఁడు మందహాసమొనర్చెను. వందిజనములపలుకు లన్నియు సత్యములని దేవి స్వయముగఁ బలికెనని యాతఁడెంచెను. దేవి తమయజమానుని మహత్త్వ మంగీకరించెనని పరిజనమంతయు బిగ్గరగ జయఘోషమొనరించెను. ఆజయజయధ్వానముసఁ బొగ్గొనుట యప్రతిష్ఠాకరమని యెంచియో, లేక ప్రభువులై యుండి యండటియెదుట దేవీనామముంగొనుట యనుచితమని తలఁచియో, కాని పర్వతసింహుఁడు నాతని రాణియు నాసమయమున నొక్కమాటయైన నాడలేదు. వారిరువురు నట్లే యున్నతశిరస్కులై యాలయముఁజొచ్చి చంపతరాయనికి, సాధ్యమైనంతదూరముగ నున్న తాసనములలంకరించిరి. చంపతరాయలు పర్వతసింహుని పినతండ్రికొడుకు. హితకారియై యాతఁడు పర్వతసింహు నోర్ఛారాజ్యాధిపతిగఁ జేసెను. అట్టివానిదరిఁజేరి యాదరపూర్వకముగ సంభాషింపకపోవుటయటుండ శాంతసౌహృద్యదృష్టులతో నాతనిఁజూచుటకూడ ననుచితమని వారెంచిరి. మచ్చరము, కోపము, నైచ్యము మున్నగు వికారములచేఁ గళంకితములగు వీక్షణములతోనే వారాతని యుపకారములకుఁ బ్రతికృతినొసరించుచుండిరి.

హీరాపర్వతసింహులనేఁటిచర్యలం గాంచి చంపతరాయలు చకితుఁడయ్యెను. "కార్యసిద్ధియగుదనుక — ఓర్ఛారాజ్యాధిపత్యము పూర్తిగ లభించువఱకు, నాయన్న పర్వతసింహుఁడు నాయెడ నెట్టిసద్వర్తనముఁగలిగియుండెను! ఆతనిభార్య హీరాదేవి నన్నెంతయాదరించుచుండెడిది? కాని, యోర్ఛారాజ్యాధిపత్యము లభింపఁగనే పర్వతసింహుని కృత్రిమవినతమగు మనస్క మెంతటి యౌద్ధత్యము నహించెను! హీరా

దేవి యాదరసత్కారములు క్రమక్రమముగ క్షీణించి తుదకొక్కుకృత్రిమములుగఁ బరిణమించినవి ! ఈముఖ్యవిషయము లాతనికన్నులయెదుటఁ బ్రత్యక్షమయ్యెను. ప్రత్యక్షమగునిర్మలయవనికాభ్యంతరమున నింతటినింద్యస్వభావ మణఁగియున్నదని యాతఁడు స్వప్నముననైనఁ దలఁచియుండలేదు. నేఁటిదనుక నతఁడు పర్వతసింహునియుపకారమే యొనర్చుచుండెను. నేఁటిహీరాదేవిగర్వవైభవముల కాతఁడే కారణమైయుండెను. హీరాపర్వతసింహులు తనయెడ నంతటిద్వేషాసూయలఁ బూనుటకుఁగాని, నైచ్యపూర్ణములగుదృష్టులఁ దనపైఁ బఱపుటకుఁగాని, కారణమగు నెట్టియపకారము నతఁడు వారికిఁ గావించియుండలేదు. తనపరాక్రమమున యవనహస్తములనుండి యోర్ఛారాజ్యము నుద్ధరించి పరావలంబులై యున్నహీరాపర్వతసింహులకు దానినర్పించి యల్పతరమగు తనమహేబారాజ్యముతోనే చంపతరాయలు సంతృప్తుఁడై యుండెను. తాను స్వయముగ సంపాదించినయోర్ఛారాజ్యముపై నధికారమువహింప నాతఁ డెన్నఁడును గోరియుండలేదు. అతనియుదారవర్తనమునకును నసామాన్యోపకారమునకును పర్వతసింహుని క్రోధనైచ్యమాత్సర్యాదు లుపహారములుగ లభించెనా ! అగుఁగాక !—

బుందేలఖండప్రభుమండలియెల్ల స్వస్థానమున నుపవిష్టమైయుండుటఁ జూచి యాలయమండలిముఖ్యార్చకుఁడు చంపతరాయని చెంత కేతెంచి "రాజా! దేవీపూజకు సామగ్రియంతయు సిద్ధముగనున్నది. పూజయారంభముకావచ్చునా! ఇంక నెవ్వరైన వచ్చువారుకలరా!" అని యచ్చటిప్రధానులగు ప్రాణనాథస్వామి యడుగుచున్నారు." అనిపలికెను.

నేఁటిపవిత్రమహోత్సవము సందర్శించుటకు వార్షికనియ



మానుసారముగ బుందేలనరపతులెల్లరు నిట కేతెంచిరి. పూజ మొదలిడవచ్చునని నాప్రార్థనగఁ బ్రభువుల కెఱింగించునది." అని చంపతరాయలు పలికెను. తరువాత నిటునటుఁ జూడ నతనికిఁ గుమారుఁ డగపడలేదు. అంత నాతఁడు మరలఁ బూజారితో "గురువర్యా! కుమారుఁ డిచటఁ గన్పట్టుటలేదు. ఈసరి కాతఁడు వచ్చుచుండును. నేఁటిమహోత్సవమును జూడ నాతని కెంతయో కుతూహలముకలదు. కావున నించుకసేపాఁగి కుమారుఁడేతెంచినవెనుకఁ బూజ నారంభించినచో నతఁడు స్వాములయెడను, వచ్చినసజ్జనులయెడను మిగులఁగృతజ్ఞుఁడగునని స్వాములవారితో వచింపుఁడు." అని పలికెను. అటుపై వెంటనే చంపతరాయలు తనసేవకునికొకనికి సత్వరముపోయి కుమారుని వెదకితీసికొనిరా నాజ్ఞయొసంగెను.

పూజరి చంపతరాయలనుండి పూజకనుజ్ఞవేడుటఁ జూచి హీరాదేవి తనకుఁ జాలనవమానముగలిగినట్లు భావించెను. ఒకయల్పుఁడగురాజకుమారునికై తామెల్లరు నాఁగవలసెననియు, నాతఁడు రాక పూజయారంభముకాదనియు నామెకుఁ జాలవిచారము గలిగెను. వెంటనే యామె తనభర్తతో నీయవమానకరమగునడతకై పూజారికిఁ దగినశిక్షఁ జేయవలయునని శాసనాన్వితమగు వేఁడుకోలొనర్చెను. శుభకరణుఁడుగూడ నామెపలుకు సమర్థించెను. పర్వతసింహుఁడు వికృతముగ నవ్వెను. "యువరాజులగు విమలదేవదలపతిరాయలు వచ్చిరో లేదో మొదటఁ జూడుఁడు. వారిరువురు లేకయే మీరు పూజ నారంభింపనెంచుచో మహేబారాజపుత్రునికొఱ కెదురుచూడకయే యవిలంబితముగఁ బూజాసమారంభము గావలయునని నాయాజ్ఞ" అని యాతఁడు పలికెను.

హీరాదేవీశుభకరణు లిరువురుఁ దమక్రోధమునడంచుకొని మౌని

మాటాడక రాజకుమారుల వెదకుటకై సేవకులఁ బంచిరి.

ఇంతలోననే పండ్రెండేండ్ల బాలిక యొకతె పరుగిడుచు నటకు వచ్చెను. దట్టమైన యామె కురులు భుజములపైఁ జెదరి యిటునటు గాలిచే నాడుచుండెను. పరుగిడుటచే ద్రుతగతిగల యామె శ్వాసమువలన మందిరమందలి వాయువెల్ల సురభిళమగుచుండెను. భయమువలన నెఱ్ఱవాఱిన చెక్కిళ్లను, దరళమగు దృష్టిని నొక్కసారిగ లలాటముతోఁ గూర్చి చూచినచో నీహారస్వచ్ఛమగు నాకసమున విలసిల్లు రక్తవర్ణయగు ప్రభాతసుందరినిఁ గాంచి చంచలయగు చంచల యామెతో నేలకూడుచున్నదియను ప్రశ్న మనమునఁ దనంతఁ దాన యుదయించును. కలహప్రియములగు నామె యోష్ఠములు లోకమున నే యువతి యోష్ఠములును దమ్ముఁ బోలమి నొండొంటితోడనే పోరుటచేఁ గెంపుఁ గొనుచు నన్యోన్యదూరీభూతములగుచుండెను. అదియు మంచికొఱకే వచ్చెనని యామె దంతములు తమ సౌమ్యదీధితుల నిశ్శ్వాసపరిమళముతో వెలువఱిచి “మాయందు మల్లెపూవుల తావియుఁ దెల్పును జంద్రకిరణముల మంజులతయుఁ దేజమును గలవు. మీయందేమియున్నది?” యని పలుకఁ జొచ్చెనో యన నొప్పుచుండెను. పరుగిడుచు వచ్చి యాకస్మిక యాలయమున మండపముకడ నిలిచిపోయెను. ఆమె మనోజ్ఞగమనము, నయనముల దివ్యతారళ్యము, నిశ్శ్వాసనిర్గతమగు నలౌకిక సుగంధము నొకప్రక్కకుఁ ద్రోసిపుచ్చి వింధ్యవాసినీదేవి యస్త్రములను, గరాళవీక్షణములను గణనసేయకుండినచో, నామె సాక్షాద్వింధ్యవాసినీదేవియే యను భ్రమ యెల్లరకుఁ గొంతసేపటివఱకుఁ గలుగక తప్పదు. వింధ్యవాసిని శిరమున ముక్తాకిరీటము విలసిల్లుచుండెను. బాలిక మస్తకమున జక్కగ హత్తియున్న స్వేదమౌక్తికములు వింధ్యవాసినితోఁ దులసేయఁ బ్రతికిరీటావశ్యకతఁ దొలంగించెను. ఆసజీవసౌందర్యమూర్తి



సాగిసాగి వింధ్యవాసినీవిగ్రహమునఁ గలిసి యైక్యము నందదుగదా యని చాలమందికి సందియము వొడమసాగెను. కాని, యా ముద్దుల కన్నియ యాసందియము ననతికాలముననే దూరమొనర్చెను. విశాలమండప సామీప్యమున నిలిచి యామె ప్రాణనాథస్వాములవారితో నత్యంత మధురస్వరమున నిట్లు పలుకమొదలిడెను.

“స్వామీ! యువరాజగు ఛత్రిసాలుఁడును, నాతని మిత్రులు దలపతిరాయ విమలదేవకుమారులును, నొక్కసత్కార్యమున విజయముఁ గాంచి దేవీసందర్శనమునకై యేతెంచుచున్నారు. వారు వచ్చుదనుక మంగళకార్యారంభ మొనర్పకుందురుగాక యని తమ్ముఁ బ్రార్థింప వారు నాకాజ్ఞయొసంగిరి.”

మండపమునుండి వెలుపటికి వచ్చుచుఁ బ్రాణనాథస్వామి యిట్లు ప్రశ్నించెను. “ఛత్రిసాలుఁడును దన్మిత్రులును నేకార్యమున విజయముఁ గాంచిరి?”

ఆతఁడు వెలుపలికి వచ్చునరి కాతని ముఖముచుట్టును దేజఃపుంజము వెలుంగుచున్నట్లుండెను. ఆతని నిరీహమగు బుద్ధి, యఖండబ్రహ్మచర్యము, నుద్దామతపోబలము—గాంభీర్యానుభావభరితమగు నాతని ముఖమున సులభముగఁ దోఁచుచుండెను. నగుమోముతో బాలికను బ్రశ్నించుచు నాతఁడు మండపమునుండి వెలువడిన సమయమున నాతని దర్శించి తద్భక్తచకోరములు, సుధాసారముల వర్షించు చంద్రుఁడు నీలమేఘావరణమునుండి వెలువడి యాత్మీయ ప్రభల వెలుంగఁ జొచ్చెనని భావించినవి. ఆతనియెడ గౌరవముఁ జూపుటకు హీరాపర్వతసింహులు తప్ప తక్కినవారందరు లేచి నిలువఁబడిరి. వారినందఱఁ గూర్చుండ నియమించి స్వామి యిట్లు చెప్పెను.

ప్రాణ—సుజనులారా! కూర్చుండుఁడు. నేను వచ్చినప్పుడెల్ల

నీరీతినిలువఁబడనక్కఱలేదు. ఈసౌందర్యరాశి తెచ్చినసమాచారమును శాంతులై వినుఁడు. (బాలికవైపు తిరిగి) ఛత్రసాలుఁడు నతనిమిత్రులు నెట్టియుత్తమకార్యము నిర్వహించి యిటవచ్చుచున్నారు. చెప్పుము ?

బాలిక—దేవికై మనోహరమగుమాలఁ గూర్పనెంచి వనపుష్పములఁగొనిరా నేను విమలదేవునితో దక్షిణభాగమునుండి వింధ్యాచలము నెక్కితిని. ఆసమయమున బాలార్కునిస్వర్ణకిరణము లచటి పుష్పములపైఁ బ్రసరించుచుండెను. ఆపుష్పములన్నియు స్వర్ణమయములో యన్నట్లుండెను. అట్టిశోభను మేమంతకుమున్నెన్నఁడును గాంచియుండలేదు. సుందరతరములగుదృశ్యముల నాశించి యింకను జాల దూరమువఱకుఁ బోయితిమి. పూజారంభమున కవకాశ మింకను నుండుటచే నచటనే కూర్చుండి మేమిరువురమును జేరియొకవైపునుండి మాలఁ గూర్పదొడఁగితిమి. కుసుమమాల సిద్ధమయ్యెను. విమలదేవుఁడు కొలఁదిసేపటిలో మాలఁగూర్చివైచుటఁ గాంచి నేను నవ్వుచుఁ గాంతాయోగ్యములగుకార్యములం దాతనికిఁగలచాతుర్యము బొగడుచుంటిని. ఇంతలోఁ జాలమందిజనులు-మనుజులననేల—రాక్షసులే—మమ్ముఁజుట్టుముట్టిరి.

ఆబాలికమాటలనందఱు శ్రద్ధతో వినుచుండిరి. విమలదేవుని పేరు వినఁగనే హీరాపర్వతిసింహు లిరువురునువచ్చి యామెసమీపమున నిలువఁబడిరి. కంచుకిరాయ లంతకుఁబూర్వమే యచట నిలువఁబడియుండెను.

ప్రాణ—మిమ్ముఁ జుట్టుముట్టినవారెవరు ? వారు మీకు రాక్షసులుగఁ గన్పట్టిరా?

బాలిక—చిత్తము. తమరువర్ణించెడిసీతాదేవికథయందలిరాక్షసులస్వభావ మెట్టిదో వారిస్వభావము నట్టిదియే. కాని, యసురులకుఁబోలె వారికి దీర్ఘదంతములు, స్థూలనాసికలు, పెదవులదాటియుండు నాలుకలు లేవు. వారివస్త్రములు శ్రేష్ఠములై యధికమూల్యవంతములై యుండెను. అన్యులనీచులుగ భావించి వారిపైఁ దమయధికారమును స్థాపించుటయే తమకర్తవ్యమని వారెంచుచున్నట్లు కనఁబడెను. అట్టిరాక్షసులు తఱచుగఁ దండ్రిగారి యాస్థానమునకు వచ్చుచుందురు. దేవతలకుఁబోలె వారికిఁ దండ్రిగారు పూజాసత్కారములఁ గావించుచుందురు. వారు తమకడనున్నంతదనుక దత్సేవనే మునిఁగియుందురు.



ధాంధేరదేశాధీశుఁడగుకంచుకిరాయలు నడుమనడ్డమై « విజయా! అప్రస్తుతప్రసంగ మొనర్పకుము. మనసార్వభౌముని జాతిసోదరులేమియొనర్చిరో స్పష్టముగఁ జెప్పుము » అనియెను.

చంప—కంచుకిరాయా! సార్వభౌముఁడెవఁడో, తజ్జాతిసోదరులెవరో, యీబాలిక కేమి తెలియును ? ఢిల్లీయందలి చక్రవర్తిసింహాసనముఁ జేరఁగనే—సార్వభౌమనామము విన్నంతనే, యాత్మీయులనడుమ సాభిమానముగ నెత్తియుంచెడిమస్తకము నెంతగ నవనత మొనర్పవలయునో యాథార్థ్యపూర్ణమగుజిహ్వ నెంతసామ్యముగఁ జేయనగునో, తనప్రభుత్వముమాటమఱచి, బానిసగనుండియే తన్నుఁదాను ధన్యుఁడనని యేరీతిఁ దలఁపనగునో—గూఢమగునీరాజనీతితత్త్వమంతయు, జ్ఞానశూన్యయగునీబాలిక యెట్లెఱుంగఁగలదు ? ఈమె తనయమాయకపుమాటలతో నేమిచెప్పుచున్నదో దానికే మనము సంతసింపవలయును.

చంపతరాయలమాటలవిని యాతనిపైఁ గోపదృష్టులఁబఱపి మరలఁ గంచుకిరాయలు « సరియే. అప్పుడేమైనది. » అని తనలెఁజయా నడిగెను.

బాలిక—వారు మమ్మునలువైపులఁ జుట్టుముట్టి చాలసేపు లెను

లోఁడాము సంభాషించుకొనుచు, మమ్ముఁజూచి నవ్వుచుండిరి. వారి సంభాషణమువలనఁ గొంచెమావేశముతో వారు విమలదేవుని నన్ను నవమానించుచు మాటలాడుచుండిరనిమాత్రము నేనెఱింగితిని. ఢిల్లీ యువరాజుమందిరమున నుండఁదగుసుందరివని నన్నును, సార్వభౌమాస్థానమున సేవకుఁడుగనుండఁదగునని విమలదేవునిఁ బేర్కొని వారు మమ్మవమానించిరి. (అప్పుడామెవదనము క్రోధారుణమయ్యెను. మఱిమాటాడఁజాలదయ్యెను.)

చంప — వినుము. కంచుకిరాయా! నీసార్వభౌముని జాతిసోదరులు నీకొమరితవిషయమున నేమనుచుండిరో వినుము. నీకొమరితె నొక్కతెనే కాదు. తమయధీనముననున్న స్త్రీపురుషులనందఱ నీరాక్షసరాజోద్యోగులెల్లప్పుడిట్లవమానించుచునే యుందురు. మనరాజకన్యలమానుషమగు తమవిషయలాలసఁ దీర్చవలయుననియు, సుకుమారులగు మనరాజకుమారులు తమయాస్థానముల బానిసలై యుండి తమనిష్ఠీవనపాత్రముల నెత్తుచుండఁదగుదురనియు, మనశిల్పనైపుణ్యమాత్మదేవమందిరవిధ్వంసమునకే వినియుక్తము కాఁదగుననియు, ఢిల్లీచక్రవర్తియు, వానిజాతివారలు నెంచుచుందురు. బుందేలఖండరాజకన్యకలను, చౌకగ సంగడియందు దొరకు ఫలములుగను, మనరాజపుత్రులను బిరుదమాంసఖండలోలములగుశునకములుగను వారెంచుచున్నారు. బిడ్డా! నేను ఝాంఝేరరాజకన్యననియు, విమలదేవుఁడోర్ఛారాజకుమారుఁడనియు నీవు వారికెఱింగింపలేదా!

బాలిక — మాయోగ్యతనెఱింగి మమ్ము శీఘ్రముగ విడిచివైతురను నాశతో నేను వారికి మావృత్తాంత మెఱింగించితిని. కాని, యప్పుడు వారు మమ్ము విడుచుటకుమారుగ ఢిల్లీయువరాజునెదుటికిఁ గొంపోవ నిశ్చయించుకొనిరి.



చంప — (కంచుకిరాయలతో) రాజా! వినుచున్నావా!

కంచు — ఆఁ. అంతయువినుచున్నాను. నీవు వినిపింపనక్కఱ లేదు. ఇంద్రునియమరావతిని మించిన ఢిల్లీని, నప్సరసలసిగ్గుపఱిచెడి చక్రవర్తియంతఃపురకాంతలను, నింద్రాధికభోగియగు ఢిల్లీసార్వభౌముని నీవెంతదనుక దర్శించుకొనవో, యంతదనుక ముసల్మానులవాస్తవికమహత్త్వము, నైశ్వర్యము, బలము మున్నగువాని నీవెఱుంగఁజాలవు.

చంప — రాజా! సార్వభౌమునిమాయవైభవము నీకన్నులఁ జెదరఁగొట్టివైచినది. లేకున్న నీవాయైహికనరకము నమరావతితోఁ బోల్పవు. ఈలోకమున నెవ్వఁడైన లజ్జావిహీనవిషయకాల్యముల జన్మస్థానమును, విలాసాలస్యములయావాసమును గనుఁగొనవలయు నన్న, నత్యంతక్రౌర్యములును, సర్వదుర్గుణవ్యసనములును నేకత్రితములుగ నుండఁ జూడవలయునన్న నట్టివాఁడు ఢిల్లీకిఁ బోనగును. కాని, విషయలోలత విలాసమనియుఁ, గ్రౌర్యము శౌర్యమనియు, నలసత సుఖమనియు, వ్యసన మానందమనియు నెంచుమూర్ఖులు భ్రాంతులై ఢిల్లీ నిహలోకస్వర్గ మనుచున్నారు. ఎంతకాలమీదేశమాతగర్భమున నిట్టి మూర్ఖు లుదయించుచుందురో యంతదనుక నీదేశము పరరాజులబారి నుండి విడివడుట మిగులగష్టసాధ్యము. అగుఁగాక! ఈరీతిగశోకించుటకెంతేనవకాశమున్నది. (విజయతో) బిడ్డా! పిమ్మటనేమైనదో చెప్పుము.

విజ — అట్లునిశ్చయించుకొని వారు కొలఁదిసేపు విశ్రమించిరి. ఇంతలో వారినిఁ బోలినవాఁడే వారికన్న మూల్యవత్తరములగువస్త్రముల ధరియించిన మఱియొకఁడటకువచ్చెను. వాఁడు రాగానే వారందఱు వానికి నమస్కరించిరి. దానిఁగాంచి వాఁడు నాయకుఁడని మేము గ్రహించితిమి. వారందఱు వానికి మమ్మెఱింగించి తమనిశ్చితముఁ దెలియఁజేసిరి. అదివిని వాఁడు నవ్వుచు "సార్వభౌమాస్థానమున నున్న

తపదవులను నాసనములనుఁ బడయఁగోరి భారతీయ భూపతులందఱు స్వీయముగఁ దమకన్యలను సార్వభౌమాంతఃపురమున నప్పగింప నాశించుచున్నారు. తమరాజకుమారులు చక్రవర్త్యాస్థానమున బానిసలుగనుంటకేకాని రాజ్యకార్యముల నిర్వహింపఁదగరని వారిప్పుడు గ్రహించినారు. అందుచే నేఁడు పూర్వమునఁబోలె నిర్బంధించి చక్రవర్త్యంతఃపురమునకై, వారిరాజకన్యలను బానిసతనమునకై రాజకుమారులను గొనిపోవ నక్కఱలేదు. వీరిని విడిచిపెట్టుఁడు. స్వయముగనే వీరు సార్వభౌమాస్థానమును జేరుదురు." అనినుడివెను.

హీరా—అవునవును. అతఁడాడినమాట సరిగనున్నది. ప్రస్తుతమున మాకు సార్వభౌమునిదర్శనము లభించుటయే లేదు. లేకున్న విమలదేవకుమారుఁ డీపాటికిఁ జక్రవర్తిసేవలో నియుక్తుఁడై యేయుండెడివాఁడు.

చంప—ఓభగవంతుఁడా! ఎచ్చటనున్నావు! ఇట్టిద్రోహులు, దాస్యలోలురునగువారిబారినుండి దేశమునకు విముక్తియెన్నటికి! హీరాదేవీ! మాటలాడుటకుముందుగ బాగుగనాలోచించుకొమ్ము. ఆత్మరక్తస్రావముచే దేశస్వాతంత్ర్యముఁ గాపాడిన భర్తుఁడగురుద్రప్రతాపునివంశములోనివాఁడు మ్లేచ్ఛులయాస్థానమున బానిసయై యుండ సిద్ధపడుటఁ గాంచి యీదేవీశిలావిగ్రహమునకుఁగూడఁ గన్నుల నశ్రువులొలుకుచున్నవి.

హీరా—(అనాకర్ణితముగ) విజయా! తరువాతనేమైనది? చెప్పుము.

విజ—ఆనాయకుఁడు మాకటనుండివెడలిపోవ ననుమతినొసంగెను. మేమును దేవీపూజాసమయమున కందుకొనఁగోరి యచటినుండిబయలుదేఱితిమి. ఇంతలో వాఁడీసామీప్యమున నేదేనిదేవా



లయమున్నదాయని మమ్మడిగెను. ఆసమయమున నేను వానియభిప్రాయ మెఱుంగక నిష్కపటముగ సమీపముగనే వింధ్యావాసిన్యాలయ మున్నదనియు, నేఁడువార్షికోత్సవమగుటచే బుందేలభూపతులందఱు సర్వజనులు నచటఁ జేరుదురనియుఁ దెలియఁజెప్పితిని. అంతవాఁ డుత్సవ మెప్పుడారంభింపఁబడునని యడిగెను. అప్పటికిని వాని యభిప్రాయము నాకుఁ దెలియదయ్యెను. సూర్యోదయమైనతరువాతఁ బదిగడియలకుఁ బూజారంభమగునని నేనెఱింగించితిని. పూజారంభమున కింకను రెండుగడియలయవకాశమున్నదనియు నీలోన నటకుఁ బోయి దేవ్యాలయము ధ్వంసమొనర్చెదననియు వాఁడనెను. ఆసమయమున నాహృదయము కంపించిపోయెను. విమలదేవుఁడును నిర్విణ్ణుఁడై నాసమీపమున నిలిచెను. దేవ్యాలయవృత్తాంతముఁ జెప్పి మహాపాతకమొనర్చితిఁగదాయని నామానసము పశ్చాత్తాపపీడితమయ్యెను. వింధ్యావాసినీమందిర మచటికి సమీపముగనే యున్నను గోత్రహారికదిసుగమము కాదుగదాయని నేనూహించితిని. ముందుగ నడచుచుండి దేవ్యాలయమార్గముఁ దనకుఁజూపుచుండవలయునని వాఁడు నాతోఁ జెప్పెను. నేనుగూడ దేవ్యాలయముంజూపఁగూడదని నిశ్చయించుకొని నాయభిప్రాయము విమలదేవున కెఱింగించితిని. వారినందఱిని మేముపెడదారింబెట్టి నడిపించుచుంటిమి! వారును సంతోషమున వివిధాలాపము లొనర్చుచు మావెంట వచ్చుచుండిరి. ఈవిధముగ మేమాలయమునుండి దూరముగఁ బోవుచుంటిమి. ఇంతలో దూరమునుండి యశ్వారూఢులై వచ్చుచున్నఛత్రసాలదలపతిరాయులు కానవచ్చిరి.

శుభ—మీ వెంటవచ్చుచున్నయవనులెందఱుండిరి?

విజ—నాయకసహితముగ నిరుపదిమందియుండిరి. కాని, నా

రిలో నధికులు నిరాయుధులై యుండిరి. సమీపమునకు రాఁగనే వీరినెటకుఁ గొనిపోవుచున్నారని ఛత్రిసాలుఁడు నాయకు నడిగెను. ఆప్రశ్న కవమానకరమగు హాస్యము తప్ప మఱియొక ప్రత్యుత్తరము రాకుండుటచే విమలదేవుఁ డంతయు సంగ్రహముగ నెఱింగించెను. అదివినఁగనే యిరువురు రాజకుమారులును "దేవాలయమార్గము భక్తులకు సుగమమేయైనను మీయట్టిదుర్మార్గుల కది కడు దుర్గమము; అపాయకరము" అనుచు ఖడ్గములదూసి వారిపై దుమికిరి.

పర్వ — ఏమంటివి! ఇరువురు బాలకు లిరువదిమందివీరుల నెదుర్కొనిరా! చిన్నతనమన్న నిదియే. శుభకరణా! మీదలపతి యీ ఛత్రిసాలునితోఁ గూడి చెడిపోవుచున్నాఁడు. ఈ బాలకులమౌర్ఖ్యమునకుఁ దగుదండన మొసంగవలయును.

కంచు — బహుశః వాండ్రిచ్చటనే దండింపఁబడియుందురు. కాక యుదారులగు నాయవనవీరులు పిన్నవాండ్రని విడిచివైచినను వారిచటికి వచ్చినంతనే తప్పక దండన మొసంగఁదగును. తమపాలకజాతిసోదరుల నవమానించుటయే! ఎంతమాట! వారొకయాలయముఁ బడఁగొట్టిన మఱియొకయాలయము మనము నిర్మించుకొందము. ఇళ్లకుఁ గొఱఁతయేమియు లేదుకదా! (విజయతో) మంచిది చెప్పుము. ఆపిల్లవాండ్రిచ్చట నెట్టియపచారముఁ గావించిరి?

విజ — వారచ్చట నెట్టియపచారము నొనరించియుండలేదు. ఆయిరువదిమందియవనులతోఁ బోరొనర్ప మొదలిడిరి. ఒంటరియగు నభిమన్యునిఁ గౌరవులందఱు నెదుర్కొనినట్లు వారినిరువురి రాక్షసులెల్లరు నెదుర్కొనిరి. పురుషుఁడగు విమలదేవుఁడే యీపోరాటముఁ జూడఁజాలఁడయ్యెను. ఇంక నావిషయమునఁ జెప్పఁదగినదేమి? ఒక్క ఛత్రిసాలునిపై నార్గురుయవనులు కత్తులదూసి దుమికిరి. ఆయాఱుఖడ్గముల



లో నొక్కటియు ఛత్రిసాలు నధికముగ గాయపఱుపలేదు. దలపతికుమారుఁ డొక్కఁడును బదిమందితోఁ బోరుచుండెను. ఘోరమగు నాపోరాటమునుగనఁజాలక నేను కన్నులుమూసికొంటిని. మరలఁ గన్నులు తెఱచునప్పటికి సహాసముగ విమలదేవుఁ డెదుట నిలువఁబడి యుండెను. సమీపముననే రక్తస్నాతులై నలువురైదుగురుయవనులు భూమిపై దొర్లుచుండిరి. యవననాయకునిదర్పమంతయుఁ జూర్ణీకృతమయ్యెను. వాఁడవనతశిరస్కుఁడై నిలిచియుండెను. ఛత్రిసాలదలపతికుమారు లిరువురునుగలిసి వాని బంధించుచుండిరి. "దేవీపూజాసమయమగుచున్నది. నీవు పరుఁగిడిపోయి కొలఁదిసేపటివఱకుఁ బూజ నాఁపియుంప స్వామిని బ్రార్థింపుము. ఇంతలో మేమీయవననాయకుని బంధించి యచటికిఁ గొనివత్తుము." అని ఛత్రిసాలుఁడు నావంకఁజూచి పలికెను. యువరాజుమాటలను వినఁగనే నేను శీఘ్రగతి నిచటికి వచ్చితిని.

విజయమాటలు సమాప్తినొందుటతోడనే దేవాలయమండపసమీపమున జయధ్వానము వినవచ్చెను. ఆజయధ్వాన మతిమధురమై యుండెను. ప్రాణనాథస్వామి యప్పటివఱకు విజయమాటలను శాంతుఁడై వినుచుండెను. ఇప్పు డాతనియానందమునకు మేరలేకపోయెను. శీఘ్రముగనే స్వపాదావనతశిరస్కుఁడగు ఛత్రిసాలు నతఁడు చూడఁగలఁడు. కాని, యప్పటివఱకు నతఁడు తనప్రేమప్రవాహము నడ్డగింపఁజాలడయ్యెను. అదృశ్యుఁడగుపుత్రునిం గాంచిన తల్లికోమలహృదయమట్లు ప్రాణనాథునిహృదయము ప్రేమపూర్ణమయ్యెను. చిరత్యక్తమగుతనవత్సముం గలిసికొనఁబోవుగోవుభంగిఁ బ్రాణనాథుఁ డత్యాతురతతో మంటపముదెసకుఁ బరుగెత్తెను. ఛత్రిసాలునకుఁ దనకు నడుమఁగల కొలఁదియంతరమును ఛత్రిసాలుఁడే తొలఁగింపఁదగియుంట యతనికి గోచరింపఁజాలదయ్యె. జయధ్వానం

పుఁబ్రతిధ్వని వెలువడుటకుముందుగనే యాతఁడు మండపముంజేరెను. అచ్చటఁ దనకుఁ బ్రాణాధికుఁడగుఛత్రసాలకుమారుఁడు తనచరణరజముఁ గొన సజలనయనుఁడై నిలువఁబడియుండెను.

అల్పవిషయములఁగూడ నధికశ్రద్ధవహించువారునైత మప్పుడప్పుడు గొప్పదోసము లొనర్చుచుందురనుట యెల్ల రెఱింగినవిషయమే. ఈసిద్ధాంతమందలివాస్తవికతఁ జూపుటకో లేక మఱియేకారణముననో కాని, జగన్నిర్మాతయగు నాపరమేశ్వరుఁడు తనసృష్టినైపుణ్యము నొక్కమహాకళంకముపాలొనర్చెను. చంద్రసూర్యులసృజియించుట నవ్వులాటకాదని భగవంతుఁడెఱుంగును. అట్లయ్యు సూర్యునియందనావశ్యకమగుతైక్ష్ణ్యమును జంద్రునియందు మితిమీరినశైత్యమును గల్పించెను. లోకనిర్మాణసామర్థ్య మింకను బాగుగ నలవడనప్పుడు—సృష్ట్యాదినో—లేకనిర్మాణసామగ్రియంతయు నంతరించినతరువాత సృష్ట్యంతముననో—భగవంతుఁడుచంద్రసూర్యులనిర్మించియుండుటయే దానికిఁ గారణమైయుండవచ్చును. కాని, తననిర్మాణమందలియీదోసము నాజగన్నియంత తెలిసికొనెను. అత్యల్పములు, ననావశ్యకములు నగువస్తువులు నిర్దోషములుగను, ప్రధానవస్తువులే సదోషములుగను నుండుటఁగాంచినసహస్రనేత్రుఁడగు నాపరమేశ్వరునకు విచారముకలిగెను. అందులకే ప్రతివత్సరమున నాల్గునెలలకాల మాతనిసర్వనేత్రముల నశ్రువులు కారఁదొడంగెను. పరమేశ్వరునియీవిచారమును బాఱఁద్రోలుటకే బుందేలఖండ 'యొకప్రభామూర్తి నిగనెను. ఆప్రభామూర్తియందు భానునితేజము, శీతకరునిచల్లఁదనము రెండును గలిసియుండెను. సూర్యచంద్రులు తమగుణములనెల్ల గ్రహించి దోషములవిసర్జించిన భూలోకమందలియాప్రభామూర్తినిఁగాంచి యప్పుడు తమతమవిశేషాంశముల నామూర్తియం దారోపించిరి—ఒకనైపుఁ



ప్రతాపశాలియగుదలపతిరాయలు ప్రచండతేజమున వెల్గుచుండెను. మఱియొకనైపున నిష్కళంకుఁడగువిమలదేవునిముఖచంద్రుఁడు తనసౌమ్యతవెలిపుచ్చుచుండెను. బుందేలఖండసూర్యచంద్రులగునాయిరువురినడుమ నానూతనప్రభాపుంజము సంపూర్ణముగ వెలుగుచుండెను. ఆతేజమునసూర్యకాంతియందలిప్రచండతయుఁజంద్రకాంతియందలిరుచిరతయుఁగూడ సమ్మిళితములై యుండెను. ప్రాణికోటులకు నూతనజీవనతేజఃపరిపూరితములుగ నొనర్చుసూర్యునిగుణములును, శాంతిసుఖముల వర్షించుచంద్రునిగుణములును నేకత్రితములై యొప్పెను. ఆమూర్తి యొద్దఁజేరి ప్రాణనాథస్వామి గద్గదస్వరమున నిట్టులనియె.

“ఛత్రసాలా! నీవు ధన్యుఁడవు. ఇంతటిచిన్నవయసుననే నీధర్మనిష్ఠయు స్వాతంత్ర్యప్రియత్వమును బ్రకాశింపమొదలిడినవి.”

ఉదయభానుఁడు భూమాతపాదరజముంగొనఁగోరి వచ్చి ప్రభారంజితమగు నామెయంకమునఁ జేరి యెట్లుశోభిల్లునో, యట్లే ఛత్రసాలకుమారుఁడు ప్రాణనాథస్వామిమాటలనువిని తచ్చరణరజముఁగొనుటకై ముందఱికివచ్చి తద్బాహుమధ్యమునఁ బ్రకాశించుచుండెను.

ప్రేమపూర్ణమగునాగురుశిష్యులసమాగమముంగాంచినదలపతివిమలదేవులకుఁగూడ “మనము దివ్యజ్యోతులము కాము; ఐహికవ్యక్తులమే. సూర్యచంద్రులకార్యములవలె మనకార్యములు నిష్కామములుకావు; ఫలాపేక్షాసహితములై యున్నవి. ఛత్రసాలునికిఁగలిగిన యభినందనము మనకుఁగూడఁ గలుగవలయును.” అనుభావముజనించెను. ప్రాణనాథస్వామి దలపతిరాయలకుఁగూడ ఛత్రసాలునికిఁబోలె ప్రేమమయాలింగనమొసంగెను. కాని, విమలదేవునిమాత్రము దూరమునుండియే ప్రశంసించెను. ఆశాస్త్రప్రశంసతోడనే విమలదేవుఁడు

ప్రసన్నుఁడయ్యెను. బహుళః స్వామియాలింగనమున నాతని కంతటి యానందము కలుగదు.

నాఁటితనకుమారునియుత్తమకార్యమువిని చంపతరాయ లానందముంబట్టజాలకుండెను. అతఁడు ఛత్రసాలునిఁ దనయొద్దకుఁజేర్చుకొని ప్రియయుతముగఁ దచ్ఛిరముపైఁ జేతిఁబోనిచుచు నిట్లుచెప్పెను. “ నాప్రథమపుత్రుఁడగుసారవాహనుఁడు యవనులతోడియుద్ధమున హతుఁడయ్యెను. మహావీరుఁడగు నతనిమరణమున నీతల్లియు నేను నత్యంతదుఃఖాక్రాంతులమైతిమి. అంత నాతఁడు స్వప్నమునఁగన్పించి మీయింటమరలఁబుట్టి యవనులకుఁ బ్రతీకారమొనర్చెదనని చెప్పి మమ్మోదార్చెను. తరువాతఁ గొలఁదిదినములకే నీవు జన్మించితివి. ఐనను నా కాస్వప్నముపై సంపూర్ణమగువిశ్వాసము గలుగలేదు. కాని, నేఁటినీపరాక్రమమువినిన నాకు సంపూర్ణవిశ్వాస ముదయించుచున్నది. నాయాదర్శమును నేను పొందఁజాలకపోయినను నీవు తప్పక దానిని సాధించెదవనుసంపూర్ణవిశ్వాసము నాకుఁ గల్గినది.” ఈరీతినుడివి చంపతరాయలు ఛత్రసాలునిఁ గౌఁగిలించుకొనియెను. అప్పటికి దలపతిరాయకుమారుఁడు తనతండ్రియగుశుభకరణునియొద్దకుఁబోయి కూర్చుండెను. విమలదేవకుమారుఁడును దనతల్లియొద్దఁగూర్చుండెను. విజయ మాలనుజేతఁగొని దేవికర్పణమొనర్పఁదగుసమయమును నిరీక్షించుచు సమీపముననే నిలువఁబడియుండెను. ప్రాణనాథస్వామి దేవీపూజారంభమొనర్చెను.

పూజ సమాప్తినందఁగనే స్వామి రాజులనందఱిని దేవీప్రసాదస్వీకరణమునకై మందిరాంతర్భాగమునకుఁ జేర నాజ్ఞాపించెను. వింధ్యవాసినీదేవి స్వర్ణసింహాసనస్థయై విరాజిల్లుచుండెను. దేవి కెడమువైపున బ్రాణనాథస్వామి నిలిచియుండెను. దక్షిణభాగమున విజయ



తనమాలఁగొని నిలిచియుండెను. దేవీచరణవిన్యస్తమస్తకుఁడై ఛత్రసాలుఁడుండెను. చంపతరాయశుభకరణులు ప్రాణనాథునిసమీపమున నిలువఁబడియుండిరి. హీరాదేవీసహితుఁడగుపర్వతసింహుఁ డొకమూల నిలువఁబడి కంచుకిరాయలతో నేదియో మాటాడుచుండెను. ఎల్లర నుద్దేశించి ప్రాణనాథుఁ డిట్లుచెప్పెను—

“ మహారాజులారా! ఎప్పటివలె నేఁటిమహోత్సవము మహానందముతో నిర్వర్తించితిమి. కాని, రాఁబోవువత్సరమునఁగూడ మనమీరీతిననే యుత్సవము నిర్వర్తింపఁగలమా యనుసంశయము వొడముచున్నది. యవనులప్రాబల్యముతోపాటు వారిభారతీయవినాశనేచ్ఛయు దినదినాభివృద్ధి నందుచున్నది. ఇట్టిదుష్కాలమున మనయంతఃకలహములు వృద్ధిఁజెందుట మనదౌర్భాగ్యము; మనబుందేలఖండము భారతవర్షసౌందర్యమునకుఁ గేంద్రస్థానము; సృష్టిసుందరీవిలాసభవనము; లక్ష్మీక్రీడామందిరము; ప్రథమమున భోగపరాయణులు, ధనలోలురునగుయవనభూపతులు, బుందేలఖండము నంటసాహసింపలేదు. దేశరక్షణపరులగుబుందేలనాయకులు స్వాతంత్ర్యపాలనమునకై, ధర్మరక్షణమునకై, దేశగౌరవరక్షణమునకై యన్యోన్యవైరములమఱచి యాహవరంగమున స్వాతంత్ర్యైకపతాకాచ్ఛాయ నిలువఁబడియున్నంతదనుక బుందేలఖండసౌందర్యవీక్షణము గూడ యవనులకు భయంకరముగ నుండెను. రాజనీతి, సైన్యబలము, మతసహనము మొదలగువలలఁబన్ని యేదూరదేశములజయింప నక్బరుప్రయత్నించియు విఫలప్రయత్నుఁడయ్యెనో, యాదేశములనే జయింప జహాంగీరును, షాజహానుఁడుఁ బ్రయత్నించిరి. బాహుబలమును, ధర్మబలమును, నాధారములుగఁగొని విజయమునందెడిబుందేలఖండము నిష్కారణముగఁ బారతంత్ర్యపంకమగ్నమగుటఁగాంచినఁ దోఁచిదేశముల కాశ్చర్య

ముగలిగియుండవచ్చును. కాని, నేఁటిబుందేలఖండావస్థఁగాంచిన, నేరికి నచ్చెరువుజనింపదు. ఐక్యసూత్రమునఁ గూర్పఁబడియుండిన వెనుకటివీరమాల ప్రబలకాలచక్రాఘాతమున వినష్టమైపోయినది. ఆమాలలోనిసుగంధితములు, తేజోవంతములు, దుర్లభములునగుపుష్పములు నేఁడును బుందేలఖండమున నధికముగనే యున్నవి. కాని, యవి వెనుకటివానివలె నంతబాగుగఁ గూర్పఁబడియుండలేదు. ప్రథమమున నవి దేవతాధారణయోగ్యములై యుండెను. కాని, నేఁడు చంపతరాయలఁబోలు రెండుమూఁడుతప్ప మిగిలినవన్నియు సాధారణముగ నసురశోభావర్ధనలోలములై కన్పట్టుచున్నవి. అనేకపుష్పము లరణ్యముననే శుష్కములై నశించిపోవుచున్నవి. శుభకరణా! పర్వతసింహా! నేను చెప్పినదంతయు వినుచున్నారుగదా! మీరాసురపాదముల నలంకరింపకుందురుగాక! ఐక్యసూత్రమున బద్ధమై భక్తిసుగంధశోభితమై వింధ్యవాసినీస్వాతంత్ర్యదేవికంఠము నలంకరింపఁదగుమాలికారూపమునందుందురుగాక! విజయా! ఇదియే నీమాలనర్పింపఁదగుసమయము. మనోహరమగునీమాలను దేవిచే ధరింపఁజేసి రాఁబోవువత్సరమున నిట్టిదేయగుసజ్జనమాల నిన్నలంకరింప నిచటికి వచ్చునని యామెకు విన్నవింపుము."

ప్రాణనాథస్వామియాజ్ఞఁబొంది విజయ మాలఁగొని ముందటికి వచ్చెను. విమలదేవుసహాయమునఁ గూర్చినయీహారము నేనొంటరిగ దేవికెట్లర్పింతునని యప్పుడామె సంశయించెను. ఆమె విమలదేవునివైపు చూచెను. ఆతఁడును దాను మాలనర్పింపవలయుననియే యాలోచించుచుండెను. విజయ తనహస్తము నల్లనెత్తియుంచెను. విమలదేవుఁడు సమీపింపఁగనే సమవయస్కులగునామిత్రులిరువురును దమహస్తములనెత్తి దేవికంఠమున హారమునర్పింప సంసిద్ధులై యుండిరి. బాగుగనుండునని తమకుఁదోఁచినవిధమున నాహారము దేవికంఠమున నర్పించిరి. ఇంతలో నాహారముజారి దేవిపాదములకడ నవనతశిరస్కుఁడై యుండిన ఛత్రసాలునికంఠమునఁ బడెను. దేవీకంఠహారము ఛత్రసాలకుమారునికంఠమున శోభించుట యెల్లరికి నాశ్చర్యకరమయ్యెను. ఛత్రసాలుఁడు దానిని దనకంఠమునుండి తొలఁగింపనుండ స్వామి వారించియిట్లనియె—



"వీరకుమారా! ఇదిదేవీప్రసాదము. దీని ననాదరమొనర్పకుము. విమలవిజయులహారము నీకంఠముననే యధికతరముగ శోభించునని వింధ్యావాసినీదేవికూడ నెంచుచున్నది. తన్నుఁ బావనముగను శ్రేష్ఠముగనుజేయు దేవిని గాపాడితివని వింధ్యాచలము నీకే యీయుపహార మర్పించుచున్నది. దేవియు స్వయముగ నీహారము నీకొసంగి నీశౌర్యమునకై ధర్మనిష్ఠకై నిన్నభినందించుచున్నది. మనోహారమగు నీవనపుష్పహారము నాగరుకులగువిజయావిమలదేవులచేఁ గూర్పఁబడినది. వింధ్యాచలస్థైర్యముచేతను దేవీపవిత్రతచేతను స్పృష్టమగుటచే స్వాభావికములగుదానిసౌగంధ్యవైమల్యములతో స్థిరతాపవిత్రతలు సమ్మిళితములగుచున్నవి. నేఁడు నీవు విజయివగుటంజేసి దేవి మధ్యస్థగ నుండ విజయావిమలదేవులహస్తములనుండి యీహారము నీకులభించినది. దీనిని స్వీకరింపుము. భవిష్యత్కాలమున నీవొనర్పఁబోవునిరుపమానస్వాతంత్ర్యదేవీసేవ కిదియెంతయు శుభసూచకము. ఈదేవీప్రసాదము నెంతమాత్రమును నిరాకరింపవలదు."

ఛత్రసాలుఁడు స్వామియాజ్ఞకు బద్ధుఁడనని చెప్పుచు నాహారమును శిరసావహించెను.

అప్పటివిజయస్వరూపము దర్శనీయమై యుండెను. ఛత్రసాలకంఠశోభితమగు తనహారముంగాంచి యామె లజ్జామూర్తియయ్యెను.

ఆమెకపోలము లెఱ్ఱవాఱెను. ఇతస్తతోగమనలోలములగునామె నేత్రములు సంకుచితభావముం బొంది భూమిపై బ్రసరింపఁ బోయెను. ఇంక నాముఖ మెవ్వరికిని జూపరాదనునిశ్చయ మప్పు డామెకుఁ గలిగెను; తన్ను మఱుఁగుపఱుచుకొనఁగోరి నెమ్మదిగఁ దలుపును దనపైపునకు లాగికొనెను. ఆసమయమున రాజులందఱు దేవీప్రసాదమును స్వీకరించి స్వస్థానముల కేఁగుచుండిరి. వారిఁజూడఁగనే విజయ యటనుండి పాఱిపోయెను. ఎదుట విమలదేవుఁ డామెకుఁ గానవచ్చెను. ఆమె యతనివైపునకుఁ జూడ నాతనిస్వరూపముఁగూడ నట్లేయుండెను. విజయనుగాంచి విమలదేవుఁడిట్లనెను. "విజయా! మనము సిద్ధమొనర్చి నహారము తుదకు ఛత్రసాలునికంఠమునఁబడినది."

విజయ—"ఐన ననుచితమేమైనది?" యని చెప్పనెంచెను. కాని, యామె తనమనసును నిరోధించుకొనెను; ఏమియుననలేదు.

ఎల్లపుడు నిరర్గళవర్తనమొనరించువిజయ కాత్మదమనమొనరించుకొనుట కామెజీవితమున నాఁడే మొదటిసారి.

---

# రెండవప్రకరణము

## వింధ్యావగాహము

వింధ్యాచలము చంద్రుని నిర్మలకౌముదీగర్భమున నవగాహ మొనర్చుచుండెను. గభీరగంగాప్రవాహము నీక్షించి విహారలోలుప మగు మదగజము వేడుకపడుభంగిఁ దుహినకరుని విమలకాంతిసాగరముం గన్గొని వింధ్యనగ మమితానందభరితమయి కన్పట్టుచుండెను. వింధ్యాచలమందలి యర్ధవర్తులభాగమును దొండముగ భావించి, యున్నతశిరమున కిరుప్రక్కల వెలయు కర్ణములవలె నొప్పుచిన్నిగుట్టలఁ జంచలములుగ భావించినచోఁ బరిశుద్ధగంగాప్రవాహమునఁ గిరిరాజము సంప్రీతితోఁ గ్రీడలాడుచున్నట్లు తోఁచును. పర్వతోపరిగతములగు రమ్యవృక్షములవలనను, పాదస్థితమగు వింధ్యవాసినీమందిరమువలనను, దానిపై వెలుంగు రజనీకాంతునివలనను నీకల్పనకుఁ జాలసేపటివఱకు లోటు వాటిల్లుటలేదు. ఆలయసామీప్యముననున్న శిబిరములుగూడ నేతత్కల్పనాపోషణమునకు సాయ మొనర్చుచునే యుండెను. చూచుట కది విశుద్ధచంద్రికగాఁ గాక, విమలగంగాప్రవాహముగఁ గన్పట్టుచుండెను. తన్మధ్యమున వింధ్యనగము గజరాజువలెఁ గన్పట్టుచుండెను.

కఠినమగు ప్రశ్నమొకటి గలుగవచ్చును—వింధ్యాచలమునకు స్నానావశ్యకత యేమికలిగెను? అగ్నికి విశుద్ధిం గూర్ప నావమునఁబెట్టుట, పరిశుభ్రమగు జలమును గడిగి నిర్మలమొనర్ప యత్నించుట, పాలకుఁ దెల్పుహెచ్చించుట కెద్దియే నుపాయముసేయుట, యెంతటి నిరర్థకములు, యుక్తిహీనములు నగునో, పవిత్రవింధ్యపర్వతమును

స్నానమాడించుటయు నంతవ్యర్థముగను, వికృతముగను దోఁచును. కాని, వింధ్యాచలము తనస్నానమునకై పశుపక్షిమనుష్యాదిసమస్తలోకము విశ్రమసౌఖ్యానుభవమందుసమయము నెన్నుకొనెను. సమీరణుఁడు శాంతియుతముగఁ దరుపత్రముల నిద్రించుచుండ, నవిరళగమనమున వెలయుసలిలప్రవాహముగూడ నవయవములు సాఁచి విశ్రాంతిఁ గొనుచుండ, నాప్రశాంతసమయమున వింధ్యాహార్యము తనస్నానము మొదలిడెను. కావుననే తనకృత్య మెవ్వరును జూచుట లేదని యది తలంచుచుండెను.

వింధ్యావగాహము బాగుగ సాఁగుచుండెను. చంద్రుఁడు తన సకలకళలచేతను దానిపైఁ దనపీయూషమును వర్షించుచుండెను.

ఇంతలో దేవ్యాలయము చెంతనున్న యొకశిబిరమునుండి శుభకరణుఁడు వెలుపటికి వచ్చెను. అతఁడు మొదట భీతచిత్తుఁడై దేవీమందిరమువంకఁ జూచెను. పిదప నించుక కుపితుఁడై దృష్టిఁ బఱపెను. తుదకుఁ జాలనచ్చెరువుతో వింధ్యగిరివైపునకుఁ జూడఁదొడఁగెను. అతని కంట నిద్రయనుమాట లేకుండెను. రాత్రి మేల్కాంచుటచే నతని మొగము వాడియుండెను. దానిపైఁ జింతాచిహ్నము స్పష్టముగఁ గన్పట్టుచుండెను. నిశాకాంతుని యమృతవర్షముచేనైన నతనిచింత యంతయు శాంతింపలేదు.

ఆమోహనమగు శాంతిసమయమున రోగజీర్ణితుఁడు గూడ నించుకసేపు విశ్రాంతింగనును. సంపదలేకుంటచేఁగాని, మిక్కుటముగ నుంటచేఁగాని యెల్లప్పుడును మేల్కనియుండు లక్ష్మీదాసులుగూడఁ గొంచెముసేపు విశ్రమింతురు. కాముకులును గొంతసేపటివఱకు విరహము సహింప సంసిద్ధులగుదురు. కాని, యేశుభకరణునియంగము స్పృశించుటకేనియు నెన్నఁడు నీరోగమునకును సాహసము గలుగదో, యేశుభకరణుని వజ్రనిభంబగు హృదయస్థైర్యము కలిమిలేములచేఁ గదలికఁ గాంచదో, యేశుభకరణుఁడు ప్రణయమునకుఁ బ్రశ్రయము వాటిల్లినను లెక్కగొనఁడో, యట్టిశుభకరణుఁడు చింతాక్రాంతుఁడగుటఁజూడ మిగుల నాశ్చర్యము గలుగకమానదు. తనప్రతినకొఱకు, మనోనిశ్చయముకొఱకు సుఖదుఃఖములఁ ద్రోసిపుచ్చి, నిశ్చలజీవనముంగడపువీరుఁ డెవ్విధమునఁ జింతాజాలకంబునఁ జిక్కెనో యెవరు చెప్పఁగలరు ?

చాలసేపటివఱకు శుభకరణుఁడు తదేకదృష్టితో వింధ్యాచలమువంకఁ జూచుచు నిలిచెను. అతనిముఖమునందలిచింతారేఖ యానంతయుఁ దగ్గకుండుటయేకాక యాప్రశాంతవదనము చంద్రునివలె మఱింత వెలవెలఁబోవసాగెను.

ఇంకను వింధ్యాచలము చంద్రకాంతియందు మునిఁగియే యుండెను. శుభకరణుఁ డేతెంచుటచే దానిస్నానమున కంతరాయము గల్గలేదు. శుభకరణుఁడు శిబిరమునుండి వెలువడినప్పుడు నాయీస్నానము నాతనికిఁ బ్రదర్శించెదనని యెంచియే తనస్నానము నారంభింపనోపు !

కొంచెముసేపటికి శుభకరణుఁడు వింధ్యనగంబునుజూచి వికృతముగ నవ్వెను. ఆతనిహాసమునకుఁ బ్రతిధ్వనిరూపమున మఱింతబిగ్గరగఁ బ్రత్యుత్తరము లభించెను. అదివిని శుభకరణుఁ డిట్లు తలపోయసాగెను; “ ఈవింధ్యాచలము విమూఢమైపోయెనా యేమి ! ఇంతటిపవిత్రతగల్గియు, నంగమున నంతయు మాలిన్య మెఱుఁగకయు, నిట్లు చంద్రకాంతియందు స్నానమాడుచున్నది ! మాలిన్యముండినఁగదా స్నానము ! ఈపర్వతమున నంతయు మాలిన్యము లేదే ! ఇందు

వికసించుపుష్పములకు నాకసమందలితేజమును, శిశువులహృదయమును నుపమానముగ నీయఁదగు; పరమపూజ్యులగు దేవతలశిరములపై వానిని స్థాపింపనగును. దీనిపుణ్యప్రవాహమున బహిరంగస్నానమువలన నంతరంగమాలిన్యము తొలఁగును. ఇంతటిపరిపూతమగు గిరిరాజము స్నానమాడుట సాధ్యము, కాక మఱేమి!" మరల శుభకరణుఁడు వికటముగ నవ్వెను.

ఆతనియుపహాసరవము పర్వతోపలంబులతోఁ ద్రుటికాలము ఖేలన మొనర్చి యథాస్వరూపమున మఱలివచ్చెను. కాని, యాత్రుటికాలములోనే శుభకరణుఁడు తనకల్పనారాజ్యమునఁ జాలదవ్వుగఁ బోయెను. ఆతఁడు మనమున నిట్లు తలఁచెను. "నైర్మల్యమునకుఁ బుట్టినిల్లగు వింధ్యాచలమునకే విశుద్ధమగుట యావశ్యకమని తోఁచినప్పుడు వివిధవికారభరితులము, నపవిత్రభావపూరితులము, కామక్రోధాదిగ్రస్తులము నగుమనవంటిమనుజుల మేల మనశ్శుద్ధిఁ జేసికొనకుండవలయును!" పర్వతమధ్యమున హాస్యప్రతిధ్వని వెలువడుటతోడనే తన్నుఁజూచి వింధ్యాచలము వికటముగ నవ్వుచున్నదని యాతఁడు తలఁచెను. వింధ్యమువంటి నిర్జీవపదార్థముగూడఁ దన్నుఁజూచి హాసించుటచే నాతఁడు తనలోఁదాను మిగుల సిగ్గుపడెను. సిగ్గుచేత నతనివదనము చిన్నవోయెను. వింధ్యావగాహనయాత్ర మట్లే జరుగుచుండెను.

ఇంక శుభకరణునకు వింధ్యావగాహము మౌర్ఖ్యమూలకముగఁ గన్పింపక మిక్కిలి ప్రశంసాపాత్రముగఁ జూపట్టఁదొడఁగెను. వింధ్యాచలము స్వభావనిర్మలమయ్యు నావంటిపాపులకు "మీరుగూడ మీకలుషహృదయమును నిర్మలమొనర్చుకొం" డని మూకభాషమున నుపదేశ మొనర్ప యత్నించుచున్నదని యాతఁ డెంచెను. ఆపగోపకారమునకై యతఁడు మనముననే వింధ్యాచలమున కెన్నియో ధన్యవాదము లొసంగెను. ఆతఁడు మనమున నిట్లు పలికెను: "ఓ వింధ్యాచలుఁడా! నీవు ధన్యుఁడవు. నీయందుఁ గలుషమనుమాట లేదు. దోషము నిన్నుఁ దాకనైనఁ జాలదు. నీయందుఁ బవిత్రత రూపముదాల్చి వసించును. నీయందలిపారిశుద్ధ్యమునకు మేఱలేదు. ఐనను నీవు స్నానమావశ్యకమని యెంచితివి. జ్ఞానసంపాదనాతత్పరులగువారికి జ్ఞానము పూర్తియైనదని యెన్నఁడును దోఁచదు. నీవరుసయు నట్లే. కాని, నేను చాలభిన్నమార్గమున నున్నాను. జ్ఞానహీనుఁడు తన్నుఁదా జ్ఞానసంపన్నుఁడనని ప్రకటించికొని సరియగు జ్ఞానమును దుచ్ఛమని యెంచును. వ్యసని యొకవ్యసనమువీడి యనేకములఁ జిక్కును. మాలిన్యహేయమగు శునకము తన్నుఁదాఁ బరిశుద్ధమొనర్చుకొననెంచి కీటభరితమగు కర్దమహ్రదమున మునిఁగి మాలిన్యమును రెట్టించుకొనును. నా యాలోచనావివేకములకుఁగూడ సరిగ నట్టిస్థితియే కలిగినది. నాజ్ఞానము సంపూర్ణముగ సంభ్రాంతమయినది. నాచిత్తము నన్ను మాఱుమూలకుఁ గొంపోవుచున్నది. ఏనాబంధునిరక్షింప నాకరవాల మొఱనుండి వెలువడవలసినదో, యాబంధురుధిరమునకై యది నేఁడు దప్పిగొని యున్నది. ఏదేశపుఁ బారతంత్ర్యమును భగ్నమొనర్ప నాప్రాణము లర్పింపవలసెనో, యాదేశముననే పారతంత్ర్యవిషవృక్షసేచనమునకు నాజీవనము వ్యతీతముగానయ్యెను. ఏదేశపుమంగళమునకై నామతి యెల్ల వినియోగపఱుపవలయునో, యాదేశమున కపకారమొనరింప నాబుద్ధిశాలితయెల్ల వ్యయపఱుపవలసివచ్చెను. బుందేలఖండక్షేమమునకై యసువుల నర్పించువారెల్లరు నాకుఁ బరమశత్రువులని భావించుచున్నాఁడను. ఈదేశపుఁ బ్రజలకు సౌఖ్యముఁ గూర్చువారు నాకుఁ బ్రతిపక్షులు! బుందేలఖండస్వాతంత్ర్యపతాకాతలమున నిలుచువారె

ల్లరు నాకు గాఢవైరులు! నామనఃస్థితి యెంతవ్యత్యయమైపోయినది! నాహృదయమాలిన్య మెంతపెంపుఁగాంచినది! గుణము దోషముగను సత్కర్మము దుష్కృత్యముగను, సద్భావ మసద్భావముగను భావించుచున్నాను! సదా నాకరములతో నేఁజేయుకర్మములచే నామనోమాలిన్యము నాహృదయాపవిత్రత, నాభావకాలుష్యము, వినష్టములగుటకుమారుగ నానాఁటికి వృద్ధిఁబొందుచున్నవి! నేనెంతటిదురవస్థంబడియున్నాను!"

పిదప శుభకరణునినోటినుండి చాలసేపటివఱ కొక్కమాటయైన వెలువడలేదు. ఆతఁడు కన్నులుమూసికొని శైశవసుఖస్వప్నముల ధ్యానించుచుండెను. స్వప్నసుఖానుభూతి నిద్రితపురుషుని మొగమున విస్పష్టమగుహర్షచ్ఛాయ నాపాదించురీతిని శుభకరణునిచింతానిమగ్నమగువదనమున సంతోషతరంగము లించుకసేపు ప్రసరించెను. కాని, క్రమక్రమముగ నాతనిధ్యానము శైశవమువీడి జవ్వనమునఁ బ్రవేశించుసరి కాయానందతరంగము లుపశమింపఁజొచ్చెను. కోమలములగు కుట్మలము లెల్లెడలఁ గమలిపోయిన ట్లతనికిఁ దోఁపసాగెను. ఈవృక్షపోతము మనోహరతరరూపమునఁ బుష్పించుటయు, ఫలించుటయు నేఁజూడఁజాలనని యాతనికి నిశ్చితమైపోయెను. "నాశైశవవృక్షంబునకు సమీపమున ననేకకంటకవృక్షపోతములు మొలిచినవి. క్రమక్రమముగ నవిపెఱిగి తొల్లిటికోమలవృక్షమునుగప్పివైచినవి." అని యతనికిఁ దోఁచెను. ఇప్పుడు శుభకరణునకుఁ దనమానసమున నాకంటకాకీర్ణవృక్షములుతప్ప వేఱేమియుఁ గన్పట్టుటలేదు. ఆతఁడు మిగుల వ్యథితుఁడయ్యెను. తనవెనుకటిదినములం గూర్చి యోజించుటాతనికిఁ జాల దుస్సహముగ నుండెను. పిదప నతఁడు కన్నులవిప్ప నెదుట నొకవనిత నిలువఁబడియుండెను. ఆమె యాతనివంకఁజూచి నవ్వుచుండెను.



శుభకరణునినేత్రములు విచ్చుటఁగాంచి యామె యిట్లడిగెను:—"ఇంతరాత్రివేళ మీరేమియోజించుచుంటిరో వచింపుఁడు."

శుభ—రాణీ! హీరాదేవీ! పగలెల్ల నాయీకాయము తన జడత్వము మఱచియు, మనసు తననిసర్గచాంచల్యమును వీడియుఁ బూర్ణముగ నీసేవయందే లగ్నములై వర్తించుచున్నవి. నేను నాయాశయముల లెక్కగొనక నీయుద్దేశము నెఱవేర్చుటకై, దినమెల్ల నిశ్చలయత్నము సలుపుచున్నాఁడను. ఉన్నతాశయము, భావశుద్ధి, యకలుషవర్తనము—వీనినెల్లఁ ద్రోసిపుచ్చి, నిష్ప్రాణయంత్రముభాతి నీకొఱకై పాటుపడుచున్నాను. ఇంతయైనను నీప్రశాంతనిశాసమయమునైనను బవిత్రనిష్కలుషశాంతభావములఁ గనుట నీవు సహింపఁజాలవా!

హీరా—ఆఁ! నేను మీరిట్లు పలుకుచున్నారేమి! మీరు నాకేమిసేవఁజేయుచున్నారు? నాయుద్దేశము ఏమిఫలించుటకు మీరెట్టియత్నములసల్పుచున్నారు? నిర్జీవయంత్రమువలె నాకై యెప్పుడుపాటుపడితిరి? ఓర్ఛానరపతులు నేటివఱకు మిమ్ముఁ దమతో సమానులగుమిత్రులుగనే సంభావించుచున్నారే! మనయందు సేవ్యసేవకభావ మెన్నఁడు నుదయింపలేదే!

శుభ—అవును. నీవుచెప్పినది సత్యమే. నేనోర్ఛారాజసభయం దుపస్థితుఁడనైనప్పుడును, మీకతిథినగునప్పుడును మీరు నాకొనర్చునాదరమునకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడనే. కాని, సుంత యీపైపై యాదరసత్కృతులఁదొలఁగించి వాస్తవస్థితిఁ దిలకించినచో నోర్ఛారాజసభయందు నాకులభించుసత్కారమెల్ల వట్టిబాహ్యప్రదర్శనమనియుఁ గృత్రిమమనియుఁ దెల్లమగును. సరే- ఆమాటలకేమి? పోనిమ్ము. ఈశాంతసమయమున నిట్టితుచ్ఛవిచారములపై మనసుం

పరామ. హీరాదేవీ! చంపతరాయనిస్వాతంత్ర్యయత్నములకు విఘ్న మాపాదింపవలసినచో, నాతనిపై విపత్పర్వతంబులఁ ద్రోయనగుచో, ఢిల్లీరాజసభయం దతనికి శిక్షవేయింపవలసినచో నట్టికార్యములకు రేపటిదినమెల్ల నుండెఁగదా! ఈనిశీథకాలమున నింతటిలో నతఁడు స్వాతంత్ర్యదుర్గమును వశమొనర్చుకొనఁడే! ఐశ్వర్యమెల్ల స్వాధీనపఱచుకొనఁడే! అట్టితఱి నీయర్ధరాత్రమున నాకడ కేతెంచుట కేమంత తొందరకలిగె! నాశాంతికి భంగముఁగూర్చుటకు నీకేమంతయావశ్యకముకలిగినది!

హీరా—తమసుహృత్సంఘము నెదుటఁ బ్రతినయొనర్చి, తమ జీవితకర్తవ్యము నొక్కమారుగ నిర్ణయించుకొని, గాఢముగ నెల్లప్పుడుఁ దత్పాలనమున విలగ్నులై యుండి, తమనోటినుండి వెలువడినమాటలను దమప్రాణములకన్న విలువగలవానిగ నెంచు శుభకరణులు, రాత్రివేళ శాంతియుతముగ నెట్లుగడపుచుండిరోయని చూడవచ్చితిని.

శుభకరణుఁ డధికారద్యోతకంబగు స్వరమున నిట్లు పలికె:—
“నారాత్రికాలము నేనెట్లు గడపుచుంటినో చూచుటకు నీకేమియధికారముకలదు? నాకర్తవ్యమును నేను నిర్ణయించుకొంటెని. కాని, యంతమాత్రమున నాసమస్తస్వాతంత్ర్యముఁగూడ నీహస్తమున నర్పివైచితినా యేమి?

హీరా—చాలవిచారకరము. స్వాతంత్ర్యము విక్రీతమైనదో లేదో. శుభకరణులస్మృతిశక్తి యంతమాత్రము తెలుపఁజాలకున్నది. శుభకరణులమస్తిష్క మీపాటి యోజింపలేకున్నది. ప్రతినఁదాల్చుకాలమునం దేనాదక్షిణహస్తమున మీరు వాగ్దానమొనర్చితిరో, యేనాకర్ణములు ప్రతిజ్ఞావాక్యముల నాలించినవో, యేనానయనములు మీముఖమునఁ బ్రతిజ్ఞాబింబమును బ్రత్యక్షముగఁ గాంచినవో, నా



నికి సంభాషణసామర్థ్య ముండెనేని, మీయీప్రశ్నమునకు సంపూర్ణమగుసమాధానము లభించియుండెడిదే. నేఁడు శుభకరణులు తమప్రతిన మఱచిపోవుచున్నారు. రేపు మనము మనుష్యులమా కామా యను భ్రాంతికూడఁ గలుగునేమో!

శుభ—రాణీ! నేను నాప్రతిజ్ఞ మఱచిపోవుట యసంభవము. ఏదుష్ప్రతిజ్ఞమూలమున నాశైశవసుకుమారాశయములెల్ల నశియించినవో, యేప్రతిజ్ఞారాహువు నాకర్తవ్యభాస్కరుని మ్రింగివైచినదో, యేప్రతిజ్ఞావిషవృక్షసామీప్యమువలన నామనమందలిసద్విచారాంకురము నిర్మూలమయ్యెనో, యానిష్ఠురప్రతిజ్ఞను మఱచుట యసంభవము. నాయుజ్జ్వలకర్తవ్యమున మసిఁబూసినట్టియు, నాయాత్మగౌరవము నధఃపతితమొనర్చినట్టియు, నన్ను స్వాతంత్ర్యతేజమునుండి తొలఁగించి నిబిడాంధతమసంబునఁ ద్రోసినట్టియు, మదీయప్రభూతబాల్యసంకల్పములనెల్ల ధ్వంసమొనర్చినట్టియు, భీకరమగునాప్రతిజ్ఞ నాయంతరంగమును సంపూర్ణముగఁ గాల్చివైచుచున్నది. ప్రాణములతోడనే యీ పీడ నన్ను వదలుట. అంతదనుక నొక్కత్రుటికాలమైనను దీనినుండి విముక్తి నందుదుననువాశ నాభాగ్యమున లిఖింపఁబడలేదు.

హీరా—శుభకరణులవారికిఁ దమప్రతిజ్ఞకై యనుతాపము గలుగుచున్నదా యేమి!

శుభ—ఆ. సంపూర్ణమగు ననుతాపము గలుగుచున్నది. పగలెల్ల నాప్రతిన నెఱవేర్చుయత్నము సలుపుట; రాత్రి పగలుచేసిన పాపములకుఁ బశ్చాత్తాపమునందుట; ఇదియే నాప్రస్తుతకర్మమయినది. దినమంతయు నేనొనర్చినసమస్తపాతకములకును సాక్షాత్స్వాతంత్ర్యమూర్తియగు వింధ్యవాసినియెదుట రాత్రియంతయుఁ బరితాపమందవలసివచ్చెను. నామనసున కింతయు శాంతి చేకుఱదాయెను. నా

ఖ్యమున విశ్రమింపఁదగుకాలమును మనఃపారిశుద్ధ్యమునకై వినియోగించుటయం దక్రమమేమున్నది ?”

హీరాదేవి యించుక కుపితయై పలికెను:—“ నేనిది మొదటనే తలఁచితిని. శుభకరణులు తమప్రతిజ్ఞనుండి వెనుకాడఁజూచుచున్నారని నేఁటిప్రాతఃకాలమున దేవ్యాలయముననే గ్రహించితిని.

శుభ—(మిక్కిలియావేశముతో) చాలు. హీరాదేవీ ! ఇంక నోరుమూసికొనుము. ఆఁడుదానివలుకులని యూరకుంటినిగాని యీవలుకు లోకపురుషుఁడు వచియించియుండినచో నాతనినాలుక నాకరవాలమున వేయిచీలికలొనర్చియుందును. హీరాదేవీ ! ప్రతిమనుజుఁడును మాటలాడుసమయమున “ ఎవరివిషయమునఁ బల్కుచున్నాము ! ఏమి పల్కుచున్నాము.” అని యవశ్యము యోజింపవలయును. ఏనరుఁడు ప్రతిజ్ఞాపాలనమునకై తనరాద్ధాంతములను నుచ్చమానసికవ్యవస్థలను వినాశన మొనర్చుకొనెనో, న్యాయాన్యాయముల నెవఁడు గణింపలేదో, నీతిశిఖరమునుండి యెవఁడు తన్నుఁ దానవినీతిఖాతంబునఁ బడఁద్రోసికొనెనో, సద్భావోద్యానమును ద్యజించి యెవఁడు దుర్భావగహనంబును స్వీకరించెనో, స్వతంత్రతాకాంతకుఁ బ్రణయియగుటకు మారుగ నెవఁడు పరతంత్రతయనునంగడివెలయాలికి సేవఁజేయుటయే పరమసుఖమని యెంచుకొనెనో, యాతనిని బ్రతిజ్ఞనుండి వెనుకాడుచున్నాఁడనుట సత్యమును హత్యసేయుటయే. హీరాదేవీ ! నీయీయసత్యానుమానమునకు హేతువేమి ?

ఆసమయమున శుభకరణునియావేశముంజూచి హీరాదేవి భీతిల్లెను. ఆమెకోప మణఁగిపోయెను. ఇంకనెక్కుడుగ మాటాడినచో నాతనికోప మెంతేభయంకరరూపమువహించి యాతఁడు సేయనియనర్థముండదని యామె బాగుగ నెఱింగెను. శుభకరణునిశౌర్యము వినియో



గపఱిచి యామెయింకను జాలకార్యముల నెఱవేర్పవలసియున్నది. కావున నాక్షణమున నించుక తగ్గుటయే మంచిదని యామె తలఁచెను. శుభకరణునిప్రశ్న కామె యేమియుఁ బ్రత్యుత్తరమొసంగలేదు. హీరాదేవి యూరకుండుటచే శుభకరణునకు శాంతికలుగలేదు. ఆతఁడు మరల నావేశమున నిట్లుపలికెను: “హీరాదేవీ! నేను ప్రతిజ్ఞనుండి వెనుకాడుచున్నానని నీవెట్లూహించితివి ! నాప్రశ్నకు సమాధానమొసంగుము !” శుభకరణునిప్రశ్న కుత్తరమీయకున్న నేవిధమునను విముక్తి లేదని గ్రహించి, యామె మిగులవినీతయై యిట్లుపలికెను:—“యువరాజగు దలపతిరాయలు ఛత్రసాలునికై వసమై నేఁడెన్నితురుష్కశిరంబులఁగూల్చెనోకదా ! ఢిల్లీరాజసభయందు ముఖ్యసభ్యుఁడై యధికారియైయున్న రణదులహాఖానునితోఁ బోరి, వార లాతనిబాహువులబంధించి, బందీకృతునొనర్చిరి. ఇట్టియనర్థములఁజేసి యతఁడు మీయొద్దకు వచ్చినప్పుడు మీరతనికి నుంతయు భయముఁజెప్పరైతిరి; ఒక్క క్రోధవాక్యమునైనఁ బలుకరైతిరి. కావుననే—మనదినములేమియు బాగుగనుండలేదు. ప్రాణనాథస్వామి మృదులహృదయుఁడగుయువరాజును ముందుఁగూడ నెప్పుడు నిట్టిపనులనే చేయుచుండుమని హెచ్చరించినప్పుడుఁగూడ మీరేమియు మందలింపలేదు. ఛత్రసాలునికార్యమునఁ జంపతిరాయ లెంతటిదర్పముంబ్రకటించెనో, దలపతిరాయకుమారునికార్యమున మీరంతటియసంతుష్టినిఁ బ్రకటింపవలసినది. కాని మీరు ప్రసన్నతతో యువరాజువంకఁజూచుచు నూరకుంటిరి. ఈమీవిలక్షణవర్తనమునకుఁ గతమేమని తెలిసికొనుటకే యింతరాత్రివేళ మీకడ కేఁగుదెంచితిని. దీనింబట్టి మీరు మీప్రతిజ్ఞను వీడనుంటి రనునను మానము సులభముగ జనించును. కాని, నాకది నిజమని నమ్మిక లేకుండెను. మీప్రతినయం దచలురై నేఁటివఱకు మీరొన

రించుచున్న కృత్యములవలననే మేము విచారముదక్కి యుంటిమి. కాని, నేఁటివర్తనముం జూడ నామనమున సందియ ముదయింపసాగెను. ఆసందియమును వారించుకొనుటకే నేనిటకు వచ్చితిని. దానం జేసియే నాకింతవఱకు విశ్రాంతి లేకుండెను. నాకుఁ గన్నుమూఁతపడదాయెను. నేఁటియుదయమున నొనర్చినయావ్యవహారమునకు మీరేమికారణముఁ దెల్పుదురో తెలిసికొనుటకే యింతరాత్రివేళ నాశిబిరమునువీడి వెలుపలికి వచ్చితిని. భాగ్యవశమున మీతోఁ గలిసికొనుట తటస్థించినది. మీ యౌదాసీన్యమునకుఁ గారణముం దెల్పి నాసందియముం దొలంగింతురు గాక!

హీరాదేవిమాటలు విని శుభకరణుఁ డించుక యాలోచనం బడెను. మెల్లమెల్లఁగ నతనిచింతితాననమునఁ బ్రసన్నత మొలకెత్త సాగెను. ఇంచుకసేపటికతఁడు తలపులకున్కనుండి యొక్కమ్మడి మేల్కాంచినట్లగపడెను. అతఁడు కొంతస్వగతముగను, గొంత హీరాదేవినిగూర్చియు నిట్లు చెప్పెను. “నేఁటియాచరణ మాశ్చర్యజనకముగనే యున్నది. యువరాజు నేఁడాచరించిన యపూర్వకృత్యమునకై నేనొనర్పఁదగునది చాలఁగ నుండెను. కాని, నే నూరకుంటిని. యువరాజు పెద్దవాఁడయ్యెను. భవిష్యమున నింతకన్న భీకరతరకార్యములాతనివలన జరుగును. చంపతరాయలను అతనిస్వాతంత్ర్యప్రయత్నములను సంపూర్ణముగ నాశనమొనర్చెదనని నేను ప్రతిననొనర్చియుంటిని. నాకొమరుఁడన్న బుందేలఖండపక్షమున మొగలుల నాశనమొనర్ప ఛత్రసాలునకుఁ దోడుపడుచున్నాఁడు. ఇట్టియెడ నేనూరకుండుట సరికాదు. ఇంతవఱకు నేనెవ్విధమునఁ జంపతిరాయల ద్వేషింపుచు వచ్చితినో యెట్టులాతనిప్రయత్నముల విధ్వస్తములుగ నొనర్చుటయే నాకర్తవ్యమని భావించుచువచ్చితినో, యాతని స్వాతంత్ర్యసంపాదన



చేష్టల కెల్ల విఘ్నములం గూర్చుచువచ్చితినో యట్లే నాపుత్త్రుఁడు గూడ సర్వకార్యములఁ జేయవలయునా? లేక ఛత్రసాలునితో మైత్రి నెఱపి, యతనికి సాహాయ్య మొనర్పవలయునా? ఇదియే యిప్పుడు నిర్ణీతము కావలయును. ఇంతవఱకు నేఁ బోరినట్లు మనసంతతివారును బోరాడుకొనుటయా లేక యన్యోన్యమైత్రితో బుందేలఖండపారతంత్ర్యవిమోచనప్రయత్నముల సల్పుటయా? ఇది నిశ్చితము కావలయును. హీరాదేవీ! నేఁటినాయౌదాసీన్యము మూలమున నాయెడ నీకెట్లు సందేహము గలిగెనో యట్లే దలపతిరాయనికిఁ గూడఁ గల్గియే యుండును. నేఁటి యాతని కృత్యము నాకు సమ్మతమో కాదో యతనికిఁ గూడఁ దెలిసియుండదు. నీవలెనే యాతనిశంకకూడఁ దొలఁగవలయును. యువరాజుకడ కేఁగుదము; నడువుము. అచ్చట నేనెల్లవిషయముల స్పష్టముగ నిశ్చయింతును. ఇటుకాక, నామనమున నాకులపాటు తగ్గదు.

ఇట్లుపలికి శుభకరణుఁ డెడమప్రక్కనున్న శిబిరమువంకకు సాగెను. అత్తఱి నాతఁడు సమస్తవిచారములనుండియుఁ దన్నుఁ దావదల్చుకొనెను. ఆకసమున వెలుఁగుచున్న చందురునివలె నాతనివదనము వికసితమయ్యెను. హీరాదేవి యాతనివెనువెంట నడచుచుండెను. నాఁటి యుదయమున నొనర్చిన దుష్కార్యమునకై దలపతికుమారునకుఁ దగిన శిక్ష యగునని యెంచి యామె మిగుల సంతసించెను. “ఈరాత్రి నేను చేసినచేష్టకుఁ బూర్ణముగ సాఫల్యము రానున్న”దని యామె నిశ్చయముగ నమ్మెను.

శుభకరణుఁడు ప్రసన్నుఁడై చంద్రకాంతియందు స్నానమాడుచున్నవింధ్యాచలము వైపునకు మఱొక్కసారి వీక్షించెను. ఆకాలమున నాతనిచూపులు స్థిరసంతోషగర్వముల వెలిగ్రక్కుచుండెను.

ఆతఁడు నోటితో నేమియుఁ బలుకకున్నను "బర్వతరాజా! నీకార్యము నాకిష్టముగ నున్నది." యని మనసుననే వింధ్యాచలముతోఁ బలుకుచున్నట్లు ముఖకాంతి ప్రకటించుచుండెను. ఆతని ముఖకాంతి యాతని పలుకులకన్న నెక్కుడు పనిచేసెను.

శుభకరణుని వెన్వెంటఁ జని హీరాదేవి యువరాజగు దలపతిరాయల శిబిరముం జేరెను. శుభకరణుఁ డామెను దిలకింపకయే తిన్నఁగఁ దనపుత్త్రుని పర్యంకము చెంత కరిగెను. శుభకరణుఁడు మిగుల క్రుద్ధుఁడై తనకొమరునిఁ బర్యంకమునుండి క్రిందికి లాగివేయునని యాసించుచు హీరాదేవి నిలిచి వారిరువురివంకఁ జూచుచుండెను. కాని యామెకు భిన్నమగుదృశ్య మగపడెను. ఆమె యాస నిరర్థకమాయెను. ఆమెహర్షము దగ్ధమాయెను. ఆమె యచ్చెరువునఁ గొయ్యవాఱిపోయెను. తాఁ గాంచినదానియం దామెకు నమ్మకము లేకుండెను.

తనసందియముం దీర్చుకొనుట కామె మరల దలపతిరాయల మంచమువైపు చూచెను. అపుడుగూడ శుభకరణుఁడు ప్రణయార్ద్ర దృష్టితోఁ దన బిడ్డని మొగముం దిలకించుచుంటయే యామెకుఁ గన్పట్టెను.

శుభకరణుని నిర్ణయమునుగూర్చి హీరాదేవి యిదియే కాంచ నోఁచుకొనియెనా యేమి?





రాజకలంకము.

కంచుకిరాయలు రాజైయైనను సామాన్యపురుషుల యోగ్యతకూడ నాతనియొద్ద లేకుండెను. కాయముచే నాతఁడెంతయశక్తుఁడో మనసుచే నంతదుర్బలుఁడు. కావున నొకసాధారణకుటుంబమును బాలించుటకైన నతఁ డర్హుఁడు కాకుండెను. బుందేలఖండమునందలి యొకగొప్పరాజకుటుంబమునందు జన్మించుటచేతనే యతనికిఁ బైతృకమగు రాజ్యాసనము లభించియుండెను.

అమృతమునకును విషమునకునుగూడ భేదమెఱుఁగని యొక వ్యక్తి కేవల మొక్క భిషగ్వరుని పుత్త్రుఁడగుటమాత్రమున ధన్వంతరి వంటిశివి నెట్లు నెఱపవలెనో, యొకానొకనిరక్షరభట్టాచార్యుఁ డొక మహామహోపాధ్యాయునిసుతుఁ డయినంతమాత్రమున దుశ్శాలువులు భుజములపై నిడికొని యెట్లు పండితశిరోమణి కావలసివచ్చునో, తనస్వరముచే గాడిదనైన నోడించునొకపురుషుఁ డొకగాయకునికుమారుఁ డయినంతమాత్రమున నెట్లు "తాన్‌సేన్"* వంటిదర్పము నిల్పవలసివచ్చునో, యట్లే కంచుకిరాయలకుఁగూడఁ దనరాజదర్పము నిలుపవలసివచ్చెను. ఆతనిపూర్వులు ఝాంఝేరునకు రాజులగుటచేతనే కంచుకిరాయలుగూడ ఝాంఝేరునకు రాజు కావలసివచ్చెను. శాస్త్రలోకాచారముల ననుసరించి ఝాంఝేరరాజపీఠమున కుత్తరాధికారి యు

* మనదేశమున త్యాగరాజువలె నుత్తరహిందూస్థానమున తాన్‌సేనట్టిభక్తగాయకశిరోమణి.

గుటఁదక్క నాతనియందు వేఱొండుగుణము లేదు; పాత్రతయులేదు. తనయౌవరాజ్యకాలమున నాతఁడు కొన్నిదినములు జహాంగీరు, షాజహానుల మందిరములందుఁ గంచుకివ్యాపారము సల్పియుండుటచే షాజహా నతనికిఁ బరిహాసమునకుఁ గంచుకిరాయ లనుపేరిడెను. అప్పటి నుండియు నతనికీపేరు రూఢమయ్యెను. ఇతరభారతనివాసులవలెనే బుందేలఖండమండలిప్రజలును బరిపాలకునియం దీశ్వరాంశమును భావించుచుండెడివారు. ఢాంఢేరనివాసులును గంచుకిరాయ లీశ్వరాంశసంభూతుఁడనియే యెంచుచుండెడివారు.

పాదుషాలు, అమీరులు మున్నగువారి నెట్లు సేవింపవలయునో, వారి నెట్లు ప్రసన్నులఁ గావించుకొనవలయునో, యంతయు నాతఁడు తనబాల్యావస్థయందు బాగుగఁ దెలిసికొనియుండెను. ఇంతేకాక యప్పటినుండియు నతనిహృదయమున ముసల్మాను లనినఁ గడు నాదరమును బూజ్యభావము నొదవియుండెను. ఆతనిరాజసభకుఁ దఱచుగ ముసల్మానుఅమీరు లేతెంచుచుండెడివారు. అచట వారికిఁ జక్కగ నాదరసత్కృతులు జరుగుచుండెడివి. చాలమందిముసల్మానుల కాతనిరాజ్యమున గొప్పగొప్పపదవులు లభించియుండెను. దానం జేసి వారు కడుస్వచ్ఛందవిలాసములఁ గాంచుచుండెడివారు. వారిసౌకర్యమునెడఁ గంచుకిరాయలకుఁ గడుతత్పరత. ముసల్మానులయెడ నిట్టిశ్రద్ధ కంచుకిరాయల కొక్కనికే కాదు; ఆకాలమున భారతదేశమున వేర్వేఱుప్రాంతములందుఁగల కొందఱిరాజుల కుమారులుగూడ దర్బారులో వివిధసేవలు సలుపుట కలదు. ఆరాజులరాజ్యమున ముసల్మానులకు మంచిగౌరవము జరుగుచుండెడిది. ఇట్టిదశయందుఁ గంచుకిరాయలపై విశేషదోష మారోపింపనేల?

ఛత్రసాలదలపతిరాయులు రణదులహాఖానునకు నతనిపరివార



మునకును జాలమర్దనఁ గలిగించిరని వింధ్యవాసినీయాలయమునఁ గంచుకిరాయలకుఁ దెలిసినప్పు డతనికిఁ జాలదుఃఖము గలిగెను. ఆతని యభిప్రాయమున వారిరువురును దండ్యులై యుండిరి. మీఁదుమిక్కిలి యాతనిఖిన్నత పెంపొంద వారిరువురును గౌరవింపఁబడిరి. ఛత్రసాలునికి శిక్షగల్గించుట యాతనిశక్తికి మీఱినదై యుండెను. కాని, దలపతిరాయనికిఁ గొంచెము శిక్ష వేయుంచుట కతనికి నిచ్ఛయు, నాశయుఁగూడ నుండెను. ఏలయన, శుభకరణుఁ డప్పుడు హీరాదేవిచేతికీలుబొమ్మ యగుచుండెననియుఁ, గావున నతఁడు తనకుమారు నించుక దండింపవచ్చుననియు, నాతఁ డూహించెను. కాని, హీరాదేవితోఁగాని, శుభకరణునితోఁగాని, యీవిషయమున ముచ్చటించుట కతనికిఁ దగినంతమనోబలమే లేకుండెను. కావున, దలపతిరాయనికి శిక్ష ప్రాప్తింపలేదు. ఆలయమునుండి వెలువడుటతోడనే యాతఁ డెదుట రణదులహాఖానుఁ డొకచెట్టునకుఁ గట్టఁబడియుండుటఁ గాంచెను. అతనిని విడిపించుట కసమర్థుఁ డగుటచే నతనికి మఱింతవిచారము గలిగెను. ఆవిచారముతోడనే యతఁడు తనశిబిరమునఁ బ్రవేశించెను. ఆతఁ డంతవిచారగ్రస్తుఁ డగుటకుఁ గలయీకారణము నెవ్వరును గుఱుతింపరైరి.

కంచుకిరాయ లెట్లో విచారముననే దినమంతయుఁ గడపెను. కాని సాయంకాలమున నతని కింకను రణదులహాఖానునికై విశేషక్లైబ్యము కలిగెను. ఎద్దియే నుపాయ మాలోచించుటకు నాయోజన ముసల్ప నాతఁడు హీరాదేవినిఁ బిలిచెను. హీరాదేవి వచ్చిన వెనుక నిరువురికిని జాలసేపటివఱకు సంభాషణము జరిగెను. ఈసంభాషణ మర్ధరాత్రసమయమునకుఁ బూర్తియయ్యెను. అచటినుండిలేచి హీరాదేవి తనగుడారమువంకకుఁ జనక శుభకరణుని శిబిరముదెస కేఁగెను.

హీరాదేవి యేఁగినపిదపఁ జాలసేపటివఱకును గంచుకిరాయలు విచారమగ్నుఁడై యుండెను. ఒకసారి కూరుచుండుట యొకపరి పండుకొనుట యొకతఱి పటభవనమున నలుప్రక్కలఁ దిరుగుట; ఇట్లే చాలతడవు చింతతోఁ గడపి యాతఁ డొకసేవకునిం బిలిచి మెల్లగ నతని చెవిలో నేదియో చెప్పెను. అది వినుటతోడనే యాసేవకుఁడు తనప్రభుని వంక నాశ్చర్యముతోఁ జూచి, యచటినుండి వెడలిపోయెను. అతఁడు మరలివచ్చుట కెంతియోసేపు పట్టలేదు. కాని, యింతలోనే కంచుకిరాయలు తనవలువలను నగలను దీసివైచెను. సేవకుఁడు తెచ్చిన సామాన్యవస్త్రములను ధరించి యాతఁడు కృత్రిమములగు గడ్డమును మీసమును దగిలించుకొనెను. అతనివేసము విలక్షణముగ నయ్యెను. అతఁడు పూర్ణముగ భారతీయుఁడును గాక, పూర్ణముగ ముసల్మానుఁడును గాక యుండెను. సేవకునకుఁగూడ నాతనియావేషముం జూడఁగ నాశ్చర్య మాయెను.

కంచుకిరాయలు వానిని వెంటఁగొని యొక నిలువుటద్దము దగ్గఱకుఁబోయి నిలిచెను. ఆయద్దములోఁ జూచుకొని తన్నుఁదానే గుఱుతింపఁ జాలకుంటచే నింకఁ దన్నెవ్వరును గుఱుతింపఁజాలరనియుఁ, దనపని చక్కఁగ నీడేఱుననియు నాతనికిఁ బూర్ణవిశ్వాసము కలిగెను. ఇట్లు నిశ్చింతుఁడై యాతఁడు తనసేవకునితో నిట్లనియెను. "కృష్ణా! రాజా శంపతరాయలు రణదులహాఖానుని బంధించియుంచిన స్థానమునకు నన్నుఁ గొనిపొమ్ము."

కృష్ణ—వారితోఁ బ్రభువుగారు సామాన్యవేషముననే కలిసికొనవచ్చునుగదా!

కంచు—నీకీ గొడవ యంతయు నేల? ముందుండి దారిఁజూపుచు నడువుము.



ఇంక గృష్ణుఁడేమియు మాటాడక తనప్రభువుముంగిట నడువసాగెను. కొంచెముదూరముపోయి యచట నాఁగి కృష్ణుఁడొక శిబిరముం జూపుచు నిట్లనియె. "మహారాజా! ఈశిబిరముననే రణదులహాఖానుఁడు బద్ధుఁడై యున్నాఁడు. కాని, యీశిబిరమునకు బయటఁ గావలియున్నది. దేవరవారు లోనికేఁగుట కాటంకము ముండునని సందియమగుచున్నది."

కంచు—నీవీ విషయము లన్నియుఁ జింతింపక మరలిపొమ్ము. (కొంచెమాఁగి) లేనిచో నీవిచటనే యెందైనఁ డాఁగి నాకయి వేచియుండుము.

కృష్ణుఁ డొకచెట్టుచాటున డాఁగికొనెను. కంచుకిరాయలు మెల్ల మెల్లఁగ నాశిబిరముదెస కేఁగుచుండెను. అప్పటివఱకు నాతఁ డాశిబిరప్రవేశమున కెట్టియుపాయము నాలోచించియుండలేదు. ఎవ్వరియో వేఱొండు విచారములలో మగ్నుఁడై నడచుచుండెను. శిబిరము సమీపముగనే యుంటచే నతఁ డనతికాలముననే కావలివానిని సమీపించెను. కావలివాఁడు నాతని మొదటినుండియుఁ జూడకుండుటచే నతఁడు సమీపించుటతోడనే యించుక కసరుచు "ఎవ్వ" రనెను. కంచుకిరాయల కాకంఠ మించుక పరిచితమైనదిగఁ దోఁచెను. అతఁడు రెండడుగులు ముందఱికిడి వానిని బరిశీలించిచూడ వాఁడు తనపురాతనసేవకుఁ డగు సౌభాగ్యసింహుఁ డని యాతనికిఁ దెలిసెను. అతఁడు వానిభుజముపైఁ జేయివైచి యిట్లనెను. "సౌభాగ్యసింహా! నన్ను గుర్తింపుము. నేను కంచుకిరాయఁడను."

ఆవిచిత్రవేషమునఁ దనపూర్వప్రభుఁ డగు కంచుకిరాయనిం జూచి మొదట సౌభాగ్యసింహుఁడు నమ్మఁజాలకుండెను. కాని, కంఠస్వరముచే బాగుగ గుర్తింపఁ గలిగెను. వాఁడు వంగి నమస్కరించి

యాశ్చర్యముతో నిట్లనియె:—“ఇంతరాత్రివేళ స్త్రీవేషమున మహారాజుగా రెచ్చటికి బయలుదేఱినారు?”

కంచు—కఱుంగదు నావశ్యకమగు నొకకార్యమునకై నేను రణదులహాఖానునితోఁ గలిసి మంతనము జరుపవలసివచ్చినది. ఎవ్వరును నన్నుఁ దెలిసికొనకుండ నీవేషముం దాల్చితిని. దైవవశమున నీవే కావలియుంటివి. నాకు నీవు చిరవిశ్వాసపాత్రుఁడ వగుటచే నీకు నన్నెఱింగించుకొనుటలో హానిలేదని తలంచితిని.

కంచుకిరాయలు శిబిరమునఁ బ్రవేశింప నుద్యుక్తుఁడగుటఁ జూచి సౌభాగ్యసింహుఁడు కడు సందిగ్ధస్థితిం బడెను. అతఁడిట్లనెను. “మహారాజా! నేను—” కాని, కంచుకిరాయ లర్ధోక్తియందే యిట్లనియెను. “అబ్బే! నీవు భయపడవలదు. నేనిప్పుడే రెండుమూఁడు మాటలాడి మరలివచ్చెదను. నాకంత పెద్దపనిలేదు. నీవు తత్తరపడకుము. నేనిచటికివచ్చినట్లెవ్వరికిని దెలియనీయకుము. నీకేమైన బెడదవచ్చునేని భారమునాది.” అనిపలుకుచు సౌభాగ్యసింహుని యుత్తరమున కెదురుచూడకయే కంచుకిరాయలు శిబిరములోనికిఁ బోయెను. సౌభాగ్యసింహున కతని నాఁగుటకుఁ దగుచొరవ లేకుండెను.

శిబిరములో నడుగిడుటతోడనే కంచుకిరాయలకుఁ గల్గినయానందమపారము—అతనియానందమునకు ముఖ్యకారణ మేమనిన నిఁక రణదులహాఖానుఁడు విముక్తుఁడగుననియుఁ జంపతరాయచ్ఛత్రసాలులకుఁ దండనము ప్రాప్తించుననియు నతనికిఁ బూర్ణమగు నాశ కలిగెను. అతఁడు లోనికేఁగుటతోడనే యతిసాధారణమగునొకమంచముపై రణదులహాఖానుఁడు గుఱకలిడుచుఁ బండియుండుటఁ గాంచెను. ఆతఁడు కొలఁదిసేపటిక్రిందనే నిదురించియుండెను. కంచుకిరాయ లాతనిచెంగట నిలిచి యాతనిమేల్కొలుపఁ బ్రయత్నించు



చుండెను. అతఁడు రెండుమూఁడుసారులు దగ్గుటచేతను, గాండ్రించుటచేతను, ఖానునినిద్ర చెడిపోయెను. ఖాను తలయెత్తి కర్కశస్వరముతో “ఎవరువా” రని యడిగెను.

కంచుకిరాయలు కడునమ్రతతో నిట్లనెను:—అయ్యా! నేనిచ్చట నీసమయమున మీకించుకసాయమొసర్ప వచ్చితిని.

రణ—మన్నించు. అన్నా! మన్నించు. నేను నిన్నెఱుంగను. నీసాయము నాకక్కఱలేదు. నీవు నాకుఁ బెద్దభూతమువలెఁ గన్పట్టుచున్నావు. ఈశ్వరుఁ డీకాఫరులను రూపుమాపుఁగాక! వీరెట్టిపన్నుగడలఁ బన్నుదురో!

కంచు—ఔను. అయ్యా! మీరు చెప్పినది కడులెస్సగా నున్నది. కాని, నన్నుమాత్రము విశ్వసింపుఁడు. నావలన మీకతి లాభము కలుగును.

రణదులహాఖానున కేభూతమావహించెనో కాని నిశ్చయముగ నతనికిఁ గంచుకిరాయలు, వికృతవేషమునఁ బిశాచమువలెనే కన్పట్టుచుండెను. అతఁడు వినయముం జూపినకొలఁది నితనికి భయముహెచ్చుచుండెను. కొంతభయముతోడను గొంతకోపముతోడను నాతఁడిట్లనెను. “వలదన్నా! నాకు నీసాయమువలదు. క్షమింపుము. నీదారిబట్టుము. నాకు సాయము దేవుఁడే చేయును. నీవు నన్నీయవస్థలోనే యుండనిమ్ము. నేను నీయెడ నెప్పుడేని దప్పుచేసినచో మన్నింపుము. నీకాళ్లఁబడుదును. నాకు నీవన్న భయమగుచున్నది.”

మొదలనే తనపరిచయమొసంగక ఖానునింతగ భయపెట్టినందులకుఁ గంచుకిరాయలు చింతింపసాగెను. ఖాను తన్నుఁ జంపతిరాయలపక్షమువానిగ నెంచెనని తలంచెను. అతఁడు మరల మృదుమధురస్వరమున నిట్లనెను. “అయ్యా! నేను పిశాచమును గాను. నేను—

రణ — నీవు పిశాచముకాకున్న దానితమ్ముఁడవగుదువు.

కంచు — అయ్యా! మీరు నమ్ముఁడు. నేను పిశాచమును బ్రేతమునుగాను. ఢిల్లీబాచదర్బారునకు హితైషిని; చిరవిశ్వాసిని; ధాంధేరపాలకుఁడను — కంచుకిరాయలను. అదికాక —

రణదులహాఖానున కింకను నమ్మకము కలుగక తనమొదటిమాటనే యందుకొని, యీతఁ డిట్లనెను. "అన్నా! నన్ను వదలుము. నాకు భయమగుచున్నది. ఇఁక నెప్పుడైన వేళాకోళతతి (?) నీవు చెప్పినట్లు చేసెదను. ఇప్పుడుమాత్రము నన్ను మన్నింపుము."

ఈరీతిగఁ దిరస్కృతుఁడగుటవలనఁ గంచుకిరాయలు చాలఖిన్నుఁడయ్యెను. అతఁడు మరల నిట్లనెను. "అయ్యా! నావలన నుంతయు భయపడకుఁడు. నన్ను మీమిత్రునిగఁ దెలిసికొనుఁడు. మీరు నన్ను గుర్తింపలేదు. మునుపొకసారి మీరు నాదర్బారునకు వచ్చి ధాంధేరమున నాకతిథులైతిరి. ఇప్పు డింతభయపడుటకు మీకేమియభిప్రాయముపుట్టెనో తెలియదు. మీరు నమ్మికతో మాటాడుఁడు. నేను మిమ్ముకారాగారమునుండి విడిపించు నుద్దేశమున నిచటికి వచ్చితిని."

ఇంక రణదులహాఖానునకు నమ్మకముండుటకేఁగాని, భయపడుటకుఁగాని, కారణము లేకుండెను. అతఁడు నవ్వుచు నిట్లుపలికెను. "రాజాసాహబ్! మీరు నన్నిప్పుడు చాల బెదరఁగొట్టితిరి. రండు. కూరుచుండుఁడు."

కంచుకిరాయలు మిగులవినయముతో ఖానుప్రక్కను గూరుచుండెను. అతనిని ఖాను బాగుగగుర్తించి యిట్లనెను. "మీరిచ్చటి కెట్లువచ్చితిరి? ఏయుద్దేశమునవచ్చితిరి చెప్పుఁడు."

కంచు — నేఁటియుదయమున దేవాలయమునుండి వెలువ



డుచు మీరు వృక్షమునకుఁ గట్టఁబడియుండుటఁజూచి కడుదుఃఖము నందితిని. కాని, యేమిచేయువాఁడను! ఆసమయమున నేను నిస్సహాయుఁడను. పగలంతయు మిమ్ము విడిపించునుపాయము నాలోచించుటలోనే కడపితిని. కాని, యెందును నాకు సాఫల్యచ్ఛాయ కాన్పింపలేదు. చేయునదిలేక యీసమయమున మిమ్మే యేదేనుపాయమునగ (?) నెట్లో నేనిచ్చటికి వచ్చితిని.

రణ — సరే. మీరు చాలదయఁజూపినారు. నేను మీకనేకధన్యవాదము లొసఁగుచున్నాను. తమకర్తవ్యమును బాగుగ నెఱింగినట్టియు సమయమువచ్చినప్పుడు దానినిఁబాలించుటకై యింతటిశ్రమ స్వీకరించునట్టియు వీరులు బుద్ధిమంతులునగు రాజులు కొందఱు హిందువులలోఁగూడ నుండుట యీశ్వరానుగ్రహము.

కంచు — మహాశయా! ఏమిట్లుసెలవిచ్చుచున్నారు. ఇదినాకర్తవ్యము. ఇందు నేను మీకుపకార మేమియుఁజేయలేదే! సరే. ఇచటినుండి తప్పించుకొనిపోవుటకు మీరేయుపాయ మాలోచించితిరో చెప్పుఁడు!

రణ — రాజాసాహబ్! మీరు నన్నుపాయము లడిగెదరేల! మీరు ధాంధేరమున కధిపతులు. మీతో నిచ్చట నొకటిరెండువందలమంది పరిజనులుగూడ నుండిరి. వారినందఱినిగొనివచ్చి (?) యీశిబిరముపై గుప్తధాటిసలిపి నన్నువిడిపింపవలసినది. దొంగవలె గుప్తముగ రాత్రివేళ నిచటికి రానేల!

కంచు — (కొంచెములజ్జితుఁడై) మీరుచెప్పినది యుక్తమే కాని, వాస్తవమేమన — చంపతరాయలకడ సైన్య మెక్కువగ నున్నది. అదికాక, నాకీస్థలమునఁ దగినసహాయకుఁడు లేఁడు. మీరిప్పటికైన నుపాయ మాలోచించియున్నఁ దెలియఁజేయుఁడు. తదనుసారముగఁ

జనిసేయుటకు నేను సిద్ధముగ నున్నాను.

రణ—రాజా! మీరు నాకిచ్చట నేమియు సాయముఁ జేయలేకున్న నేనిచ్చట బంధింపఁబడినవార్త వెంటనే యెట్లో ఢిల్లీకిఁ జేర్పుఁడు. అచ్చటినుండి నాసాయమునకుఁ దగినంతసైన్యము వచ్చును. (మొలనుండియొకకత్తిఁ దీసి) ఇదే. నేను మీకీకత్తి నిచ్చుచున్నాను. దీనిసాయమున మీరు ఢిల్లీలోనిరాజభవనములలోను, దర్బారులలోను, సులభముగ రాకపోకలుసల్పవచ్చును. ఎక్కడను నెవ్వరును మిమ్మడ్డుపెట్టరు. (కంచుకిరాయలించుక చకితుఁడగుటఁ జూచి) మీరింతయాశ్చర్యమునొందితిరేల! నామాటయందు మీకు నమ్మకములేదా?

కంచు—సరిసరి. మీమాటయు, దానిపై నమ్మికలేకుంటయు నా! అసంభవము. ఈకత్తివలన నెట్టిప్రయోజనముఁ బడయవలయునో యదిమాత్ర మెఱుఁగఁ గోరుచున్నాను.

రణ—మీరు దీనిని దీసికొని తిన్నగ ఢిల్లీకేఁగుఁడు. దర్బారునఁగాని, భవనమునఁగాని, పాదుషావారున్నచోటికి ఖడ్గముం జూపుచు నిరాఘాటముగఁ బోఁగలుగుదురు. అల్లేఁగి పాదుషావారితో నేను మఱికొందఱియనుచరులతో దేవాలయమునుబడఁగొట్ట సిద్ధపడియుండ నింతలోఁ జంపతరాయలదుష్టపుత్రుఁడు—పెద్దసేనతో వచ్చి, నన్నాక్రమింప నేనాతనిబలమును మర్దించుటకై యెంతయత్నించినను నాయిరువదిమందిసైనికులు నతనిమూఁడునాల్గువందలమందిసైనికులయెదుట నిలువఁజాలక పోయితిమి. ఈతరుణముననే చంపతరాయలు గూడ రాఁగా వారిరువురును గలిసి దేవరవారిసైనికులను బంధించినారు. ఆకాఫరు లింకముందెన్నఁడును నాలయముల బ్రద్దలుగొట్టుయత్నమేమియు జరుగదనునమ్మిక కల్గించినఁగాని, నన్ను వదలుటకు సమ్మతించుటలేదు." అని విన్నవింపుఁడు. వారు నన్నుఁ జెఱఁబట్టి మహో



బాకుఁ గొనిపోయిరనియు, నచ్చటిదుర్గముననే నన్ను బంధించియుంచుటకు వారిచ్ఛగించుచున్నారనియుఁ గూడ విన్నవింపుఁడు. ఇన్నియుఁ జెప్పి నాకు సాయమొనర్పఁ బాదుషావారిని వేడుకొని సైన్యముం గొనుఁడు. సరే. మీరు బుద్ధిమంతులు. మీకెక్కుడు బోధింపనక్కఱలేదు. అదనునకుఁ దగినపనిని మీయంతమీరే చేయఁగలరు.

కంచు—ఇదియంతయు జరిగినమీఁదట మీకుఁ దప్పక విముదలయగునని నాయాశ.

రణ—రాజా! ఏమిట్లుసెలవిచ్చుచున్నారు. హుజూరువారికిఁ దమసేవకులయెడఁ జింతమెండు. అదియునుగాక, వారు ప్రసన్నులై మీతో నత్యంతగౌరవముసఁ బ్రసంగించెదరు. మీపదవినిఁగూడ వృద్ధిచేసెదరనుటలో నాశ్చర్యములేదు. ఒక్కమాట చెప్పమఱచితిని. పాదుషావారిశరీరస్థితి ప్రస్తుతమున మిగుల నస్వస్థతగనున్నది. వారిసోదరి రోషనారాబేగం వారిని సంరక్షించుచుండును. భవనములలో విచ్చుకత్తులతో వందలకొలఁది తార్తారుస్త్రీలకావలి యుండును. అచటనే మీకీకత్తి సాయముచేయును. మీరెట్లో రోషనారాబేగము దర్శనముచేసి యామెతోడనే యన్నివిషయములు నివేదింపుఁడు. ప్రస్తుతమున నామెయే సామ్రాజ్యకార్యములఁ జక్కఁబెట్టుచున్నది. ఆమె దీనికిఁ దగినయేర్పాటు చేయును.

కంచు—చిత్తము. కాని, మహాశయా! మఱియొకటి చెప్పుఁడు......

ఇంతలోఁ జంపతరాయలకర్కశరవము కంచుకిరాయలచెవిలోఁ బడెను. అతఁడు తొట్రుపడెను. కన్నులెత్తిచూచునప్పటికిఁ జంపతరాయ లాతనివంకకు వచ్చుచు నిట్లనెను. "జాగ్రత్త. ఒక్కమాటమైన నోటినుండి వెలువడినచో నిప్పుడే నిన్ను ముక్కలుముక్కలుగ

ఖండించివైచెదను. దుష్టా! నీవెవ్వఁడవు? ఈయుపద్రవముసల్పుట కిచటి కెట్లు వచ్చితివి?

కంచుకిరాయ లాతనిమాట కుత్తరమొసంగఁగోరుచుండెను. కాని, యతనినోటినుండి మాటవెలువడదాయెను. “ఈధూర్తుఁ డిట్లు లొంగఁ” డనుచుఁ జంపతరాయలు తనకత్తి దూసెను. కంచుకిరాయలు తడఁబడుచు “నేను ఢాంఢేరురాజును. కంచుకిరాయలను” అనెను.

చంపతరాయల కత్యాశ్చర్య మొదవెను. కొంతసేపటివఱకు నతఁడు తదేకదృష్టితో నాతనివంకఁ జూచుచు నిలిచెను. తుదకిట్లనెను. “నీవు రాజవెట్లగుదువు? రాజకళంకమవు—”

---

## నాల్గవప్రకరణము

### జనకతనయులు.

పూర్వదిశాచలముమఱుఁగున నిలిచి సూర్యభగవానుఁడు స్నేహపూర్ణముగ నసంఖ్యాకులగు తనతనయులవంకఁ జూచుచుండెను. తమతండ్రిరాక సమీపమయ్యెనని యెఱింగి వనస్పతిసంఘము ప్రఫుల్లితమై యాతనికై యెదురుచూచుచుండెను. తీవలు వికసితములై, తరువులు వినయవినమితములై, ప్రణయయుక్తములై, తమతండ్రి దిక్కునకుఁ జూచెను. వెంటనే వారికి శుభ్రాంబరమునఁ దండ్రిదరిసెన మాయెను.

యువరాజు దలపతిరాయ లాసరికి మేల్కాంచెను. అతఁడు



కన్నులు తెఱచి చూచెను. శుభకరణుఁడు స్నేహపూర్వకముగ నాతని మంచముకడ నిలువఁబడి యాతనివంకఁ జూచుచుండెను. అతనికిఁ గొంచెమువెనుక హీరాదేవి కొయ్యబొమ్మవలె నిలిచియుండెను. అతని కాశ్చర్యము నానందముఁగూడ నొదవెను. దలపతి దిగ్గునలేచి తండ్రి పాదములఁ దాకెను. అతనిని లేవనెత్తి యక్కునఁ జేర్చుకొని శుభకరణుఁడు గద్గదస్వరమున నిట్లనియెను. “బిడ్డా! ఒక్కసారి నన్ను గట్టిగఁ గౌఁగిలించుకొనుము.”

దల—తండ్రీ! నేనెంతయు ధన్యుఁడను. నేఁడు ప్రాతఃకాలముననే మీదర్శనము లభించెను. నేను భాగ్యశాలిని. వింధ్యవాసినీదర్శనములు వేయి లభించినను గలుగనియానందము నేఁడు మిమ్మొక్కసారి దర్శింపఁ గలిగినది. నాపురాకృతసుకృతంబులెల్ల నావిర్భవించె నని తలంతును.

శుభ—దలపతీ! నీకింకను నామనసులోనితలంపులు తెలియరాలేదు. సుగుణములు, సుకృత్యములు, వివేకము మున్నగువానిని నేను చాలఁగ నిరసించితిని. కావుననే యాకీల నాయంతరంగమును దగులఁబెట్టుచున్నది; నన్ను మనుజలోకమునుండి పిశాచలోకమునఁ ద్రోయుచున్నది. నేఁడు బుందేలఖండమున వెనుకటిశుభకరణుఁడు కాక యాతనిపిశాచము తిరుగుచున్నది. నీవు దివ్యగుణాఢ్యుఁడవు. సార్థకముగ నీపిశాచమునకు మహత్త్వ మేలయారోపింతువు!

మిక్కిలియచ్చెరువంది ఖిన్నుఁడై యువరా జిట్లనెను:—తండ్రీ! ఏమిట్లుపలుకుచున్నారు?

శుభ—నేఁజెప్పునదంతయు సత్యము. నేఁటివఱకు నేనేమిసేయుచుంటినో నీకుఁ దెలియదా! నాకార్యముల నెందైన నీకు మానవత్వము కన్పించెనా! పిశాచములఁగూడ భయపెట్టి దుఃఖింపఁజేయుకృత్య

ములు నాదినచర్యలై పోయినవి. చంపతరాయలవంటివీరశిరోమణి బుం
దేలఖండమున కైహికస్వర్గమగు స్వాతంత్ర్యముం దేఱ రాత్రిందివము
లు పాటుపడుచుండ నాతనికి సాయమొనర్పకుండుట యటుండ, జడుని
వలె నూరక కూరుచుండియైననుండక, యీశుభకరణపిశాచ మామ
హోపకారిచేష్టలయందు యథాసాధ్యముగ విఘ్నముల నొనఁగూర్చు
చున్నది. బుందేలురనెల్లరఁ బారతంత్ర్యనరకమునకు దెస కీడ్చుకొనిపోవు
టయే నాముఖ్యాదర్శము. ఇట్టిచర్యలయం దెట్టిదేశ, బంధు, ధర్మ,
ద్రోహము లొనర్పవలసియుండునో నీవంటియకల్మషవర్తనుఁడగుయువ
కున కూహింపరాదు. నీవు నీగుణములచే నీలోకమును నాకమొన
ర్చుము. నీపావనవర్తనముచే నుత్కృష్టకార్యములచే నీదేశము నెల్ల
విధముల సౌఖ్యవంతముగ నొనరింపుము. నావంటిపాపిని, దుర్మార్గుని
లెక్కఁగొనకుండుటయే నీకు మంచిది.

దలపతిరాయలు కంపితస్వరమున నిట్లుపలికెను:— «తండ్రీ!
మీసద్గుణములచాయయైన నాయందింకను గన్పట్టుటలేదు. సూర్య
కిరణములముం దొకచిన్నగ్రహమెట్లో, మీగుణములముందు నేనట్లు.
మీరు నిష్కారణముగ నాత్మనింద చేసికొనకుఁడు. మీగుణము లనే
కములు మిగుల బ్రశంసనీయములు.

శుభ—(సోద్రేకముగ) నీవుచెప్పునది యొప్పుకాదు. నీనేత్ర
ములకుఁ బితృప్రేమ యనుజవనిక యడ్డముగ నున్నది. మొదట నాజ
వనికం దొలఁగించి పిదప నన్నుఁ జూడుము. నాయందు గుణములు
న్నవనియేకదా నీవంటివి? అది యట్టిభ్రాంతి. గుణములతోడి నాసం
బంధము విచ్ఛిన్నమై చాలనాళ్లాయెను. తనసోదరునికి ద్రోహము
నర్చునట్టియుఁ, దదినష్టాశోకములే తనసౌఖ్యమని యెంచునట్టియు,
నకృతదపములు తద్వినాశనప్రయత్నములనే విలగున్నఁడనునట్టియు,





నరునికో సుగుణముల కేమిసంపర్కమున్నది! ఏమానవుఁడు స్వధ
ర్మము తిరస్కృతము నధఃపతితము నగుటను నిర్విచారముగఁ గాంచు
నో, యెవఁడు స్వధర్మవినాశనమునకై విధర్మ్ములసాయముఁ గోరుటయే
తనగౌరవముగ నెంచునో, యెవఁడు స్వదేశధర్మభ్రంశమునుజూచి
కన్నుల దుఃఖబాష్పములకు మారుగ నానందాశ్రువుల నించునో,
యాపాపికి సద్గుణములవిలువ యేమెఱుక! నేనొకప్పుడు గుణవంతుఁ
డనే యైయుంటిని. అపుడు దేశమునకై నాహృదయము మిగులఁ
దపించుచుండెడిది. కాని, యాకాలమున నేను చంపతరాయనిసఖుఁ
డను; తోడునీడను. «చంపతరాయశుభకరణు లిరువురునుగలిసి దేశ
ము నంతిమాదర్శముకడకుఁ జేర్తురు. ఐహికాపవర్గమగు స్వాతంత్ర్య
ము నొడఁగూర్తురు.” అని బుందేలఖండపుఁబ్రజ యెంచుచుండెడిది.
కాని, దేశమున కంతపాటియదృష్టము కూడనా? తరువాతఁ గొలఁది
కాలముననే చంపతరాయని నావైరిగ భావింపవలసి వచ్చెను. ఎట్టె
యెదుట దగ్గఱగఁ గన్పట్టు స్వాతంత్ర్యముపీడి నాయత్నముల మఱి
యొకదెస కభిముఖములుగఁ గావింపనయ్యెను. స్వాతంత్ర్యసంపాదన
ప్రయత్నములనుండు నాకరములఁ బారతంత్ర్యవిద్యోతనోద్యోగము
నఁ దగుల్పనయ్యెను. స్వాతంత్ర్యదేవీసౌందర్యమును గాంచుచుండు
చక్షువులను బారతంత్ర్యరాక్షసివంకకుఁ ద్రిప్పవలసివచ్చెను. శ్రోత్ర
ద్వంబును హృదయంగమంబగు నగు స్వాతంత్ర్యసంగీతమును వదలి
పారతంత్ర్యభీకరకర్కశరావము విననయ్యెను. దలపతీ! నేను గూడ
నొకప్పుడు నీవలె నకలంకకార్యతత్పరుఁడనై యుండెడివాఁడను. నా
యం దనేకములగు నుత్కృష్టాశయము లుండెడివి. చాల సద్గుణము
లుండెడివి........”

దల—(నమ్రముగ) అప్పుడు మీయాచరణములమార్చ నేమి

యవసరముకలిగెను? చంపతరాయలతో సఖ్యమునే నెఱపి స్వదేశలక్ష్మి నేల దాస్యవిముక్త నొనరింపరైతిరి!

శుభ — ఆస్వర్గీయానందము ననుభవింప నాలలాటమున లిఖింపఁబడలేదు. నిర్మలాకాశమున మనోహరస్వాతంత్ర్యచంద్రమండల ముదయించి ప్రజలపై సుధాసారంబులఁ గురిపింప సంసిద్ధమై యుండఁగనే మేఘము కన్పట్టెను. ఇంచుకసేపటికే యాకసమంతయు నీలకాదంబినీసమాచ్ఛన్నమైపోయెను. ఒకప్రక్కనుండి కాలపయోముచంబులు, రెండవప్రక్కనుండి దుష్టరాహువు, స్వాతంత్ర్యమండలమును మ్రింగివేయసాగినవి. నలుదెసల ఘోరపారతంత్ర్యాంధకారము వ్యాపించెను. ఆయంధకారమునఁ దిరుగుచుండు పిశాచములకన్నింటికి నేను నాయకుఁడనై దానిని మఱింత భయానకంబొనర్చు కార్యమునకుఁ గడంగితిని.

దల — తండ్రీ! ఆయంధకారముం దొలఁగింపఁ బ్రయత్నింపక దానిని వృద్ధిఁబొందింప మీరేల కడంగితిరి? పరాధీనత నశింపఁజేయుటయే యుత్కృష్టతమకార్యమని యెఱింగియు దానిని బెంపొందింప మీరేల సమకట్టితిరి?

శుభ — చంపతరాయలకుఁ బ్రతీకార మొనర్చుటకే యాతని ప్రయత్నములందు విఘ్నములఁ గల్పించుటకే, యాతనిగౌరవమును గుందించుటకే నాప్రతిన నెఱవేర్చుకొనుటకే నేనీపారతంత్ర్యపక్షము స్వీకరింపవలసివచ్చెను. నేను పరతంత్రుఁడ నగుదుఁగాక. నాసోదరులు పరతంత్రులగుదురు గాక. బుందేలఖండమునంతను బగులవాలొనరించినమైన విడిచెదఁగాక; కాని, చంపతరాయలను దత్ప్రయత్నములను మాత్రము నాశనమొనరింపక విడను. ఇదియే నాప్రతిన.



దలపతిరాయలు చకితుఁడై యిట్లనెను:— ‹‹ ఎంతకటువగు ప్రతిన! దీనిని బ్రతిజ్ఞగనే పరిగణింపరాదు. ప్రతినలు దేశోద్ధరణమునకై కాని, ధర్మపాలనమునకై కాని, దీనరక్షణమునకై కాని, యొనర్పఁబడుచుండును. స్వదేశముమీఁదను, స్వధర్మముమీఁదను, స్వకీయ ప్రియబంధువులమీఁదను గత్తిగట్టుట మిగులఁ బాపము. ఆపాతకమును బ్రతిజ్ఞతోఁ గూర్చుట మఱియుఁ బాతకము.

శుభ — (సుస్థిరుఁడై) నాకిదియంతయుఁ దెలియును. ఆప్రతిజ్ఞాదివస మింకను మూర్తీభవించి నాయెదుట నిలిచియున్నది. శిలావిగ్రహమువలె హీరాదేవి యాసమయమున నెట్లు నిలిచియున్నదో యట్లే నేఁడుగూడ నిలిచియుండెను. ఒక్కక్షణకాలముననే నేను నరత్వమును వీడి పిశాచమనై పోయితిని. నాబాహువులందు సంచరించు శౌర్యము నామానసమున నిశ్చలముగ వసించుధైర్యము నావచనములయందలి దార్ఢ్యము నానసమయమువఱకు స్వతంత్రతాదేవికొఱకే వినియుక్తములగుచుండెను. వీనినన్నింటి నేనాదిక్కునుండి మఱల్చి పారతంత్ర్యరాక్షసిదిక్కునకు సంధానింపవలసివచ్చెను. తొంటివలెనే యిపుడుగూడ నాకరవాలము శాంతముగ నొఱయందుండుటలేదు. ఇప్పుడుగూడ నాబలము నన్ను శాంతిఁబొందనిచ్చుట లేదు. ఇప్పుడును నా మనోనిశ్చయము లోలోననే యడఁగియుండుట లేదు. నాకరవాలము, నాశౌర్యము, నానిశ్చయము, నన్నియుఁ బూర్వమునవలెనే వెలయుచున్నవి. నాకృపాణము పూర్వమెంతరక్తముం గ్రోలెడిదో యిపుడుఁగూడ నంతరక్తము ద్రావుచున్నది. నావీరత యప్పటివలెనే రక్తపాతముఁ జేయుచున్నది. నానిశ్చయము తొల్లింటివలెనే రుధిరస్రవంతులఁ బ్రవహింపఁజేయుచున్నది. కాని, యిప్పటిరక్తముమాత్రము నాయాసుంగు బంధుగులది. ఇంతమాత్రమే భేదము. దలపతీ! ఇట్టిపాపాత్ముఁ

డగు తండ్రి వెంటనుండుట మంచిదని నీవు తలంచుచున్నావా! నేను నాజీవితమును వ్యర్థమొనరించుకొనినట్లే నీవుగూడ నీజన్మమును బాడు చేసికొందువా! నావంటి పిశాచము ననుసరించిన నీకేమిలాభము?

దల— తండ్రీ! ప్రతినమూలముననే మీరిన్నియకార్యములఁ జేయవలసివచ్చుచున్న దని గ్రహించియు మీరు దాని నేలవదలివేయరైతిరి!

శుభ—(కొంచెము కోపముతో) ప్రతిన వదలివేయవలయునా? నీనోటినుండి యిట్టి యపౌరుషవచనములు వెలువడరాదు. నీవు శుభకరణుని కుమారుఁడవు. నీవాడెడుమాటల విలువ నీవెఱుంగవలయును. శుభకరణుఁడు ప్రతినవీడెనని మనపితరులకుఁ దెలిసినప్పుడు వారెంతదుఃఖింతురు!

దల—ఐన బుందేలఖండపారతంత్ర్యమునకు మీరే కారణమని తెలిసినప్పుడు వారికి దుఃఖముకలుగదని మీరు భావించుచున్నారా! సరే- మీరింతటి ఘోరప్రతిజ్ఞ నొనర్ప నేమివచ్చెను?

శుభ—దలపతీ! ఆకారణ మడుగకుము. నాశౌర్యము, నాసుకృత్యములు, నాయుత్కృష్టాశయములు నెట్లు భ్రష్టములై పోయెనో, నాబల మెట్లునాశనమై పోయెనో, నాభౌతికజీవన మెట్లువంధ్యమైపోయెనో, నీస్థితికూడ నట్లే కాకుండుఁగాక యని నేను వాంఛించుచున్నాను. ఏతత్ప్రతిజ్ఞాకారణమును దెలిపినచో నీజీవనముగూడ వినష్టమైపోవును. నీసౌఖ్యమున గొప్పవిఘ్నము గలుగును. నీకొక్కగడియయైన శాంతి చేకుఱదు. కావున నేనాకారణముల దాఁచియే యుంపవలయును. కాని! దలపతీ! నేనింకొక్కమాట నీతోఁ జెప్పఁగోరుచున్నాఁడను. నీవు లక్షప్రయత్నములు సల్పినను నేను నాప్రతినవీడను. ఒక్కబుందేల్‌ఖండమేకాక లోకమంతయు నాశనమైపోయినను నేను నాప్రతిన



నుండి యించుకయు వెనుదీయను. నేను నాకర్తవ్యమును నిశ్చయించుకొంటిని. అమేయసామర్థ్యుఁ డగు పరమేశ్వరుఁడుగూడ నాగుఱి దానినుండి తప్పింపఁజాలఁడు.

ఇంతతీవ్రమగుపితృవాక్యము విని దలపతిరాయలు మిక్కిలి కించనొందెను. ఆకారణమున నతఁడు చాలసే పూరకుండెను. తుదకు నిరాశుఁడై యిట్లనెను. ‟తండ్రీ! స్వాతంత్ర్యసంబంధమగు మహాత్కార్యమున మీరు ప్రవేశించిన నెద్దియే నొకవిధమున నది నెఱవేఱితీరును. లేకున్నఁ బోనిండు. మీ రుదాసీనులై యున్నను నేఁడుకాకున్న మఱిపదినాళ్లకైన నది సిద్ధించితీరును. కాని, మీప్రయత్నములు దానికి విరుద్ధములుగ నున్నవి. ఇఁక నీబుందేలఖండప్రజాప్లవము మనోహరస్వాతంత్ర్యతీరమును జేరుటెట్లు? మీరు, హీరాదేవి, యనేకులగు నన్యరాజన్యులు నీయుడుపమును బెట్టిదమగు బానిసతనంపు సుడిగుండపువంకకు లాగికొనిపోవ శక్తికొలఁది పాటుపడుచున్నారు. ఇట్టిదశయందు వారారేవునకుఁ బోవ నెట్లు పయనము సేయఁగలరు?

శుభ—(సాలోచనముగ) నీవుసెప్పినది కడుయుక్తముగ నున్నది. కాని, నాకు నాప్రతినఁజెల్లింపక తప్పదు. దానికై యెట్టెట్టిపాపంబుల నేనాచరింపవలసియుండునో తెలియదు. దైత్యులుగూడఁ జూచి సిగ్గుపడునట్టికార్యంబుల నేఁజేయవలసియుండును. న్యాయాన్యాయవిచక్షణము వీడవలసియుండును. నీతిని బాతిపెట్టవలసియుండును. నాప్రియ బంధువులయసువులఁ గొనవలసియుండును. దలపతీ! నేనన్నివిధముల చేతను బరతంత్రుఁడను. నన్నుఁ బ్రతిజ్ఞారాహువు మ్రింగివైచెను. ఈప్రతిజ్ఞాసర్పతుండికుఁడు నన్నెట్లాడించిన నట్లాడుచున్నాను. ఇంతకన్న నాకు వేఱుతెరువులేదు. నిన్ననే యనేకమ్లేచ్ఛులప్రాణములఁ గొని నీవు నీధర్మశిఖరమునుండి యొకగొప్పయడుగు నుత్తరించితివి.

మహోత్సవదివసమున నీవు వింధ్యవాసినీదేవియాలయము నాశనముకాకుండఁ గాపాడితివి. ఈనీయద్భుతధర్మపరత్వము, నిరుపమవిక్రమము, నమేయధీరత్వముం గాంచి నేనభిమానభరితుఁడను గావలసినది. చంపతరాయలు తనకొమరుని చెయ్వుల నెన్నుకొని యాడెనో, యట్లే నేను నిన్నుఁగూడఁ గొనియాడఁదగినది. నీకుత్సాహముం గలిగించి నాయానందము వ్యక్తీకరింపవలసినది. కాని యేమిచేయను! నేను స్వతంత్రుఁడను గాను. ప్రతిజ్ఞాసముద్రమున మునిఁగియుంటచేఁ జచ్చినవానివలె నూరకుండవలసివచ్చెను. కాని, యీయర్ధరాత్రమున హీరాదేవి నీయాప్రశంసనీయకార్యమునకై "నీయీకార్యము నాకనిష్టముగఁ దోఁచె" నని యిప్పుడే నేను నీతో నేలవచింపలేదో యెఱుంగుటకై నా వెన్నంటి తిరుగుచున్నది. దలపతీ! నేనెంతపరాధీనుఁడనో యిప్పుడెఱుంగఁగల్గితివి గద! నీవిత్తెఱంగున నెల్లవిధములఁ బరాధీనమై యున్న మనుష్యపిశాచముతోఁగూడనుండి నీయుత్తమగుణసంపదఁ బాడుచేసికొనుట నాకిష్టముకాదు. వింధ్యవాసినీమందిరమునుండి వచ్చినదిమొదలింతవఱకు నేనిదియే ధ్యానించుచుంటిని. తలఁపఁదలఁప నాతల తిరుగసాగినది. నాయీబాధ్యతను దొలంగించుకొనుటకు నేనహోరాత్రము లాలోచించితిని. కాని, నాయనా! తుదకు మనమిరువురము జనకతనయసంబంధమును మఱచి స్వస్వకర్తవ్యనిర్వహణమునకై యన్యోన్యముని వీడి దవ్వుగ నుండవలయునని నేను నిశ్చయించుకొనక తీఱనదికాదు.

దల—(పెద్దనిట్టూర్పుతో) తండ్రీ! నన్నీవిధముగఁ బరిత్యజింపకుఁడు.

శుభ—ఇంతకన్న వేఱుపాయమే లేదు. నీకర్తవ్యపథము వేఱు. నాకర్తవ్యపథము వేఱు. ఇఁక మనకిరువురకు సంయోగముండదు.



నీవాత్మజ్యోతిఁ వెలిఁగింపఁజేయుభాస్కరుఁడ వయ్యెదవు. నేను నీతేజమును నిరసించుగుడ్లగూబ నయ్యెదను. నీవు స్వాతంత్ర్యదేవిసానముకడకు సాగుదువు. నేను పారతంత్ర్యఖాతముదిక్కునకుఁ బోయెదను. నీవు ధార్మికత, బాంధవ్యము, స్వాతంత్ర్యేచ్ఛ మున్నగుసుగుణమంజరీసౌరభానందముం గొల్లఁగొందువు ఇంక నేను విశ్వాసఘాత, ధర్మహీనత, ఘాతుకత మున్నగుదుర్గుణదుర్గంధమధ్యమున నాజీవనమును గడపెదను. నీవు స్వతంత్రతాదేవీయుచిరసుందరహాసహర్షానుభవము నందుదువు. నేను కర్ణకఠోరపారతంత్ర్యరోదనము నాకర్ణింతును. దలపతీ! లోకము నిన్ను స్వాతంత్ర్యదాతగ సంభావించి నీకు స్వాగతమొసంగును. దేశవినాశకులయొక్కయు, బంధుద్రోహులయొక్కయు, నామావళికి శాశ్వతాగ్రస్థానము నేనాక్రమింతును. మనకిరువురకును భూమ్యాకాశములయంతరముండును. నేను భూమిపై నివసించెడి యుల్లూకమనైనచో, నీవాకాశవీథిని వెలింగెడి యుజ్జ్వలభానుఁడవు. నీవంటిమహాపురుషున కత్యుత్తమమగునావాస ముచితము. నేను నివసించెడి తిమిరావృతంబగునగాధకూపము, సాగరరాజమందిరము, నీకెన్నటికి యుక్తమైనదికాదు.

దుఃఖమున దలపతిరాయలకన్నులనుండి బాష్పములు వెలువడఁజొచ్చెను. అతఁడు విలపించుచు నిట్లుపలికెను. "తండ్రీ! మీరిట్టిపలుకులాడకుఁడు. మీవియోగము నేనోర్వఁజాలను. మీకు సేవఁజేయవలయునను కోర్కి మనసులోనిది మనసులోననే యుండిపోవును.

శుభ—ఏమంటివి? నీవు నాకు సేవఁజేయుదువా! పిశాచమునకు సేవఁజేయుటవలన నీకేమిలాభము గలుగును? పిశాచానుగ్రహముగూడఁ బిశాచమువలె నంతభీకరముగను రాక్షసముగనే యుండును. నీకాయనుగ్రహము ప్రాప్తింపకుండుఁగాక! నీవుఁగూడ నావలెఁ బిశా

చమునై దేశసేవాపరాఙ్ముఖుఁడవు కాకుండువుగాక యనియే నేను కోరుచున్నాను. నీకార్యనిర్వహణము ధ్వంసముచేసి బుందేలఖండమున కొక యమూల్యరత్నము లభింపకుండఁ జేయుట నాకిష్టముకాదు. దలపతీ! బుందేలఖండస్వాతంత్ర్యము ఛత్రసాలదలపతుల కర్తవ్యతత్పరతపై నాధారపడియున్నది. మీరిరువురు పరస్పరవైరులై చెడిపోవకుండురు గాక యని నేనభిలషించుచున్నాను. నీకు నాపైఁ గృపయున్నచోఁ గుమారుని గుమార్గమునఁ బ్రవర్తింపఁజేసిన పాతకమున నేను నరకమనుభవింపకుండుట నీకిష్టమైనచో నీవు సాగరరాజ్యమును వదలివేయవలసియుండును. నేను జీవించియుండునంతకాలము నీవు రాజయోగ్యములగు నధికారములను, భోగములను బరిత్యజింపవలయును; నా మొగముఁ జూడకుండవలయును.

దలపతి విలపించుచు "తండ్రీ" యనిపలికి యూరకుండెను. అతనినోటినుండి యొకమాటయైన వెలువడదయ్యెను.

కొంచెముసేపటివఱకు దుఃఖవ్యాకులుఁడగు దలపతిరాయల దెసఁ జూచుచుండి మిగుల నుద్విగ్నహృదయుఁడై శుభకరణుఁ డిట్లుపలికెను. "మోహము చాలచెడ్డది. కాని, నేనీమోహపాశమునఁబడి నాకుమారున కెన్నఁడు నహితముఁ జేయను. ఈసమయమున నాయందుఁగల వివేకము, విచారణశక్తి, పాపభీతి, రేపటివఱకు సురక్షితముగ నుండునో, యుండవో నేను విశ్వసింపలేకున్నాను. కావున నాసదసద్జ్ఞానము నశింపకమున్నె నేను నాబాధ్యతనుండి విడివడవలయును. దలపతీ! కావున నేనిట్లు నిశ్చయించితిని. నీవు వెంటనే యిటనుండి వెడలిపొమ్ము. క్షణకాలమైన నిట నుండకుము. చంపతరాయలు మిక్కిలి యుదారపురుషుఁడు. అతఁడు నాకు శత్రుఁడైనను నాపుత్త్రునెడ శత్రుత్వముం బూనఁడు. నీవాతనిశిబిరమునకుఁ బొమ్ము. అతఁడు



నీకేమియానతిచ్చిన నది సంపూర్ణముగఁ బాలింపుము. ఇంతవఱకు నన్నెట్లుసేవించితివో యిటుపై నతని నట్లుసేవింపుము. ఇప్పటివఱకు నామాట నెట్లు పాటించుచుంటివో యిటుపై నతనిమాట నట్లుపాటింపుము. యువరాజగు ఛత్రసాలునితో నీసఖ్యము పెంపొందింపుము. స్వదేశస్వాధీనతాప్రయత్నముల నాతనికి సాయమొనర్చి నాకలుషితకార్యములవలనఁ గలిగినకలంకమునుండి స్వాభిజనయశంబును నిర్మలమొనర్పుము. రమ్ము. తుదిమాఱు నన్నాలింగనముచేసికొనుము.

అని పలికి శుభకరణుఁడు తనకొమరుని బిగ్గఁ గౌఁగిలించుకొనెను. జనకతనయుల యిరువురినేత్రములు బాష్పములచే నిండిపోయెను. హీరాదేవికాక యాస్థానమున మఱెవ్వరైననుండినచో నాస్థితి వీక్షింపవారిహృదయము తప్పక ద్రవించిపోయియుండెడిది. కాని, హీరాదేవి ఱాతివలె నట్లే నిలిచియుండెను.

చాలసేపటివఱకుఁ దండ్రికొడుకు లొండొరులయాలింగనముననే యుండిపోయిరి. తుదకు శుభకరణుఁడు దలపతిరాయని విడిచివైచి, గాఢమగు నిట్టూర్పువుచ్చి యిట్లు పలికెను:—"సరే. ఐపోయినది. మనయంతిమసమావేశము చెల్లిపోయినది. ఇంక మనము జనకతనయసంబంధమును మఱచిపోవలయును. ఇఁక నేనున్నాను. నాప్రతిన యున్నది. ఇటుపై మనకెప్పుడు సమావేశము కలిగినను నిన్నుఁ జంపతరాయలపక్షపాతిగను, సహాయకునిగను నెంచి శాత్రవదృష్టితోఁ జూచుచుందును." మెల్లమెల్లగ శుభకరణునిపై మరలఁ బ్రతిజ్ఞాపిశాచ మధిష్ఠించుచుండెను. అతఁ డిట్లనెను. "నేను బ్రతికియుండునంతకాలమును సాగరరాజ్యమునకు యువరాజు లేఁడనియే భావింపఁబడును. నేను మరణించుకాలమున నపుత్త్రకుఁడుగనే పరిగణింపఁబడుదును. నేఁటినుండి నేను యువరాజదలపతిరాయలను, నాతని యువరాజపదవినిగూడ

మఱపించినైచితివి. ఇంక నీవు యువరాజవు కావు. నారాజ్యపుఁబ్రజవును గావు. నీయధికారములెల్లఁ జెల్లిపోయినవి. ఇంక నీవు వెడలిపొమ్ము. నాశిబిరమున నింక నుండకుము. నీవిచ్చటనుండుట నాకుదుస్సహాముగా నున్నది. ఇటుపై నీవీపటభవనమున నెటనేని గన్పట్టినచో, చంపతరాయలదూతగ నెంచఁబడి దండింపఁబడుదువు."

ఇంతవట్టుపలికి తనకొడుకువంకకుఁ జూడకుండ శుభకరణుఁడచటినుండి వెడలిపోయెను. కొంచెముదూరముపోయి యతఁడు హీరాదేవితో నిట్లుపలికెను. "ఏమిహీరాదేవీ! ఇప్పుడు నీకు సంతుష్టి కలిగినదా!"

శుభకరణునిపలుకులంవలితీవ్రితకు హీరాదేవి తొట్రువడెను. ఆమె యొక్కమాటయైన నాడలేదు. శుభకరణుఁడు కొంచెముదూరము చనినపిమ్మట నేదియో ప్రలపించుచు వికృతముగ నవ్వసాగెను.

కొంచెముసేపటికి యువరాజదలపతిరాయని గుడారమునుండి యొకయువకుఁడు వెలుపలికివచ్చెను. ఆతనివంచుకము చాలసాధారణముగ నుండెను. దేహమున నలంకారాదిక మేమియులేదు. కాని, యాతనిమొగమునందలి శాచకళ నెవ్వఁడు డాపఁగలఁడు! యువరాజదలపతిరాయలు తనయావరాజ్యపదము, నైశ్వర్యము, త్యజించి కర్తవ్యనిర్వహణమునకై బయలువెడలెను. సూర్యభగవానుఁడుఁగూడ నాసరికి బాగుగ నుదయించియుండెను. ఆతనివంకఁజూచి దలపతి యిట్లనెను. "భగవానుఁడా! నీప్రకాశ మెల్లెడలఁ బ్రసరించును. నీవు తండ్రిగారిహృదయమునఁ బ్రవేశించి వారిప్రతిష్ఠాంధకారము నష్టమొనర్చినచో నేనొక్కఁడనేకాక, బుందేలఖండమంతయు ననుగ్రహితమగును. వింధ్యవాసినీదేవీ! నేసఁకఁ బోవుచున్నాఁడను. చికీర్షితకార్యమున నాకు విజయ మొనఁగూర్పుము.

---

# పదవప్రకరణము

జయసాగరసరోవరము.

జయసాగరసరోవరము తననైసర్గికచాంచల్యమును వీడి గంభీరముగ సృష్టిసుందరీవిలాసమును జూచుచుండెను. ఆసమయమున సృష్టిసుందరి మానసమున శ్వశురాలయపులజ్జావినయశీలముల ప్రభావము లేక యామె యొకచిన్నబాలికవలె స్వేచ్ఛగాఁ దనపుట్టినిల్లగు బుందేలఖండమున విహార మొనర్చుచుండెను. బుందేలఖండ మంతయు సృష్టిసుందరికిఁ బుట్టినిల్లే. అందును విశేషించి మహీబాప్రదేశము, విశేషించి యందలిజయసాగరసరోవరము, నామెకుఁ జాల ప్రేమాస్పదములు. నేఁడు సృష్టిసుందరి తనయన్నయగు వసంతరాజుతోఁగూడి జయసాగరసరోవరతీరమున వయాళి సలుపుచుండెను. వసంతరాజు తనతల్లియగు ప్రకృతిదేవినుండి యనేకమనోజ్ఞభూషణంబులంగొని తనచెల్లెలగు సృష్టిసుందరి కలంకరించెను. ఆమె యొకప్పుడీతరువులకడకుఁ బోవును; ఒకప్పుడామైదానమువంకకుఁ జూచును. మఱొకప్పుడు జయసాగరమునఁ దొంగిచూచును. వేఱొకతఱి మహీబాయందు దిమ్మరును. తుట్టతుదకలసియో విశ్రమించుట కంతకన్న మంచితావు దొరకదనియో, యామె జయసాగరసరోవరతటమునఁ గూరుచుండెను. వసంతుడు చెంతనే నిలువఁబడియుండెను.

అలసియుంటచే నామెలలాటమున నావిర్భూతములయిన స్వేదబిందువులఁ దనయుత్తరీయాంచలమునఁ దుడుచుచు నాతఁడిట్లనియెను:— "విజయా! నీవింతలోనే యలసిపోయితివి. ఇంకను మాసమ్ము

జూడవలసినదియుఁ, దిరుగవలసినదియుఁ జాలఁగనున్నది.

విజ—విమలదేవా! ఈస్థానము కడుసుందరముగ నున్నది. దీనిని విడిచి వేఱొకచోటికిఁ బోవుటకు మనసొప్పుటలేదు. ఇంద్రుని నందనవనమునఁ బండ్లయొక్కయుఁ బూలయొక్కయుఁ జెలువమేకాని, జయసాగరసామీప్యమువలనఁ గలిగెడు నీప్రదేశపు రామణీయకము దానికిఁగూడఁ బ్రాప్తించియుండదు. చూడుము. ఈసుమనోలోక ప్రతినిధులగు సూర్యచంద్రులు—అహోరాత్రము లిచ్చటిశోభం జూచుచుందురు. ఐనను వారి కింకను దనివితీఱిన ట్లగపడదు. ఎప్పుడు చూచినను వారిచ్చటిశోభం గాంచ సంసిద్ధులుగ నుందురు. ఈజయసాగరమున ననేకములగు పవిత్రపుణ్యజలంబులు కూడినవేమో. కనుకనే యిచ్చటికిరా మనసున కింతటియుల్లాసము కలుగుట—ఇంతకన్న నెక్కుడుమనోజ్ఞమును, శోభాయుక్తమును నగుప్రదేశ మెచ్చటనైనఁ జూచుటకు లభించునో, లేదో! కావున, మనము కొంచెముసేపటివఱకు నిచ్చటఁ గూరుచుండవలయును.

విమలదేవుఁడు నేమియు సంభాషింపక చెంత నొకఱాతిపైఁ గూరుచుండెను. మూర్తిమంతులగు నీసృష్టిసుందరీవసంతులమూలమున జయసాగరసరోవరచ్ఛవి యింకను వర్ధిల్లెను. వారిపదపద్మములఁ దాఁకుటచేఁ దన్నుఁదాఁ బరిపూతముగ నెంచుకొని జయసాగరమానందమున వారిచరణసేవ యొనర్పసాగెను. స్నేహార్ద్రమగు జయసాగరస్పర్శమువలన వారిచిత్తము లానందసాగరమునఁ గ్రుంకులిడఁదొడంగెను.

సూర్యునితోఁగూడ దినమెల్లఁ బ్రోషితమైన, తనసోదరియగు ప్రభను జేరి సంధ్యాకాలుఁ డామెతోఁగూడి యాకాశమండలి మేఘ



ములతో నాడుకొనఁజొచ్చెను. ప్రభాగౌరచ్ఛాయకును సంధ్యాకాల చిత్రవర్ణమునకును జక్కనిసమ్మేళనమై వారేమేఘములపై నొక్కక్షణమేని నిలిచిరో యామేఘములపై బంగరుపూఁత పూయఁబడిన ట్లగుచుండెను. ప్రభాన్వితుఁడై మేఘములతోఁ గ్రీడలాడి తుదకు సంధ్యాకాలుఁడు జయసాగరసరోవరమునొద్దకుఁ జేరెను. ఒక్కనీలమేఘముపై నాసీనులై సంధ్యాకాలుఁడును బ్రభయు జయసాగరసరోవరకాంతి నానందింపసాగిరి. వారు కూరుచుండుటచేఁ దన్నీలమేఘవర్ణము కొలఁదిసేపటిలో మారి మనోహరస్వర్ణవర్ణముగ నయ్యెను. దానినైపునకుఁ జూచి విజయ యిట్లనెను. "విమలదేవా! నీవీమేఘమును జూచితివా! దినమెల్ల నడచినకారణమున సూర్యప్రభ మిక్కిలి యలసియున్నను, నీస్థానపుటంత్యదర్శనమునకై తనసోదరునితోఁ గూడివచ్చి యామొగిలుపైఁ గూరుచున్నది. ఇరువురును జయసాగరసౌందర్యవీక్షణమున నెట్లు నిమగ్నులై పోవుచున్నారు! కాని, యెంతయాశ్చర్యకరము! ఎనిమిదిజాములు నొండొరుల విడిచియుండినను అన్న తనచెల్లెలితో నొక్కపలుకైన నాడుటలేదు!!

విమలదేవుఁడు గంభీరముగ నిట్లనెను:—"ఇందాశ్చర్య మేమున్నది. ఎప్పటినుండి వసంతుఁడు తనసోదరియగు సృష్టిసుందరితో జయసాగరవిలాసముం జూచుచున్నాఁడు! కాని, యాతఁ డిప్పటివఱకు నిచ్చటిశాంతి కేమేని భంగముఁగూర్చినాఁడా? ఇట్టియవసరములందు నీయీవిషయముల సంభాషణములు పరస్పరముఁ గేవలము కాంతలయందు గాని, కేవలము స్నేహితులయందుగాని, జరుగుచుండును. అన్నచెల్లెండ్రకు సంభాషణ మేమియు జరుగకున్న నించాశ్చర్యమేమున్నది?"

విజ—ఈయస్తమయభానుఁడును నుదయచంద్రుఁడును నిరువురును జయసాగరవిలసనముం గాంచుచున్నారు. కాని, వీరిరువురును

దీనివిషయమై యేలమాటాడుకొనుటలేదు ?

విమల — వారిరువురును మిత్రులు కాకుంటయే దానికిఁ గారణము. వారికార్యములుభిన్నములు; వారియిష్టములుఁగూడభిన్నములే. సూర్యునకు శుభ్రప్రభ యిష్టము ; చంద్రునకు నల్లనిరాత్రి యిష్టము ; ఒకఁడు పుడమిని సంతప్త మొనరించును. వేఱొకఁడు దానిని శాంతమును, సుషమమును గావించును. కావుననే వారిరువురికిఁ బొసఁగదు.

ఇంక విజయ యేమియుఁ బలుకలేదు. ఆమె జయసాగరసరోవరమందలి యుదకమును సురుచిరపద్మములను దరఁగలను దదేకదృష్టితోఁ జూచుచుండెను. కాని, విమలదేవునిమనసాదిక్కున నెంతమాత్రమును లేకుండెను. అతఁ డెవ్వియో గాఢవిచారముల మగ్నుఁడైనట్లు కాన్పించుచుండెను. జయసాగరసలిలమువలె వెలయు నతని స్వచ్ఛవదనము జయసాగరకాసారమువలె గంభీరముగఁ గన్పట్టుచుండెను. లావణ్యజలభరితమగు నాతనిముఖహ్రదమున మంజులమగు నయనసరోజయుగళము భాసిల్లుచుండెను. వీనియన్నిటివిలసనమును జెంచుటకై యందు విచారతరంగములు లేచుచుండెను.

ఒకకొంతసేపటికి విజయ విమలదేవునివంకకుఁ దిరిగి చూచెను. అప్పటి కాతఁడు గంభీరమయ్యు లక్ష్యహీనమగుదృష్టితో నామెవైపునకే చూచుచుండెను. ఆమె యులికిపడి యిట్లులనియెను:— “విమలదేవా ! ఏమియోజించుచుంటివి ?” వసంతునివలెను సంధ్యాకాలునివలెను, నీవును నీసోదరితో నేమియుఁ బలుకకుంటకు నిశ్చయించుకొంటివా యేమి ? వసంతసంధ్యాకాలులిరువురును గల్పనాహేతుమాత్రమున దృష్టరూపమును బొందిరనుమాట మఱచితివి కాఁబోలు ! లేనిచో నీవికల్పితసోదరానుకరణముఁ జేయకు. కొంచెమీజయసాగ



రకములాకరమువంకను దాని నిస్తులగాంభీర్యమువైపునను జూడుము. కొంచెమీనగుఁదామరలవంకను నీటియలలవంకను దృష్టిం బఱపుము. నీవీప్రపంచమును మఱచిపోదువు; స్వర్గవిహారమును గాంచెదవు; ఆనందవారిధి నోలలాడెదవు.

విమలదేవుఁడు స్వప్నమునుండివలె జాగరితుఁడై పలికెను. “కాని, విజయా! ఆనంద మొకస్వర్గముననే యున్నదా ! ఈప్రపంచమును వట్టిదుఃఖమయముగను, స్వర్గమునే సౌఖ్యమయముగను దలంచుటనఁ బరమేశ్వరుని నిష్పాక్షికతయందుఁ గళంక మారోపించుటయే. ద్యులోకమందలిప్రభ యీమేఘమునుండి యామేఘముపై వినోదక్రీడ సలుపునట్లే యీలోకమందలి సృష్టిసుందరియుఁ గ్రీడించుచున్నది. వీరిరువురి యానందమునను గొంచెమైన భేదమున్నదా ! సంధ్యాకాలము స్వర్గికమగుటయందు సందియములేదు. కాని, యదియు దుఃఖావిలముగఁ గన్పట్టును. సుఖదుఃఖములకు స్వర్గమర్త్యలోకములాధారములు కావు. వ్యక్తులుమాత్రమే యాధారములు.

విమలదేవుని యిట్టిగంభీరముద్రను గాంచియు, గంభీరభావమును వినియు విజయ పక్కున నవ్వెను. కాని, విమలదేవుఁ డామెవంకఁ జూచుచుఁ దనభావములయందే మగ్నుఁడైపోయెను.

విమలదేవుని నేఁటివర్తనము ప్రసన్నశీలయగు విజయకు రుచింపలేదు. ఆమె యిట్లనెను:—

“విమలదేవా ! ఇచ్చటిశోభనుగాంచ నీకు ముదము గలుగనిచో నిరర్థకముగ నిచ్చటఁ గూరుచుండవలసిన యవసరము లేదు. నడువుము. ఎచ్చటికేని మఱియొకతావునకుఁ బోదము.” అనిపలికి విజయ లేచి నిలువఁబడెను. కాని, విమలదేవుఁడు కూరుచుండియే యామెహస్తమును బట్టుకొని మరలఁ గూరుచుండఁబెట్టెను.

విమ — విజయా! కొంచెము మాఁగుము. ఈసంధ్య బలవంతముగఁ బురుషరూపము ధరించి సంధ్యాకాలపురుషవాచకనామముం బెట్టుకొనెను. వసంతలక్ష్మియు నట్లే పురుషవేషము నూనెను. వీరిరువురును వాస్తవమున స్త్రీలు. కాని, జనులకన్నుల దుమ్ముఁగొట్టుటకై జనులఁ జిక్కుపెట్టుటకై వీరు మగవేసములఁ గల్పించుకొనిరి. ఈకృత్రిమవేష మెంతవఱకునిలుచునో, యిరువురును రహస్యముగఁగలిసికొనియుఁ దమయీ కాపట్యమును వీడుదురో లేదో, కొంచెమునే విచ్చుట నాఁగి చూడుము.

ఇట్లు పలికి విమలదేవుఁడు క్రమ్మఱఁ దనయాలోచనముల మగ్నుఁడయ్యెను. విజయ మరల నచ్చెరువుతో విమలదేవునివంకఁ జూడ నారంభించెను. విమలదేవుని పలుకులయందలి యభిప్రాయ మామెకు బోధపడలేదు.

కొంచెమునేపటికి విమలదేవుఁ డిట్లనెను:— "ఈయుగ్రప్రభకన్న నీసంధ్య యెక్కుడుకాంతముగను శాంతముగను వెలయుచున్నది. అట్లే యీవసంతలక్ష్మి సౌందర్యము సృష్టిసుందరిసౌందర్యముకన్న మిన్నగ నున్నది. ఐనను వనితాశీలము ననుసరించి, తమసౌందర్యమును బ్రదర్శించుటకన్న వసంతలక్ష్మియు, సంధ్యయుఁ బురుషవేషమున నుండుట మిక్కిలి యుత్తమముగ నేలయెంచవలెను! వారికి జన్మసిద్ధములగు తమవేషములయం దింతయు నభిమానములేదా! కాంతాయోగ్యములగు తమవేషముల ధరించుటయందు వారికి నుంతయు వాంఛ లేదా!

విమలదేవుఁ డొకసారి మనోహరమగు విజయనేత్రమువంకకుఁ జూచెను. ఆనయనము లన నాతనిమనసున నేమేమిభావము లుప్పతిల్లియుండెనో తెలియదు. విమలదేవుని వైలక్షణ్యము [illegible]



వృద్ధిఁబొందుటంజూచి విజయ చాలఁ జకితయై యిట్లనియెను:— "నాకుమాత్రము సంధ్యయు వసంతలక్ష్మియుఁ బురుషవేషమున విహరించుచున్న ట్లేమియుఁ గానవచ్చుటలేదు."

విమ — సంధ్యయు వసంతలక్ష్మియుఁ బురుషవేషమునలేరా? కొంచెము శ్రద్ధతోఁ జూడుము. ఇంతవఱకు వారొండొరుల మోసగింప యత్నించుచుండిరి.

విజ — అవ్వే! సంధ్యావసంతలక్ష్ము లిద్దఱును గల్పితపాత్రములు. పురుషులుగ భావించి సంధ్యాకాలుఁడనియు వసంతుఁడనియుఁ జెప్పినను సరే. లేక స్త్రీలని భావించినను సరే. అంతయుఁ గాల్పనికమే.

విమ — (స్పందితస్వరమున) విజయా! ఇట్టిపక్షపాతదృష్టితోఁ జూడకుము. నీకందమగు స్త్రీవేషమే కలదుగదాయని ప్రతివ్యక్తికి నట్లే కలదనరాదు. అనుచితముగఁ బురుషవేషము ధరించియుండువా రెవరును, నీకిచ్చట నగపడుటలేదా?

విమలదేవుని యీప్రశ్నమును విని విజయ శ్రద్ధాయుక్తమగు దృష్టితో, నాకసమువంకఁ జూచెను. అటనుండి దృష్టిమరల్చి తనసమీపమున నలుదెసలఁ జూచెను. కాని, విమలదేవుని కల్పితపురుషవేషమునది యామె కేమియుఁ గాన్పింపలేదు.

చివరకు విజయ యిట్లనెను:— నాకిచ్చట నెవ్వరును బురుషవేషము ధరించినవారు కాన్పించుటలేదు. విమలదేవా! నీవుతప్ప నాకిచ్చట నెవ్వరును బురుషులు కానవచ్చుటలేదు.

విమ — (శాంతగభీరుఁడై) నిజముగ నీకెవ్వరును గన్పడుట లేదా! సరే. వినుము. జయసాగరసరోవరసామీప్యమునఁ దిరుగుటయు, దానియసమానసౌందర్యము నీక్షించుటయు, వాస్తవముగ వనితలపనియే. ఈప్రదేశమున వనితలే విహరింపవలయును. పురుషుల కిచ్చట

నేమియు మోహము కలుగఁజాలదు. అదే చూడుము. సంధ్య తనయనుచితశుభ్రవస్త్రములఁ దొలఁగించి యథోచితనీలవస్త్రముల ధరియింప నారంభించినది. వసంతలక్ష్మియుఁ బురుషవేషమును వదలి సుందరమగు వనితావేషమును ధరింప నారంభించినది. కాని, నేను—నేనుమాత్రమే యిప్పటివఱకు నీయనుచితవేషముననే యుంటిని.

విజ—(సాశ్చర్యముగ) విమలదేవా! నీవేషము నీకనుచితముగఁ దోఁచుచున్నదా? నీవుగూడ కాంతావేషముధరింపఁగోరుచున్నావా?

విమ—అవును. సంధ్యాకాలుఁ డెట్లు స్త్రీవేషమును ధరియించెనో వసంతుఁ డెట్లు వసంతలక్ష్మియైపోయెనో యట్లే నేనుగూడఁ గొంచెముసేపటివఱకు............

విజయ నవ్వుచు నడుమనే యిట్లు చెప్పివైచెను. అట్లే కొంచెముసేపటివఱకు నీవుగూడ విమలదేవునుండి విమలవు కాఁగోరుచున్నావా! విమలదేవా! కాదు. సోదరీ! విమలా! నీకు స్త్రీవస్త్రములు నాకడ సిద్ధముగ నున్నవి. నేనిచ్చట స్నానముచేయనెంచి వచ్చునప్పుడు వస్త్రములఁగూడ నాతోఁ దెచ్చుకొంటిని. కాని, యిప్పుడు స్నానమునకు వ్యవధిలేదు. నీవీవస్త్రముల ధరించి విమలవై పొమ్ము. నీయీమొగమునకును, వనితవంటినీయందమునకును, స్త్రీవేషము చాల సొంపుగూర్చును.

విమలదేవుఁ డేమియు మాఱుపలుకలేదు. అతనిదృష్టి విజయచేతియందలి వస్త్రములపై లగ్నమైయుండెను.

విజ—సోదరీ! విమలా! నీవీవస్త్రములను గ్రహించి యాచెట్టుచాటునకుఁ బోయి సింగారించుకొనరమ్ము.

విమలదేవుఁడు నిజముగ విజయహస్తములనుండి వస్త్రములను



గ్రహించెను. వానిని ధరించుటకై యాతఁడు సమీపమున నున్న యొకచెట్టుచాటునకు వెడలిపోయెను.

విజయ వెఱఁగంది యాతనివైపునకుఁ జూచుచు నవ్వుచుండెను. "విమలదేవునికి స్త్రీవేషముండాల్ప నింతటిప్రబలవాంఛ యేలకలిగెను?" అని యామె మనసున ననుకొనెను. కాని, కారణ మేదియు నామెకు గోచరింపలేదు.

ఆకసమందలి సౌదామని యొక్కమాఱుగఁ దనసుషమదీప్తిని వెదచల్లుచుఁ గనఁబడురీతిని విమలదేవుఁడు పోయినదిక్కునుండి యొక సౌందర్యమూర్తి వచ్చుచుండుట కానఁబడెను. తన్నయనములనుండి విద్యుత్కాంతి వెలువడుచుండెను. ఆమె శ్వాసమునుండి నందనోద్యానసౌరభము నిర్గతమగుచుండెను. ఆమెరదనములు దివ్యతారానిర్మితముల ట్లుండెను. ఇంద్రధనువు మేఘములనుండి నైల్యమును గ్రహించి యామె భ్రూద్వితయమును నిర్మించియుండును. విశుద్ధమందాకిని యామెతలపై సంచరించుచుండెను. ప్రభాతసుందరి తనయారుణ్యము నామెకపోలాధరముల కొసంగెను. ఆమెకు గమన మైరావతమునుండి ప్రాప్తించెను. ఆసురలోకలావణ్యలత నీపృథ్విపైఁ గాంచి విజయ మిక్కిలి యాశ్చర్యమునందెను. మందహాస మొనర్చుచు మతంగయానములతో నాసుందరి వచ్చుటంగాంచ, నామె యాశ్చర్యము మిక్కుటమయ్యెను. విమలదేవుఁడు పురుషవసనములను వీడి స్త్రీవసనములను ధరించుటయందు విమలదేవునుండి విమలయగుటయందు నీవిధమున స్వర్గపాతాళవ్యత్యాసముండునని విజయ యనుకొనియుండలేదు. ఈరమణి స్త్రీవేషముండాల్చిన విమలదేవుఁడే యని గ్రహించుటకే విజయకుఁ జాలసేపయ్యెను.

ఈలోపుననే యాసుందరి నవ్వుచు వచ్చి విజయచెంత నిలువఁ

బడెను. ఆమె యొకచేయి విజయభుజముపై నుంచెను; రెండవచేతివ్రేలొకటి యామె పెదవులపై నుండెను.

తనయాశ్చర్యము కొంతతగ్గినపిమ్మట విజయ విమలదేవునితో నిట్లులనెను:-“విమలదేవా! నీవు స్త్రీవేషముధరించి వత్తువని నే నెఱిఁగియుండినను నిన్నుఁ జూచుటతోడనే నాకు మిక్కిలి యాశ్చర్యము కలిగెను. నాకు మొదటినుండియుఁ దెలియకుండిన, నీవు కాంతావేషముం దాల్చి యొక్కమ్మడి నాయెదుటికి వచ్చినిలిచినచో, నిన్ను స్వర్గమందలి దేవతగ నెంచి నీపాదములం బడియుందును. లేదా నిన్నొకయప్సరసయనియో నాగకన్యకయనియో తలంచి యాశ్చర్యవిహ్వలనై పోయియుందును.”

విజయమాటలు విని విమలదేవుఁడు మిక్కిలి సంతసించెను. చాలనాళ్లకోర్కె నెఱవేఱినప్పు డెట్టితనివి కలుగుచుండునో విమలదేవునిమొగమున నట్టితనివియే యొప్పారుచుండెను. చాలసేపూరకయుండినపిదప నాతఁ డిట్లనెను:—విజయా! నాకెల్లకాలము నీవేషమునే ధరించియుండుట కాజ్ఞదొరకుచో నాకెంతయు సౌఖ్యము గలిగెడిది. చాలకాలమునుండి యీవేషము ధరింపవలయునను వాంఛ కలదు. నేఁటికి నాకాసమయము ప్రాప్తించినది.

విజ—విమలదేవా! నీవు పిచ్చివారివలె మాటాడెదవేల?

విమ—అవును. నేఁటివఱకు నేనేమి యాచరించితినో యది తప్పక పిచ్చితనమే యగును. నాకు వనితావేష మింతప్రేమాస్పదమైనది. ఐనను నేనింతవఱకుఁ బురుషవేషమున నుంటిని. ఇది నాపిచ్చితనమే. కాని, యీపిచ్చితనము కేవల మన్యప్రేరణమున నటింపవలసివచ్చెను. ఇందు నావశ మేమియులేదు.

విజ—ఏమనుచుంటివి? నీమాటలయందలిభావము నాకు బోధపడుటలేదు.



విమ—నేఁడన్నివిషయములు నీకు బోధపడును. తల్లిగారికోర్కెవలననే నేనిప్పటివఱకుఁ బురుషవేషమును ధరింపవలసివచ్చెను.” ఇట్లు పలికి విమలదేవుఁ డొక్కనిట్టూర్పుపుచ్చెను.

విజయ—(సాశ్చర్యముగ) తుదకీమాటల కన్నిటికి సారాంశమేమి?

విమల—“సారాంశమా! సారాంశమిది.” ఏమనఁగా—విమలదేవుఁ డింక నేదియో చెప్పనుండెను. విమలదేవుని సత్యస్వరూపము విజయ కెఱుకపడనుండెను. విమలదేవున కింక రెండుమాటలఁ బలుకుట కవకాశముండినయెడల—కాని, యట్లు జరుగలేదు. విమలదేవుఁడు పలుకుచుఁ బలుకుచు నడుమ నాఁగిపోయెను. అతనికిఁ గొంచెముదూరమున నొకనావ కన్పట్టెను. దానిపై నొకయువకుఁడు కూరుచుండి జయసాగరశోభను గాంచుచుండెను. ఇఁకఁ గొంచెమేనిఁ జెప్పినచో నాతనికిఁగూడఁ దనరహస్యము తెలిసిపోవునని విమలదేవునకు భయము కలిగెను; కావున నూరకుండెను. అప్పుడు విజయ యిట్లనెను. “విమలదేవా! నడుమనే యేలయూరకుంటివి? ఏమిచెప్పచుంటివో చెప్పుము.”

విమలదేవుఁడు నావవంకకుఁ జూపుచు నిట్లనెను:-ఆనావపైపునకుఁ జూడుము.

విజ—సరే. చూచితిని. ఐన నేమాయె?

విజయప్రశ్న కుత్తరము విమలదేవుని పెదవులపై నాడుచుండెను. అతఁడు మిక్కిలి ప్రయత్నమునఁ దనమనోవ్యగ్రత నడంచుకొని శాంతుఁడై యిట్లుచెప్పెను. “అగుట కేమున్నది? మనముగూడ నట్లే యొకనావందీసికొని జయసాగరవిహారానందమును గాంచినచోఁ జాల బాగుగ నుండును.”

విమలదేవుఁడు తనమాటలప్రసంగము మార్పఁగోరుచున్నాఁడని విజయ వెంటనే గ్రహించెను. కాని, నావపై నెక్కి జయసాగరమున విహరించుటయనుమాట మిక్కిలి ప్రియమై యది వినుటతోడనే యామె తక్కినమాటలన్నియు మఱచిపోయెను. ఆముగ్ధకిపుడు—నావ—జలవిహారము—తక్క మఱేమియు స్మృతిపథమున లేదు. ఆమె నావవెదకుటకై తత్క్షణమే యొకవైపునకుఁ బరుగిడెను.

బుందేలఖండమున జయసాగరమువంటి పెద్దసరోవరము లనేకములు కలవు. వానిమూలమున నచ్చటివనలక్ష్మి మిగుల సొంపుఁగాంచియుండెను. నావపై నెక్కి సరోవరమున విలాసములల్పుట యచ్చటివారికి మిగులఁ బ్రియము; స్వాభావికము; విజయకుఁగూడ నావయనినఁ జాలకౌతుకము. ఆమె నావనడుపుటయందుఁగూడఁ జాలనేర్పరి. తఱచుగ ధాంధేరమునందలి తనరాజభవనమునకు సమీపముననున్న సరోవరమున నావపై నెక్కి యిటునటు విహరించుచుండును.

ఇంచుకసేపటికి విజయ యొకచిన్ననావను గొనివచ్చెను. విమలదేవునకు స్వయముగఁ బడవనడుపుట రాదు. కాని, విజయ చక్కగ నడుపఁగలదని యాతఁ డెఱుంగును. కావున, నాతఁ డాపడవనెక్కుటయందు హానియేమియు లేదని తలంచెను.

విజయ విమలదేవు నిట్లడిగెను. "నీవీయాఁడువేసముతోడనే నావపైఁ గూరుచుండెదవా!" కాని, విమలదేవుఁడు దానికేమియు సమాధానమొసంగలేదు. అతఁడు నావపైకి దుమికి విజయ కెదురుగఁ గూరుచుండెను. విజయయును దనప్రశ్న కుత్తరము లభించెనని యెంచి నవ్వుచు నావ నడుప మొదలిడెను.

నావ మెల్లమెల్లఁగ సాగుచుండెను. ఆసమయమున జయసాగరసరోవరము నీలాకాశమండలమువలెఁ దోఁచుచుండెను. తరంగనిర్గత



మగు విశుద్ధడిండీరము తారాసంఘమువలె వెలయుచుండెను. ఆసుందరమగునావ చందురునివలె భాసిల్లుచుండెను. శాపభ్రష్టలగు నిరువురు దేవకన్యలను శాపానుభవావసానమునఁ జంద్రుఁ డీలోకమునుండి నాకమునకుఁ గొంపోవుచున్నట్లుండెను. జయసాగర మీకార్యమునఁ దనచెలికాఁడగు చంద్రునకు సాయమొనర్పుటయం దాశ్చర్యమేమియు లేదు.

బహుయామములు గడచినపిమ్మటఁ దనప్రాణప్రియుఁడగు పతి తనకడకు వచ్చుచుంటఁజూడ బశ్చిమదిశాసుందరికపోలములు సిగ్గుచే నెఱ్ఱవాఱుచుండెను. అదిచూచి విమలదేవుఁ డిట్లనెను.

"విజయా! నీకానాఁటిమాట జ్ఞప్తియందున్నదా?"

ఒకచేతియందలి తెడ్డువదలి యాచేతితోడనే తనలలాటమునందలి చెమటందుడుచుకొనుచు విజయ యిట్లడిగెను:—ఏనాఁటిమాట?

విమ—వింధ్యవాసినీదేవి వార్షికోత్సవమునాఁటిది.

విజ—సరి. యానాఁటిమాటకూడ జ్ఞప్తియందుండదా! ఇంకనొకవారమైనను గాలేదే! అప్పుడే యామాట మఱపునకు వచ్చుటెట్లు? కాని, యాదినము నీకెంతగ స్మరణయందున్నదో, నాకంతగ లేదు. ఆనాఁటియేవిషయము నీమనసునఁ బట్టియున్నదో కాని, నీకాదినమే మఱపురాకున్నది. ఆఁడువేసమునందలివేడుక నీకానాఁడే పుట్టియుండనోపు!

అని పలికి విజయ విమలదేవునిసుందరమగు స్త్రీవేషముం జూచుచుఁ బక్కున నవ్వెను; మరలఁ దెడ్డువేయ మొదలిడెను.

విమ—(ఆమెచేయిఁబట్టుకొని) కొంచెముసేపు తెడ్డువేయుట మానినచో, మఱేమియు నష్టములేదులెమ్ము. ఆనాఁడు—

విజ—మరల నదియేమాట!

విమ—ఆనాఁడు మనము వింధ్యవాసినీ దేవికి సమర్పించినమాల జాఱి యువరాజగు ఛత్రసాలునికంఠమునఁ బడెను. ఆసమయమున నీవదనమునఁగలిగిన చెలువు నాకింకను జ్ఞప్తియందున్నది. మగనిరాకవలన నీపశ్చిమాశాసుందరివదన మెట్లుశోణితమగుచున్నదో, యంతకన్న నధికముగనే యానాఁడు నీమొగము శోణితమైపోయెను.

విజ—నీమొగముఁగూడ నట్లే తెల్లవడిపోయెను. కాని, నీలలాటమంతయుఁ జెమటచే నిండిపోయియుండెను. నిన్నుఁ గుదమనియే యనుకొంటిని. నీతల్లివలె నీవుఁగూడ ఛత్రసాలునెడ ద్వేషముంబూనియుంటివా? ఛత్రసాలుఁ డెంతస్నేహపాత్రుఁడు! ఎంతయుదారుఁడు! ఎంతసరళహృదయుఁడు! నేఁడు ప్రాణనాథస్వాములవారు శ్రీరామచంద్రవిభవమున లవకుశులవీరత్వమును వర్ణించిచెప్పిరి. యువరాజు ఛత్రసాలుఁడుఁగూడ నానాఁడట్టివీరత్వమునే ప్రకటించెను; అంతటివీరుఁడైనను ఛత్రసాలునిస్వభావ మెంతసరళము! ఎంతస్నిగ్ధము! తనసుగుణములవలన నతఁ డెల్లరకుఁ బ్రేమాస్పదుఁ డగుచున్నాఁడు. తండ్రిగారుమాత్ర మేలయో కాని యాతని ద్వేషింతురు. వారిమాట యటుండనిమ్ము. మీతల్లిదండ్రులకు ఛత్రసాలునితో నెంతటిదగ్గఱసంబంధము! కాని, వారును మనసున ఛత్రసాలునెడ చాలఁ జెడుగు దలంచుచుందురు. మీతండ్రి నోర్ఛాసింహాసనముపై ఛత్రసాలుని తండ్రియే కూర్చుండఁబెట్టెను! చంపతరాయలే తనయతులితపరాక్రమమువలన మీతండ్రికీరాజ్య మిప్పించెను. లేనిచో నీతల్లిదండ్రు లొకపల్లెటూరికిఁబోయి జీవితమంతయు హాలికవృత్తియందే కడపవలసివచ్చెడిదని యెల్లరును జెప్పుచుందురు. ఇంతయైనను, వారు చంపతరాయనిపట్లను, నతనికుటుంబమునుపట్లను, జాలద్వేషభావముతో మెలఁగుచుందురు. విమలదేవీ! నీతల్లిదండ్రులయీ వ్యాపారమునీకిష్టముగనున్నదా?



విమ—(వ్యాకులతతో) నాకిష్టమైనను గాకున్నను, వారియాజ్ఞానుసారముగనే నేనుండవలయును. నేఁబోయి ఛత్రసాలునితోఁ గలిసి మైత్రినెఱపి సాధ్యమైనంతవఱకు నాతనికార్యములందు సాయపడవలయుననియే యెల్లప్పుడును గోరుచుందును. కాని, నేఁగోరినంతమాత్రమున నేమగును! నాప్రతికార్యమునకును దల్లి కఠినదృష్టిఁబఱపుచునే యుండును. నేనేకార్యమును, ఆమెయిచ్ఛకు విరుద్ధముగఁ జేయఁజాలను. నామనసుపైని నాయాలోచనలపైని ఆమెకేమియు నధికారము లేకుండుటయే నేను గొప్పగఁ దలంచుచున్నాను.

విజ—నేను ప్రాణనాథస్వాములకు యువరాజుఛత్రసాలుని సందేశముం జెప్పిననాఁడు తండ్రిగారు లోలోపల నాయెడ నెంతకుపితులైరి! దినమెల్లను వారికోప మట్లేయుండెను. మఱునాఁడు నన్నేదమచెంతకుఁ బిలిచి, మంచియుఁ జెడ్డయుఁ జెప్పిరి. నీవిఁక ఛత్రసాలునెదుటికైనఁ బోయినచో శిక్షింతుననికూడ వారు నాతోఁ జెప్పివైచిరి. ఛత్రసాలునం దేమంతదోసమున్నదో వారికే తెలియవలయును. ఇప్పుడును మనమాలయములోఁ జూచిన శ్రీరామవిగ్రహ మెంతమనోహరముగనున్నదో యువరాజు ఛత్రసాలుఁడుఁగూడ నాకంతమనోహరముగఁ గన్పట్టును. నాకెనిమిదిజాములు నతనితో నుండవలయుననియుండును. శ్రీరామచంద్రుఁ డెట్లు లంకాపతియగు రావణుని నతనియభిజనమును నశింపఁజేసి ప్రజలను గష్టములనుండి తొలంగించెనో, యట్లే యువరాజుఛత్రసాలుఁడుగూడ ఢిల్లీరాక్షసుల నశింపఁజేయును. యువరాజుయత్నములవలన శీఘ్రముగనే బుందేలఖండమంతయు నీరాక్షసులవశమునుండి తొలఁగి స్వచ్ఛందమైపోవును. ఇంతటిమహాకార్యమున నతనికి సాయమొనర్పకుండుట యటుండఁ దండ్రిగారు దానికడ్డముగను విఘాతములం గూర్ప నాలోచించుచుందురు.

విమ—నీతండ్రిగా రెక్కడకుఁ బోయిరో నీకుఁ దెలియునా?

మెల్లమెల్లఁగ నావ నడుపుచు విజయ యిట్లుపలికెను—“ అక్కా! నా కేమియుఁ దెలియదు. హఠాత్తుగ వారిప్రయాణపు టేర్పాటులన్నియు జరిగిపోయినవి. వింధ్యవాసినీదేవినిఁ గడపటిసారి దర్శించుకొన మనము వచ్చినపుడు శీఘ్రముగా నన్నుఁ దండ్రిగారు పిలిచి, “ నీవు హీరాదేవితోఁగూడ నోర్ఛాకుఁ బొమ్ము. అచ్చటినుండి నిన్ను ధాంధేరనకుఁ బిలువనంపెదను.” అనిమాత్రము చెప్పి వెడలిపోయిరి. అప్పటినుండి యిప్పటివఱకు నేను మీతోడనే యుంటిని. తా మెచ్చటికిఁ బోవుదురో తండ్రిగారు చెప్పనులేదు. ఆవిషయమున నేను వారి నేమియు నడుగనులేదు. నేనూహించినంతవఱకు—వారు ధాంధేరనకే పోయియుందురని తోఁచుచున్నది. నడుమనడుమ చాలచోటుల నాఁగుచుఁ బోవుటచే నేను శ్రమపడుదునని వారు నన్ను మీయొద్ద వదలిపెట్టి వెడలిరేమో!”

విమ—(మిగుల నాశ్చర్యమున) మీతండ్రిగా రెచ్చటికిఁ బోయిరో యదియు నీవెఱుంగవా? విజయా! చూచితివా? వారిసంకల్పము లెంతగుప్తములై యుండునో! వారు ధాంధేరునకుఁ బోలేదు.

విజ—(ఆశ్చర్యముతో) మఱింకెక్కడికిఁ బోయిరి?

విమ—ఢిల్లీకిఁ బోయిరి!

విజ—ఢిల్లీకా!

విమ—అవునవును. ఢిల్లీకే పోయిరి. పోవుటకుముం దమ్మగారితోఁ జాలసేపటివఱకు వారు రహస్యముగ మాటలాడుచుండిరి. వారిమాట అయిపోయినపిమ్మట మీసేవకుఁడు కృష్ణుఁ డొకయొంటెను దీసికొనిరాఁగా దానిపై నెక్కి మీతండ్రిగా రెవ్వరితోడను నేమియు సంభాషింపక, గుప్తరూపమున ఢిల్లీకిఁ బోయిరి.



విజ—(తెప్ప వదలివైచి) చాలనద్భుతముగ నున్నది. సరే. వారు ఢిల్లీ కెందులకై పోయిరో, యదికూడ నీకేమైనఁ దెలిసినదా?

విమ—నేనది యెఱుంగుటకుఁ బ్రయత్నించియుండినచో, నీకిప్పు డిచ్చటఁ గన్పించియుండనని నాయనుమానము. విజయా! నా తల్లికోపము నీకింకను దెలియనట్లు తోఁచుచున్నది. తనకొమరుఁడని యెంచి యామె నన్నెప్పుడును విడువఁజాలదు. అచటినుండి రెల్లరి ప్రయాణసన్నాహమైపోయినపుడుఁగూడ నింకను వాదు మాటలాడుచునే యుండిరి. తండ్రిగారి కది తెలిసి యమ్మ ప్రయాణసన్నద్ధయైనదేమో చూచిరమ్మని నన్నంపిరి. నేనచ్చటికిఁ బోఁగా నీతండ్రి ఢిల్లీప్రయాణపుగుసగుస నాచెవులోఁ బడినది. ఇంతకన్న నేనేమియు వినలేదు. అప్పుడు నేను తనయొద్దకు వచ్చుచుండుటఁ జూచి, యమ్మ మిక్కిలి కోపముతోఁ గన్ను లెఱ్ఱఁజేసెను. నీవాసమయమున నామెను జూచి యున్నచో భయముచే గడగడ వణఁకిపోయియుందువు.

విజ—విమలదేవా! నీతల్లిక్రోధమును నేనెఱుఁగుదును. నిన్న మనమీమహోబాఁ జేరినప్పుడు మీతల్లి దాసియగు గిరిజ ప్రతివత్సరమునందువలెనే మహోబాదుర్గమున నున్నచో నష్టమేమియని యామెతో ననెను. ఇది విన్నతోడనే యామె కఱకాలిమంట నెత్తికెక్కినది. వెంటనే యాబిడ పాపమాగిరిజను విపరీతముగ దండించెను.

హీరాదేవిని స్మరింప విజయావిమలదేవులప్రసన్నవదనములుఁగూడ నించుక మ్లానములయ్యెను. కాని, యామ్లానత కొంచెము సేపటివఱకే యుండెను. కొన్నినిమేషములకే వారిముఖములు మరల జయసాగరసరోజములవలె వికసితములై పోయెను. విజయ యట్లే నావను నడుపుచుండెను. సరోవరమునడుమ లంకవలెనున్న యొకచిన్న ప్రదేశము కలదు. విజయ యాలంకవైపునకే పోఁగోరుచుండెను.

ప్రసన్నముఖుఁడై విమలదేవుఁ డిట్లుపలికెను:—విజయా! నీవింతచుఱుకుగ నావను బోనిచ్చినచోఁ గొలఁదిసేపటిలోనే మన మాద్వీపమును జేరుకొందుము. చూడుము. పెద్దపెద్దచెట్లనడుమ నామందిర మెంతసొంపు గొనుచున్నదో! ఆవనము నిర్మించుటయందు మానుషనైపుణ్య మెట్లు పారముట్టెనో యట్లే వివిధవర్ణములగు వృక్షపోతముల నలంకరించుటయందు ప్రకృతినైపుణ్యము పరమావధి నందినది. ఈనైపుణీద్వితయము నొక్కటనే కాంచుట యెంతయానందదాయకము! ఎంతపావనము! దైవికనైపుణ్యము నిస్తులమనియు నవర్ణ్యమనియుఁ జెప్పుచు మానుషనైపుణ్యము దాని కీడురాదనువార లీప్రదేశముం గాంచవలయును. ఇక్కడకు వచ్చినచో నవి యొండొంటిపై నెట్టు లాధారపడియుండునో, రెంటిసమాగమము నెంతమనోజ్ఞముగ నుండునో వారికిఁ దెలియును. ఈద్వీపపుశోభవలన దైవికప్రావీణ్యమును దనయెదుట నాదర్శముగ నుంచుకొని మనుజుఁడు తనకౌశలముంగూడ నంతయుజ్జ్వలమొనర్పఁ బ్రయత్నింపవలయునని మన కొక యుపదేశము లభించుచున్నట్లున్నది.

విజ:—శ్రీరామచంద్రుఁడు సజ్జనపరిత్రాణముకొఱకు లంకావాసులగు దుష్టదైత్యుల నెల్లరఁ బరిమార్చెను. ఈదైవికాదర్శము నెదుట నుంచుకొని, మహీంబా రాజతనయుఁడగు ఛత్రసాలుఁడు మానుషనైపుణ్యమున ఢిల్లీవాసులగు దనుజులనెల్లఁ జయింప నుద్యుక్తుఁడైనాఁడు. ఆతఁ డీద్వీపోపదేశమును బాగుగ గ్రహించెనని తోఁచుచున్నది. కావుననే యతఁడు దేవమానవుల కిరువురకుఁ బ్రేమాస్పదుఁడైనాఁడు.

ఈవిజయ యనుమానము సరియేనా! విమలదేవుని రాద్ధాంతము సత్యమేనా! విజయ చెప్పినట్లు ఛత్రసాలుఁడు దేవమానవప్రియుఁ డయ్యెనా!



మనమిపుడు దేవమానవులకుఁ బ్రేమపాత్రుల మగుచుంటిమని ఛత్రసాలకుమారుఁ డనుకొనుచుండెను. విజయావిమలదేవుల నయనములయెదుట నెట్లు దైవికమానవికసౌందర్యములు శోభిల్లుచుండెనో, యటే ఛత్రసాలుఁడును ద్వివిధసౌందర్యముంగాంచుచుండెను. ఆపంకజాకరమధ్యంగతద్వీపలాలిత్య మాతనిలోచనంబుల నెల్లప్పుడు దాండవించుచుండెను. కాని, దివారాత్రములు తత్సౌందర్యముం జూచుచుండుటచే దానివిషయమున విశేషాభిప్రాయ మేమియుఁ బొందఁజాలకుండెను. ఆస్థలమున దైవికమానవికములగు ద్వివిధసౌందర్యములు నేకత్రితములై యున్నవనికూడ నాతని కెన్నఁడును స్ఫురింపలేదు. కాని, యాతఁ డాద్వివిధసౌందర్యములయానందముం బొందుచుండెననుటకుమాత్రము సందియములేదు.

ఇపు డాద్వీపము చాలనికటమునకు వచ్చెను. అది యంతికమునకు వచ్చుకొలంది విజయావిమలదేవులమనములు తదాకృష్టములు కాఁబొడంగెను. ఆసమయమున వారికి సృష్టిసౌందర్యముతప్ప వేఱేమియుఁ గన్పట్టుటలేదు. నాతల్లియిచ్చకు విరుద్ధముగ స్త్రీవేషమున సంచరించుచుంటిననుచింత విమలదేవునకు సుంతయు లేకుండెను. వసంతలక్ష్మితో మంతనములాడు సృష్టిసుందరి, సంధ్యాకంఠమున బాహువు లర్పించి విహరించుసూర్యప్రభ, దైవికసౌందర్యముతోఁ జేయికలుపు మానవికసౌందర్యము, సుదూరవిస్తృతపావనజలాఢ్యంబగు జయసాగరసరోవరము, దానియాదర్శగాంభీర్యము, దానిపై మృదులముగ హాసించెడి జలములు, దనయెదుటఁ బ్రసన్నవదనవిలసనముతో నాసీనయై యున్న విజయ—ఇవియే విమలదేవునకు సమస్తవిశ్వముగఁ గన్పట్టు

చుండెను. ఇదికాక యాతని కిఁకేమియుఁ గన్పడుటలేదు. ప్రపంచ మందలి తక్కిన సమస్త విషయముల నాతఁడు మఱచిపోయెను. దైవిక మానవికసౌందర్యదర్శనామోదమునకై మన మెట్లేఁగుచుంటిమో, యెట్లే మన వెనుక వెనుక నెవ్వరైన వచ్చుచుండిరేమో యనుకల్పన కూడ నాసమయమున నతనికి లేకుండెను.

నల్లడల వివిధంబులగు నగణ్యజలరుహములు జయసాగరసరోవరాభిఖ్యను వృద్ధిఁ బొందించుచుండెను. కొన్ని సంపూర్ణముగ వికసించియుండెను. కొన్ని యీషద్బద్ధములై తమగాంభీర్యముం బ్రకటింపఁగోరుచుండెను. కొన్ని యిప్పుడే నవ్వ మొదలిడుచుండెను. కొన్ని వికసించుటయే యెఱుఁగని ముగ్ధావస్థయం దుండెను. ఇట్లే యగణిత సరోరుహములు విజయావిమలదేవులకు స్వాగతమొసఁగుటకై జయసాగరసరోవరోపరితలంబున నిలిచియుండెను. విమలదేవుఁడు ప్రసన్న హృదయముతో వానిని గాంచుచుండెను. తుదకొకపద్మమును గ్రహించుటకై యతఁడు తనస్థానమునుండి లేచెను. ఆయభిప్రాయముం దెలిసి విజయ యిట్లనెను. "విమలదేవా! నీవు కమలమును దీసికొందువా? అది నీకిక్కడనుండి యందదు. కొంచె మాఁగుము. నేను నావ నాకమలమునసమీపమున కంటఁ దీసికొనిపోయెదను."

విమ—విజయా! ఆపద్మమును జూడుము. దానిదైవికసౌందర్యము నీమానవికసౌందర్యము నెంతగ సరిపోలుచున్నది. దానిదరవికాసము నీదరహాసమున కెంతయో యీడగుచున్నది. మనపురాతనకవివర్యులు స్త్రీముఖమునకుఁ గమలము నుపమానముగ నిచ్చుట యెంత సరిగ నున్నది!

విజ—ముఖమే యనుమాట యేమి? వారియుద్దేశమున వనితలహస్తములు, పాదములు, నయనములు, బహుశః తుదకన్నియవయవములును గమలతుల్యములే. రమణి యనేకకమలముల రాశియని వారిసశ్చితాభిప్రాయము కాఁబోలు. (కొంచెము కౌతుకముతో) విమలదేవా! సరేకాని, నీవాకమలముం దీసికొని యేమిచేసెదవు? చెప్పుము.



విమ—నీమానవికసౌందర్యముతో దానిదైవికసౌందర్యముం బోల్చెదను.

ఇట్లుపలికి విమలదేవుఁ డాకమలముం దీసికొనుటకై నావయంచుపైకి వచ్చి క్రిందికి వంగెను. విజయయుఁ దననైసర్గికచంచలత్వము వలనఁ దనచేతియందలితెడ్డును బైకెత్తి విమలదేవునకుఁ దోడుపడుటకై యతనిచెంతకు వచ్చెను. నేనిట్లు చేసినచో మాయిరువుర కేమియాపద సంభవించునో యని యామె కింతయుఁ దోఁపలేదు. బరువెల్ల నౌక ప్రక్కకే యుండుటచే నావ మునిఁగిపోవఁ దత్క్షణమే వారిరువురును జయసాగరమునఁ గ్రుంకులుకొనసాగుదురను భావన యింతలో నౌకానౌకరిమనసున నుప్పతిల్లెను. ఈయాపదనుండి వారిని గాపాడుటకై యాతఁడు తననావను త్వరగత్వరగ నడుపసాగెను. విమలదేవునిచేతికాపద్మ మందకుండుటచే విజయకూడ నావయంచుపై విమలదేవుని ప్రక్కకుఁ బోయి వంగుచు నాపద్మమువైపునకుఁ జేయిసాచుచుండెను. ఇంతలో నావ తిరుగఁబడినది. జయసాగరసరోవరమందలియగణితసరోజములలోఁ బడి వారిరువురును గ్రుంకులిడసాగిరి.

తనకోమలబాహువులచే జలగర్భమును భేదించుచు విజయ యిట్లనెను—"విమలదేవా! నీవీఁదఁజాలవా? ఇట్లు వ్యర్థముగ వ్యగ్రుఁడవై కాలుసేతులఁ గొట్టుకొనకుము. కొంచెము సేపటివఱకును గాలుసేతుల బాదుట మానుము. నేనిదే నీకూఁత నిచ్చెదను." అని పలికి యాచపలయగుబాల చపలవలె విమలదేవునొద్దకుఁ జేరెను. ఆసమయమున విమలదేవునినోట నీరు నిండిపోయెను. అతఁడు మునిఁగి

పోవసాగెను. ఒకచేతితో నాతనిహస్తముం బట్టుకొని రెండవచేతితో నీటిని ద్రోసికొనుచు విజయ యిట్లు పలికెను. "తత్తఱపడకుము. కన్నులువిచ్చి చూడుము. నీసోదరి విజయ నీచెంతనే యున్నది."

విమలదేవుఁడు కన్నుదెఱచెను. చుట్టునున్నరుంద్రసలిలరాశి వైపున నొకసారి యతఁడు కాతరదృష్టితోఁ జూచి తనసుకుమారహస్తములచేఁ దనకవలంబనమొసంగెడి విజయవంకఁ జూచెను. ఆతనికన్నుల నుండి యశ్రుధారలు ప్రవహింపసాగినవి. అతఁడు మిక్కిలి కరుణాస్వరముతో నిట్లనెను—"విజయా! నన్ను వదలివేయుము. నన్ను మునిఁగిపోనిమ్ము. నాకీఁదుట బొత్తుగా రాదు. నీవు నన్నుఁ గాపాడఁజాలవు. నన్ను విడువుము."

విజ—అట్లెన్నటికిని గాఁజాలదు. ఇరువురము నిచటనే మున్గి మరణింపనైనవలయును. లేదా మనభాగ్యమున నేమివ్రాసి—" అంతకన్నఁ బలుకఁజాలకపోయెను. ఆమె యూరకుండెను.

విమ—నీవలసిపోయితివి. నన్ను వదలివేయుము. ఇరువురము జచ్చుటకంటె నొకరు మిగులుట మంచిది. నన్ను రక్షించుటకై నీవు నీప్రాణముల కాపదఁ గల్గించుకొనుటచే నేను నీకు ఋణపడితిని. నన్ను విడిచివేయుము. నేనీఋణము నింకొకజన్మమునఁ దీర్చుకొందును.

విజ—(మిగులఁ గష్టముతో) అట్లుకాదు. ఇరువురము నొక్కసారి మరణింతము.

విజయ యీసరికే చాలనలసిపోయియుండెను. ఇఁక విమలదేవుని రక్షింప నాతని కవలంబనమొసఁగుట యామెశక్తికి మీఱిపోయెను. ఐనను దేహమునఁ బ్రాణములున్నంతదనుక నాతని రక్షింపయత్నింపవలయునని యామె నిశ్చయించుకొనెను.



విజయ కూపిరి యందుటలేదు. ఇఁక నామెకూడఁ జావసిద్ధముగనుండుటఁ జూచి విమలదేవుఁడు మిక్కిలికష్టముతో నిట్లుపలికెను—"విజయా! చాలు! అలసిపోయితివి. ఇంక నన్ను విడిచిపెట్టుము."

అతఁడు తనచేతిని వదలించుకొని యిట్లనెను—"నీప్రేమార్ద్రమగు హస్తమును విడిపించుకొనుటకు నన్ను మన్నింపుము. నీభాగ్యమున ఛత్రిసాలునికంఠముననే మాలవేయుట కలదు. సరే. నన్నుఁగూడ నప్పుడప్పుడు స్మరించుచుండుము. ఆమాలను గూర్చుటయందు—నాకుఁగూడ—కొంతపాలున్నదనియు—నేనాతని—హితైషిననియు—మిత్రుఁడ ననియు—ఛత్రసాలునితో వచింపుము—విజయా—పొమ్మిఁక—రెండవజన్మమున—"

విమలదేవునినోట నీరు నిండిపోయి యాతఁడు మునుఁగఁదొడంగెను. ఆతనివంకఁ జూచుచు నసమర్థయగువిజయ యిట్లుపలికెను—"హా! ఇచట యువరాజు ఛత్రసాలుఁ డుండినచో—"

—



*

ఆఱవప్రకరణము.



లంపటమగుఢిల్లీ.

ఢిల్లీ ! ఐశ్వర్యమదాంధురాలా ! దురాచారవ్యసనమాంద్యముల మునిఁగి యున్నదానా ! నీవంటి విషయలోలయుఁ గులటయు దురాచారిణియు నగువనితహస్తమునఁ బవిత్రమగు భారతవర్షపుటధికారసూత్రములు చిక్కియుండుట, నీవంటి దుర్వృత్తనియాజ్ఞ బుందేలఖండక్షాత్రతేజమునకు శిరోధార్యమైయుంట, భారతవర్షపు దౌర్భాగ్యమే. రాజ్యతృష్ణవలని స్వార్థపరములగు నాసలవలన, నేఁటిదనుక నీవెన్ని దురాచరణములు సలిపియుంటివోకదా ! దుర్యోధనునిబుద్ధి భ్రష్టముగావించి, కొంచెమునేలచే సంతుష్టులగు పాండవులకు సూదిమొనపాటిభూమియు లభింపదను నుత్తరము నీవే యాతనిచేఁ బలికించితివి. మహాభారతయుద్ధపు భయంకరరక్తపాతము నీవే చేయించితివి. కనోజ్‌పతియగు జయచంద్రరాఠోరు సాయమున షహాబుద్దీన్‌గోరీచే నీవే వీరవరుఁడగు నీపతి పృథ్వీరాజచౌహాణుని హత్యసేయించితివి. నీలలాటమును సంశోభితముగావించు స్వతంత్రతాతిలకమును నీవే స్వహస్తమునఁ దుడిచికొని, యవనవనితవైతివి. యవనివై యవనాంతఃపురమునఁ బ్రవేశించినతరువాతఁగూడ నీచర్య నానాఁటికి నీచతరమును బాపిష్ఠతరము నై పోయినది. నరహత్య, రక్తపాతము, దోపిడి మున్నగునవి నీమనోరంజనసామగ్రులైనవి. నీవు జనులపైఁ బఱపిన మహిమవలనఁ బ్రభుఁడు సేవకానుకంపను, బంధుఁడు బంధుస్నేహమును, జనకుఁడు పుత్త్రవాత్సల్యమును, బుత్త్రుఁడు పితృభక్తిని, హత్యసేసి నిన్నుఁ బొందఁగోరెరి. నీవు సేవకుల మనములందలి విశ్వాస



మును నశింపఁజేసి వారిచే నిజప్రభునిపై నాయుధప్రయోగముం జేయించితివి. సోదరులయన్యోన్యప్రేమమును మఱపించి నీవొకరిచే నొకరినిఁ జంపించితివి. నీవెల్లరినిఁ దప్పుదారిం బెట్టి, బంధుమండలిలోఁ బరస్పరవైరముం బుట్టించితివి. ఇంతేకాదు. నీపైఁ దనయమేయానురాగమును వ్యక్తపఱుప నిన్నుఁ జక్కఁగ నలంకరించిన షాజహాన్ ముదుసలియగుటతోడనే, నీకాతనిపైఁ బ్రేమము సడల, నాతని తరుణకుమారునిపై దృష్టినిల్పితివి. నీప్రవృత్తి యెల్లప్పుడు నధర్మాభిముఖమై యుండుటచేఁ, గపటియు, స్వార్థపరుఁడును, వంచకుఁడును, దుర్మతియు నగునౌరంగజేబుకై నీవు దేవులాడఁదొడఁగితివి. నీవు నీవృద్ధపతి షాజహానును జెఱఁబెట్టించి, నీబావల నందఱను హత్యసేయించి, కుబుసము విడిచిన త్రాఁచువలె మరల నందఱిపై బుసకొట్టుచు వైభవామోదము నందసాగితివి. ఏమి నీచాంచల్యము ! ఏమి నీయధికారలాలసత ! ఏమి నీవిషయపిపాస !

షాజహాఁ పాదుషాను విడిచి యాలంగీరుపాదుషాగళమున నీవు బాహువులిడి,యింకను జాలకాలముకాలేదు. అధికారలాలసత్వవీటి నింకను నీవు నమలుటయైన మొదలిడలేదు. నీనూతననాథుని స్వరూపమైన నీవింకను బాగుగఁ దిలకించియుండలేదు. ఇంతటి స్వల్పసమయముననే—పదివత్సరములలోనే—నీకు నీక్రొత్తమగఁడు కటువయ్యెనా ! నీతిమాలిన నీచాంచల్యమున కతనితో నిఁకనుండుట కిష్టములేక పోయెనా !

ఔరంగజేబు రోగముచే మరణోన్ముఖుఁడై యుండుటచేతనే నీవాతనియెడఁ బరాఙ్ముఖివి కాఁజొచ్చితివా !

రోషనారాబేగము ఔరంగజేబునకుఁ బ్రియసహోదరి. షాజహానునకుఁగూడ నామెపైఁ గడుప్రేమ. కాని ఢిల్లీ యెవరికిలభింపఁద

గును ? ఢిల్లీజయమాల యెవరికంఠమునఁ బడఁదగు ననుప్రశ్నము వచ్చినప్పుడు, “ దారా, షుజా, మురాదుల ” యధికారముపైఁ గ్రోధదృష్టిఁ బఱపి, తనప్రియసోదరుఁడగు నౌరంగజీబునకు, ఢిల్లీహస్తము నందించిన రోషనారయే, నేఁడు దిల్లీనిఁ గొనుటకు నౌరంగజీబుప్రాణములనే కొనుట కేలసిద్ధపడియెను ! ఢిల్లీ ! ఇదియంతయు నీపాపభూయిష్ఠమగు చాంచల్యముయొక్క క్రీడ ! నీపతి యస్వస్థుఁడై స్మృతిలేక పడియుండుటవలన లాభముఁగొని నీపైనుండి యాతని యధికారమును దొలఁగించుకొనుటకును, స్వైరవ్యాపారమున మునుఁగుటకును నౌరంగజీబనుకంటకమును నిర్మూలముచేయు నిచ్ఛ నీవే యారోషనారాబేగము మనమునఁ బుట్టించుచున్నావు. నీభర్త యధికారమును గొలఁదికాలమునకే సహింపలేకపోయితివా ! నీవుగూడ రోషనారాబేగమువలె స్వచ్ఛందవు నిరంకుశవు నగుట కిచ్ఛగించుచుంటివా ! నీవు రోషనారాచిత్తముపై నేల యధికారము నిల్పితివి !

పురుషదర్పముతోఁ గూరుచుండిన రోషనారాబేగము, తనయెదుట నిలిచియున్న భిషగ్వరునితో నిట్లు బెదరించి పలికెను. “ భిషజ్మహాశయా ! ఈమీయాట యెంతవఱకు సాగును ! మీకడ నిన్నిమందు లున్నను నొకటిరెండుగంటలలో నీతని నంతమొందించుమందొక్కటియు లేదనుచున్నారు. ఇదియంతయు మీధౌర్త్యము. మీరాస్థానవైద్యులు. ఏసమయమున నెట్టిక్రూరవిషము కావలసివచ్చునో మీరు గ్రహింపఁజాలుదురు. ఢిల్లీగద్దెకొఱ కిప్పటివఱకు జరుగుచు వచ్చినదంతయు మీ రెఱుంగుదురు. సమయమువచ్చినపుడు పనికివత్తురనియే మీబోంట్లు దర్బారునం దుంచఁబడుట. మీరు రెండువారములనుండి మందిచ్చుచున్నారు. కాని, దేనికిని గొంచెమైన వట్టులేకున్న దేమియాశ్చర్యము !



వైద్యుఁడు మిగుల దైన్యముతో నిట్లనెను:—లోకరక్షిణీ ! రాజాధిరాజు ఆలంగీరుపాదుషావారు—

రోష—(కోపముతో) మాటాడకుము. ఆలంగీరుపేరుతో రాజాధిరాజు, పాదుషా, యను బిరుదములం గూర్పకుము. అట్లయిన నిప్పుడే నీనాలుక నూడఁదీయింతును. నేను నీమాటలను గడతేఱ వినఁగోరుచున్నాను. ముందుగనే నన్ను నీశిరము నఱుక నాజ్ఞాపించునట్లు చేయకుము.

వైద్యు—లోకరక్షిణీ ! నామాట ముగియుటతోడనే నాశిరము నఱుక నానతియొసఁగఁబడునా ?

రోష—సందియమేమి ? నేఁడు నిన్ను బ్రదుకనీయను.

వైద్యు—ఏమి ! నేఁడు నేను బ్రతికి బయటఁ బడఁజాలనా ?

రోష—ఎన్నటికిని !

వైద్యు—కారణము నేనెఱుంగవచ్చునా ?

రోష—నాయాజ్ఞను బాలింపక నాకనిష్టముగ నాచరించితివి. నేఁడు నీజీవితమున కంత్యదినము.

వైద్యు—నేను ఆలంగీరుసార్వభౌములకు ఘాతుకమగు విషమీయవలయుననియే కదా దేవివారియాజ్ఞ.

రోషనార పెదవిఁ గొఱుకుచు హుంకార మొనర్చెను.

వైద్యు—నేనిట్టి యనుచితమగు నాజ్ఞ బాలించుట కేల నిర్బంధింపఁబడుచుంటిని ?

రోష—ఈసమయమున ఢిల్లీసింహాసనకిరీటములు నాయధీనమున నున్నవి. నాసేవకులకు నాయానతి పాలించుట కర్తవ్యము.

వైద్యు—బేగంసాహెబా ! క్షమింపుఁడు. ఏయాజ్ఞ పరమేశ్వరునియాజ్ఞకు విరుద్ధమో, దేనినిర్వహణము పరమేశ్వరుని కప్రియమన్నతఁ

గూర్చునో, యాయాజ్ఞ చక్రవర్తి యాలంగీరుపాదుషావా రొసంగినదై ననుసరే, కిరీటసింహాసనముల కధినాయికయగు బేగంవా రొసంగినదైననుసరే—యెన్నఁడును దానిని నిర్వహింపరాదనియే నాయభిప్రాయము.

రోష.—చాలు. ఇఁకనోరుమూసికొనుము. ఇప్పుడే నీదర్వార్థకృత్యములకుఁ బ్రాయశ్చిత్తము గావింతును.

ఆసమయమున రోషనార కన్నులనుండి నిప్పులొలుకుచుండెను. ఆమె యాతతాయి (ఖోజా) రహమత్ ఖానును బిగ్గరగఁ బిలిచెను.

రోషనారాకుఁ దనమాటయందుఁ జాలనిలుకడయని, పలికినది చేసితీరునని, భిషగ్వరునకు బాగుగఁ దెలియును. ఇఁక నాతఁడు తన కాలము సమీపించెనని యూహించుకొనెను. కాని, యాతనిమొగమున నించుకయు దుఃఖచ్ఛాయ కన్పట్టుటలేదు. నిశ్చింతముగ శాంతముగ నాతఁ డెదుటికిఁ జూచుచుండెను. అతనివ్యాకులత యంతయుఁ దొలఁగిపోయెను.

ఇంతలో నొకతెర యెత్తించుకొని క్రూరస్వరూపుఁడగు రహమత్ఖాను వచ్చుచుండుట కానవచ్చెను. ఆతనిం జూచి రోషనారయిట్లు పలికెను. "ఈవృద్ధుని నీవెంటఁ గొనిపోయి యరబ్బీకుక్కలముందు విడువుము."

రహమతుఖాను వైద్యునిచేయిఁ బట్టుకొనెను. అయిన నాతని శాంతి కేమియు భంగము కలుగలేదు. అతఁడు గభీరముగ నిట్టులనెను.

"బేగంసాహబా! శిక్షవిని నేను గడగడ వడఁకుదుననియో, మూర్ఛపోవుదుననియో, లేక సుంత దయాభిక్షమునైన నడుగుదుననియో, మీరు తలఁచుచుంటిరి కాఁబోలు! కాని, యది పొరపాటు.



నేఁడు కాకున్న మఱిపదినాళ్లకైనఁ బరమేశ్వరునిసన్నిధి కేఁగవలసినవాఁడనే కదా! ఆసమయము నాకు నేఁడే లభించినచో వ్యర్థముగ వెనుదీయనేల! స్వార్థపరురాలు, స్వపూజాపరురాలు నగునొకబేగము నెదుట దైన్యముం బ్రకటింపనేల! నేనెల్లప్పుడును మరణమునకు సంసిద్ధుఁడనై యుందును. ఏలయన, నాకు స్వర్గము లభించునను నమ్మిక యున్నది. నేను నేఁటివఱకు నెన్నఁడు నెవ్వరికి నెట్టికష్టము గలిగించి యుండలేదు. ఎవ్వరిని వంచింపలేదు. ఎవ్వరియెడను గఠినవర్తనముం గావింపలేదు. నిత్యమును సత్యసారళ్యములందే నాకాలముఁ గడపితిని. ఇట్టిస్థితియం దీశ్వరుని యెదుటి కేఁగుటకు నాకు భయమెందులకు? రహమత్ ఖాన్! నడువుము. నేను నీతో వచ్చుటకు సిద్ధముగ నున్నాఁడను.

రోషనార రహమతుఖానునకు నిలువసైగ చేసి వైద్యునితో నిట్లుపలికెను.—"నీవు నీజీవితమును సత్యసారళ్యములందుఁ గడపిన మాట యసత్యము. నీవు విషమిడి పాదుషాప్రాణములం దీయకున్నను మందులొసఁగి యాతని నిప్పటివఱకు స్మృతిహీనునిగ నుంచితివి. నీవు పాదుషాయెడ విశ్వాసఘాతుకక్రియఁ జేయలేదా! అతనికిఁ బెద్దకష్టమును గూర్పలేదా? నీయీపని పాపావహము కాదా! నిన్ను నరకమునకుఁ బంపుట కిది చాలదా!

రోషనారప్రశ్నయందలి వాస్తవికాభిప్రాయ మాతనికిఁ దెలియలేదు. మిగుల సరళముగ నతఁడిట్లుత్తర మొసంగెను.

"పాదుషావారికి విషమీయవలయునని దేవివారు నాకు మాటిమాటికి నానతియిచ్చుచు వివిధములగు నాసలఁ గొల్పుచుంటిరి. కాని, నేనాయాజ్ఞను బాలించుట యనుచితమని యెంచి వారిరోగముపోవుటకే మందులిచ్చితిని. ఇప్పుడు వారు చాలవఱకు నారోగ్యవంతులైరి. మి

మ్మోసపుచ్చుటకే వారికి స్మృతిహీనత కౌషధ మిచ్చుచు వచ్చితిని. ఆస్మృతిహీనత నిప్పుడే నేను తొలంగించినచోఁ బాదుషావారు మరల స్వస్థతఁ బడయుదురు.

రోష—(మిగులఁ గుపితయై) ఓరీవంచకుఁడా! ఓరీవిశ్వాసఘాతుకుఁడా! ఈయీయుక్తి నేను మొదటనే కనిపట్టితిని. కావుననే నేఁడంతముఁ గూర్ప నెంచితిని. రహమత్! వీనిని వెంటఁగొనిపోయి రోషనారాబేగమును మోసగించినందులకు శాస్తి యొనరింపుము.

యమదూతయగు రహమతు వెంటనే భిషజునిఁ గొనిపోయెను. రోషనార ముఖముపయి నొదవిన చింతాప్రసార మింకను దగ్గలేదు. ఇన్నిదినములనుండి ప్రయత్నించుచుండిన కార్యము నెఱవేఱలేదని యామెకుఁ గడు లజ్జవొడమెను. పాదుషా స్వస్థత చెడినతోడనే యందఱిరాణులనుండియు రాకొమరితెలనుండియుఁ దాను వేఱయి తనవందలకొలఁది విశ్వాసనీయలగు తార్తారుసేవకురాండ్రు కావలియుండఁ బాదుషాసేవాభారము వహించి యావిషయమునఁ దానొనర్చిన రహస్యకార్యకలాప మంతయు నామెకు జ్ఞప్తికి వచ్చెను. తనకార్యపాటవము, బుద్ధిశాలితయుఁ దన్ను వీడిపోయెనో యని యామెకు సందియమొదవెను. ఔరంగజేబు స్వస్థుఁడై మయూరసింహాసనముపైఁ గూరుచుండి యైశ్వర్యము ననుభవించుచు నాజ్ఞాపరంపరల నొసంగఁ దొడఁగును. రోషనార సంకేతమాత్రముననే ప్రాణము లర్పించునమీరులు, రోషనారప్రసన్నతకై తచ్చరణసేవనల్పు సరదారులు, రోషనార యాజ్ఞం బాలించుటచేతనే తమ్ముఁ దాము ధన్యులుగఁ దలంచుకొను రాజవతంసులు, నందఱు నిపుడు మరల నౌరంగజేబుధ్యానమునఁ బడుదురు. ఇపుడు మరల బేగములు, రాజపుత్త్రికలు, తన్ను నిరసింతురు. సుల్తానా (అధినాయిక) యగుటకును, నైశ్వర్యవిభూషితనై శాసనము



సేయుటకును, వందలకొలఁది యమీరులు మున్నుగు వారియెదుట నెమలిపీఠముపైఁ గూరుచుండుటకును, నాకుఁ గలయాసయంతయు స్వప్నతుల్యమయిపోవునా? గొప్పగొప్పయమీరులచేతను రాజులచేతను సరదారులచేతను సేవ చేయించుకొనవలెనను నాకోర్కి మనసుననే మఱఁగుచుండ మరలనేనుబందీకృతయట్లు అంతఃపురమునఁ బడియుండెదనా! అతిక్షుద్రమానవుఁడు గూడ స్వతంత్రముగ వసించును; స్వచ్ఛందముగఁ దిరుగును; స్వేచ్ఛాయుక్తముగ భోగించును. తుద కడవులయందుఁ దిరుగుపశువులు, నాకసమున నెగురుపక్షులుఁగూడ నొకరియధీనమున నుండవు. కాని, సార్వభౌమునిపుత్త్రికకు లభించునవి, యీశుద్ధాంతము స్నానాగారము, గవాక్షము; ఇందే బందీకృతవలె నుండి స్వాతంత్త్ర్యమును, జీవనమును, మానసోత్సాహమును నశింపఁజేసికొనవలయును. ఆహా! దౌర్భాగ్యము. ఔరంగజేబు జబ్బుపడుటఁజూచి నాచెఱదినములు కడచిపోయెనని యెంచితిని. ఔరంగజే బెనిమిదిపదివత్సరములు గద్దెపైఁగూరుచుండి శాసించెను. పాప మాధర్మాంధుఁడగు విరాగికి రాజవిలాసము, రాజసౌభాగ్యము నేమియెఱుక? అతఁడు నెమ్మిగద్దె నెక్కినదిమొదలు, నేఁటివఱకు నొక్కనాఁడైన దర్బారున వేశ్యాలాస్యము కాలేదు. సామ్రాజ్యసభయం దొక్కసారియైన మధురగానము వినఁబడలేదు. ఒక్కసురాబిందువైన నెవ్వరికిని గంఠము దిగలేదు. దివారాత్రములు, విలాసవైభవములఁ జెలంగు క్రీడాలోలుపమగు ఢిల్లీ యింతయరసికుఁడు, మనోవృద్ధుఁడు నగు విరాగి నేల పాలింపఁజొచ్చెను? మాతాత జహాంగీరు తనవిలాసేచ్ఛం దీర్చుకొనుటకై షేర్ ఆఫ్ గానును వధించి యాతనిభార్యయగు నూర్జహానును వశపఱచికొనెను. అట్టితేజ మౌరంగజేబునందుఁ గలదా? అమీరు లప్రసన్నులై యున్నారు. సరదారులు, రాజులు, లోలోన నేవగించుకొను

చున్నారు. ఢిల్లీలోని విలాసప్రియులు మనసువిఱిగియున్నారు. ఈయన్నిటికి నీతఁడే కారణము. నర్తనవిలాసములు, మద్యమాంసములు, భోగామోదములు పేరునకైన లేనిశ్మశానతుల్యమగు దర్బారునుండి జనులు వికలవదనులై యిండ్లకేఁగక మఱేమిచేయుదురు? మద్యపానము లేక దర్బారులలో మనసు నిలుచునెట్లు? మధుపానసమ్మోదములోనను, వేశ్యాసౌందర్యసందర్శనములోనను, సంవత్సరములు గడచినవారికిపుడు ప్రసన్నత రమ్మనిన నెచటినుండివచ్చును? ఛీ! ఇదియేమియు బాగుగ లేదు. గతించిన ఢిల్లీదర్బారుశోభ మరల రావలయును. విలక్షణము! ఎందఱువెలయాండ్రు పెండ్లిండ్లు చేసికొనవలసివచ్చెను! కటువగు మద్యపాననిషేధముం దొలఁగింపవలయును. అది లేనిచో దర్బారునకు శోభ యేమున్నది! కాని, యట్లగుటకు ముందుగ నీయరసికుఁడును, శుష్కహృదయుఁడు నగునౌరంగజీబు మడియవలయును! నేనీయమూల్యతరుణముం గోల్పోయినయెడల నాజన్మాంతము నీయవరోధమున వాసముచేయవలసివచ్చును. కాని, యూరక యిట్లు భావన సల్పిన నేమిప్రయోజనము! ఇప్పటివఱకు నౌరంగజీబు స్మృతిలేక పడియున్నాఁడు. ఆతఁడు స్మృతిగాంచకుండ నేనాతని జీవనదీపిక నార్పవలయును. నాకడ విపులమగు ధనమున్నంతదనుక నొక్కయౌరంగజీబన నెంత! వందలకొలఁది యౌరంగజీబుల ప్రాణములఁ దీయవచ్చును. ఒకమూర్ఖుఁడగు వైద్యునివలనఁ గార్యము నెఱవేఱకున్నఁ జింత లేదు. నాదర్బారునందే వలసినందఱువైద్యులు కలరు. ఈతఁడు విశ్వాసపాత్రుఁడని యెంచి తప్పుచేసితిని. ఐనను నారహస్య మెవ్వరికిని బ్రకటితముకాదు. నాకార్యము తీరినపిమ్మట రెండవవైద్యునిఁగూడ జీవములతో విడరాదు.'' అని రోషనార తలంచెను.

ఈతుదివిచారమువలన సుందరమయ్యుఁ గఠోరమగు రోషనార



ముఖమున రాక్షసమందహాసము ప్రభవించెను. ఆచింతాస్థితి వదలి యామెమనము ప్రసన్న మయ్యెను. వెంటనే యామె "బిజలీ యిటురమ్ము" అని పిలిచెను.

బిజలీ యాకసమందలి సౌదామనివలె మెఱయుచు నామెయెదుటికి వచ్చి నిలిచెను. ఆమె వందనము లాచరించినవెనుక, రోషనార యామె కిట్లనెను.

"నేటివఱకు మనము సల్పినయత్నము లన్నియు భగ్నములయినవి."

బిజలీ—ఏమి! పాదుషాకు జీవనాంతము జరుగదా!

రోష—ఇపు డాతఁ డున్నయవస్థయందే యింకను గొంతకాలమువఱకు జీవించియుండఁగలఁడు.

బిజలీ—కొంచెము సేపటిక్రిందట నేను చూడవచ్చుసరికి వారు శవమువలెఁ బడియుండిరి. అపుడు నేను వారీశ్వరసాన్నిధ్యమున కేఁగిరని యెంచితిని.

రోష—అట్లుకాలేదు. మనకుఁ గడు మోసము వాటిల్లినది. పాదుషాదేహస్థితి నానాఁటికి స్వస్థపడుచున్నది. ఒక్కవిస్మృతిమాత్ర మట్లున్నది.

పిదప రోషనార వైద్యునికథయంతయుఁ దెలియఁజెప్పెను. అదివిని బిజలీ రోషనారచాతుర్యమును మెచ్చుకొని, పిదప నిట్లనెను—బేగంసాహబా! తుదకు మీరేదియో యుపాయ మాలోచించియే యుందురు.

రోష—ఉపాయమా! ఉపాయముల కేమికొఱఁతు! ఏరోషనార తనసామర్థ్యమున నగరునంతను వశమొనర్చుకొనెనో, యెవతె యుపాయములను విని గొప్పగొప్పవజీరులు, మహీరులు, నిశ్చేష్టులై

పోవుచుందురో, యెవతె తనయుపాయమువలన నౌరంగజీబును ఢిల్లీ గద్దె కధిపునిగాఁ జేసెనో, మరల నాగద్దెను లాగికొనుట కెవతెకు శక్తి యున్నదో, యారోషనార కుపాయముల కేమిలోటు! ఈరాజవైద్యులవలన నాకార్యముకాదు. నాకు బాగుగ సాయమొనర్చునని యెంచి నవైద్యుఁడే నాకుఁ బ్రయోజకుఁడు కానవుడింక నెవ్వరికి నారహస్యము వెలివుచ్చరాదు. నీవు నగరములోని కేఁగి యెక్కువధనాఢ్యుఁడుకాక, నాకనువుగ విషాఢ్యుఁడైన యొకవైద్యుని దీసికొనిరమ్ము. ఆతనిసాయముననే నేనీమార్గకంటకమును దొలఁగించుకొందును. అతనికి భాగ్యామిష మిడి యున్నతపదవియెడ నాసఁగల్పించి గౌరవసత్కారముల మోసగించి కార్యము నెఱవేర్చుకొనవలయును. అతఁడు మిక్కిలి నిరుపేదగ నుండరాదనిమాత్రము బాగుగ జ్ఞప్తియందుంచుకొనుము. ఏలయన పేదలకు భాగ్యమహిమ తెలియదు. వారికి సామాన్యముగ ధర్మమునెడను విశ్వాసమునెడను భక్తియుండును. భాగ్యమునే భగవంతునిగఁ దలంచువానినిఁ దీసికొనిరమ్ము. లేనిచో మొదటివలెనే వంచన జరుగవచ్చును. వ్యాకులత కలుగును.

బిజ—చిత్తము. నేను వచ్చువఱకు నీగదికి మంచికావలి యేర్పఱుపవలయును. లేనిచో నిన్నటివలె సంఘటించును.

రోష—ఏమియు భయములేదు. నేఁడు నేనింకను గొందఱు తార్తారుస్త్రీల నేర్పఱిచితిని. అందఱికిని విచ్చుకత్తు లున్నవి. అవసరమైనచో వాని నుపయోగింపుఁడని నేనాజ్ఞయిచ్చితిని. నీవుతక్క నాయనుమతిలేక యెవ్వరు నిచటికి రాఁజాలరు. ఎవరైన గ్రహచారముచాలక వచ్చినను బ్రతికిపోఁజాలరు. నిన్న అయేషా యెంతగర్వములో మాటాడెను! తాను యువరాజునకుఁ దల్లిననియుఁ, బాదుషాకుఁ బ్రేమాస్పదనగు రాణిననియు, నెంచి యామె యీగదిలోఁ



గూరుచుండి, పాదుషాకు సంరక్షణము సేయఁగోరెను! కాని, యామె యాట సాగనీయక యామె నిటనుండి వెడలనడిపితిని. ఇంక నామె యిచటికి రావీలులేన ట్లేర్పాటుఁ జేసితిని. చూడు. ఎదుట నావచ్చెడి దెవరు?

బిజ—హుజూర్! ఆమె కావలియాండ్ర నాయకురాలు ఫాతిమా!

ఇంతలో ఫాతిమా వందనములు సలిపి యెదుటనిలిచెను. బిజలీ యామెవంకఁ జూచి యేమికావలయు నని యడిగెను!

ఫాతి—సింహద్వారమున నొకహిందూరాజు వేచియున్నాఁడఁట. బేగంవారి దర్శనము చేయఁగోరుచున్నాడఁట. ఖ్వాజాఫౌలాద్ ఖాఁ వార్తనంపినాఁడు.

రోష—(బొమముడివైచి) ఈసమయమున నెవ్వరికిని దర్శనము దొరకదు. ఆయద్దము నిటు తెమ్ము.

ఫాతిమా మిగులనడఁకువతో, నద్దము నామెయెదుటఁ బెట్టెను. అందుఁ దనరూపు చూచుకొనుచు రోషనార యిట్లుపలికెను.—మొదట స్నానముచేయవలెను. తరువాత నాతని నద్దాలమేడవెనుకటిగదిలోనికిఁ గొనిరమ్ము.

ఫాతిమా నమస్కరించి మరలిపోవుచుండ నామెను మరలఁ బిలిచి రోషనార యిట్లనెను—ఆరాజుపేరేమో, యాతఁ డేదేశపురాజో నీకుఁ దెలియునా!

ఫాతి—హుజూర్! అతఁడు ధాంధేరరాజు కంచుకిరాయలు.

రోష—ఓహో! ఆముదుసలికంచుకిరాయలా! అతనిమాటలు కడుపుబ్బ నవ్వుపుట్టించును. సరే. పొమ్ము. నేను వెనుకగదిలోనికిఁ బోవుచున్నాను. అతని నటకుఁ గొనిరమ్ము." అని పలికి రోషనార

సలీలముగ వెనుకగదిలోని కేఁగి యొకయమూల్యమగు తివాచిమీఁది యొకపడకకుర్చిపైఁ జేరఁబడి కూరుచుండెను. ఇరువురుబానిసపడఁతులు వచ్చి యిరుకెలంకుల నిలువఁబడిరి. కొంతసేపటికి ఫాతిమా తనవెంట వృద్ధకంచుకిరాయలను గొనివచ్చెను. కంచుకిరాయలు కడు విలక్షణముగ రోషనారకు నేలముట్టుకొని సలాము చేసెను—అతనినిఁ జూడఁగనే రోషనారకుఁ జాల నవ్వువచ్చెను. కాని, యామె కొంచె మాపుకొనెను. ఐనను నామె నవ్వుటఁ గంచుకిరాయలు చూచినైచెను. బేగము తన్నుఁ జూచి చాల ప్రసన్నతఁ గాంచెనని యాతఁడు కడు సంతసించెను. తన్నుఁ దా ధన్యునిగ నెంచుకొనెను.

---

## ఏడవప్రకరణము

"మృదూనికుసుమాదపి"

నేఁటివఱకు నేయేమానవావతంసులు తమదుర్బలదరిద్రసహోదరులను దాస్యదుర్గంధినరకకూపమునుండి వెలువఱచి, పవిత్రస్వాతంత్ర్యప్రదేశమునకుఁ గొంపోవ యత్నించి, సఫలతఁ బడసిరో, వారలు కదనరంగమునఁ దాండవించుసమయమున, విపక్షులతోఁ జేయిచేయి కలుపుసమయమున, స్వాతంత్ర్యముకొఱకుఁ బోరాడుసమయమున, వారి హృదయములు కేవలపాషాణనిర్మితములుగఁ దోఁచును. వైరులతోఁ భాషించుసమయమున, వారిభాష యాసురభాషయై పోయినట్లుండును. నేత్రములం దాసురతేజము నిండిపోయినట్లుండును. అసురసామాన్యమగు రక్తపాత మొనర్చుచున్నట్లే వారు కన్పట్టుదురు. ఎంత



వఱకు వారు తమయుద్యోగమునఁ గృతకృత్యులుకారో, యంతవఱకు వారియందుఁ బ్రేమ భక్తి వాత్సల్యాదికోమలమనఃప్రవృత్తుల యుంకురములైన లేనట్లు తోఁచును. ఇదికాక స్వాతంత్ర్యప్రయత్నమున నుండుమానవుఁడు కృపారహితుఁడు భయానకుఁడు నగుబందిపోటువలెఁ గూడ కన్పట్టును. కాని, వాస్తవమున కట్లుకాదు. అట్లు తలఁచుట యొప్పుకాదు. వారివిషయమున నెవ్వరిమనమున నైన నిట్టికల్పనలు తోఁచినప్పుడు ఒకసారి వారియుజ్జ్వలములగు మహదుద్దేశములవైపు నకుఁగూడ మనసు బఱపవలయును. స్వార్థసిద్ధికై ప్రాణము లర్పించు నట్టియు, విషయపిపాసఁ దీర్చికొనుటకై యెన్నెన్నిమహాపాతకముల నైన నొనర్చునట్టియు, నీచుఁడగు బందిపోటుదొంగ యెక్కడ! భూతదయాక్షోణిపై బంధుస్నేహమహాభవనము నిలుపుటకు స్వరాష్ట్రీయ నష్టజీవనపునరుద్ధరణమునకుఁ దమప్రాణములపైఁ గ్రీడలాడు మహాత్ము లెక్కడ! ఈమహాత్ములకుఁగూడ నొక్కొక్కతఱి దమకర్తవ్య నిర్వహణమునకై చాలఁ గఠినాత్ములు కావలసివచ్చుచుండును. తమ సంకల్పసిద్ధికొఱకుఁ గరమునఁ గరవాల మూని, యనేకుల శమనమందిరమునకుఁ బంపుటయు, ఘోరరక్తపాత మొనరించుటయు సంభవించుచుండును. ఐనను మహత్త్వయుతములు మృదులకోమలములు నగు వారియాశయములం దేమియు మార్పు గలుగదు. పైపెచ్చు వారిగుణములు వృద్ధియే కాంచును. వారు మఱింత కోమలులుగను, మనోహరులుగను, మహాత్ములుగను, సుగుణవంతులుగను, గన్పట్టుదురు. నిర్దయులును ఘాతకులు నగుబందిపోటులకును జోరులకును దమకార్యములు సలుపునపు డెట్టికరుణయుఁ గలుగదు. వారిహృదయమున నెన్నఁడును బ్రేమ నొడమదు. వారి మానస మెప్పుడును మార్దవమును సహింపఁజాలదు. వారియంతరాత్మయం దనుకంప మాట

మాత్రమునకైన నద్భవింపవు. కాని, స్వాతంత్ర్యముకొఱకుఁ బోరువా రెడనెడ మహోదారులును, కృపాళురును బరోపకారులును నగుచుందురు. ఏసమయముల మహత్సంకల్పసిద్ధికై యత్యంతకాఠిన్యముం బూనవలసివచ్చునో యాసమయములఁ గూడ వారిహృదయములు పుష్పములకన్న నధికసుకుమారములుగ నుండును.

యువరాజు ఛత్రసాలుఁడుగూడ నిట్టిమహాత్ముఁడే. వింధ్యవాసినీదేవీమందిరరక్షణ మొనర్చినఛత్రసాలుఁడును, జయసాగరసరోవరమున జలవిహారము సలుపుఛత్రసాలుఁడును నొక్కఁడే. ఒకయెనిమిది నాళ్లక్రిందట రణములహోఖానుపైని వానిభటులపైని నిప్పురవల వర్షించిన యాతనినేత్రములు నేఁడమృతమును వర్షించుచున్నవి. రక్తపాతకాలమున నింతయుఁ జలింపని యాతనిమానసము, నేఁడు మిగులఁ గోమలమైపోయినది. అప్పుడు కఠోరముగఁ గన్పట్టు నాతనియాకృతి మిక్కిలి శాంతముగను బ్రసన్నముగను గన్పట్టుచుండెను. చాలసేపటినుండి యాతఁడు మానవిక దైవిక సౌందర్యవీక్షణమున, నిమగ్నుఁడై యుండెను. బాగుగ దర్శనామోదముం గాంచుటకై యాతఁడే తన నావను విజయావిమలదేవుల నావ కంతదూరముగను నంతదగ్గఱగను గాక యుంచెను. విజయనుమాత్ర మాతఁ డప్పుడే యానవాలుపట్టెను. కాని, యామెతోఁ గూరుచుండిన యారెండవసుందరబాలిక నాతఁడు గుఱుతింపఁజాలకపోయెను. అతఁ డామె నొకసురలోకసుందరిగ భావించుచుండెను. ఆసమయమున నెవ్వరే నతనికి హీరాదేవికొమరుఁ డగు విమలదేవుఁడే స్త్రీవేషమున నట్లు కూరుచుండెనని యెఱింగించినను నాతఁ డొక్కనాఁటికి నమ్మియుండఁడు.

ఛత్రసాలుఁడు దూరమునుండి విజయ మానవికసౌందర్యమును విమలదేవుని దైవికసౌందర్యమును జూచి యానందించుచున్నసమయ



మున నతనిమనమున "వీరికిది శ్రేయముకాదు. వీరిరువురును మునిఁగిపోవరుకద" యను నాశంక తనంతఁదాన యుదయించెను. అంత నతఁడు తననావను మఱింతత్వరితముగ నడిపింపసాగెను. ఇంతలో నావ తిరుగఁబడెను. అతనియాశంక సత్యమయ్యెను—అతఁడు చూచెను; సాధ్యమైనంతవేగముగఁ దెడ్డవేయసాగెను. కొంచెముసేపటికే "హా! ఇట యువరాజు ఛత్రసాలుఁ డుండినచో" నని వినఁబడెను. నిస్సహాయయగు విజయపలికినయీశబ్దము అయస్కాంతమువలె ఛత్రసాలు నాకర్షించెను. అతఁడు సహింపలేకపోయెను. వెంటనే నీటిలో నుఱికి, వేగముగ నీఁదికొనుచు విమలదేవునియొద్దకుఁ జేరుకొనెను. మున్కలిడువిమలదేవునిఁ బట్టుకొని తననావవైపునకుఁ దీసికొనిపోవ మొదలిడెను.

ఆసమయమున విజయ యానందమునకు మేరలేదు. ఆమెయును ద్వరితముగ నీఁదుచు ఛత్రసాలుని వెన్వెన్క నాతని నావకడకుఁ జేరెను. ఇంతలో ఛత్రసాలుఁ డాదైవికసౌందర్యమును నావపై నెక్కించెను. అదనునకు వచ్చి విమలదేవునిప్రాణములను రక్షించిన యతనియుపకారమున కెట్లుప్రత్యుపకారము సేయుదునని యపుడు విజయ మనమున యోజించుచుండెను. విజయ యింతవఱకు ఛత్రసాలుని గుఱుతించియుండలేదు. "నేను ధాంధేరరాజపుత్త్రికను. విమలదేవుఁ డోర్ఛారాజకుమారుఁడు. కావున మాకుపకారమొనర్చిన యతనికి సులభముగనే ధనముచేఁ బ్రత్యుపకృతి సేయవచ్చు" నని యామె తలంచుచుండెను. ఇదియే తలంచుచు నామె ఛత్రసాలుని నావకడకుఁ జేరెను. ఆమెను నావపైకి లాగుటకు ఛత్రసాలుఁడు తన చేతిని ముందఱికిఁ జాఁచెను. విజయ నావపై నిలిచియున్న ఛత్రసాలుని తేజోభరితమగు రూపమును జూచెను. ఇరువురిచూపులును గలసెను.

ఈయుపకారమునకుఁ బ్రత్యుపకారము ధనముచేఁ జేయఁబడఁజాలదని విజయ తెలిసికొనెను. ఆమె యొకక్షణ మాలోచించి యపుడు మిక్కిలి సంతసమునఁ దనహస్తమును యువరాజు ఛత్రసాలుని హస్తమున కందించెను.

ఛత్రిసాలా! ఇది యొకకన్యకహస్తము. ఈహస్త మెంతసుందరమును, సుకుమారమునో యంతపవిత్రమును మంగళమయమును. దీనిని గ్రహించుటయందు నీ కెంతసౌఖ్యముకలుగునో యంతకన్న నెక్కుడుబాధ్యతనీపైఁబడును. నీజన్మభూమిజయసాగరసరోవరజలమును ఇప్పుడే యుదయించుచున్నచంద్రునియందలి సూర్యునిగుప్తతేజమును, మాయిరువురికడకు సౌరభముంగొనివచ్చు వాయువును, సమస్తవిశ్వము నాచ్ఛాదించియుండునాకాశమును — ఈపంచభూతములును నీపాణిగ్రహణ సమయమున నీచుట్టును మూర్తీభవించి నిలిచియున్నవి. కావున బాగుగ విచక్షణసేసికొని విజయపాణిని గ్రహింపుము.

ఆసమయమున విజయముఖమున లజ్జచేఁ బ్రభవించినయారుణ్యమామె మనోనిశ్చయమును వ్యక్తీకరించుచుండెను.

యువరాజు ఛత్రిసాలునిముఖమున క్షణకాలము గాంభీర్యము ప్రకాశించెను. అతఁడు విజయహస్తమును గ్రహించి యామెను దన నావపై నెక్కించుకొనెను. ఆసమయమున విమలదేవుని కించుక స్మృతి కలుగుచుండెను. విజయ యాతనిసన్నిధికిఁబోయి యిట్లుపలికెను. "ఏమి! విమలదేవా?"

విమలదేవుఁడు కన్నులు తెఱచి యిట్లనెను.

"నే నెచ్చటనున్నాను? విమలదేవుఁడు జయసాగరసరోవరమున మునిఁగి చనిపోయెనే? నన్నుఁ గనికొని [illegible] చున్నారు? ఆచంద్రునికడకా! కాదు, యచట విజయలేదు. యువరాజు ఛత్రిసాలుఁడును లేఁడు. మఱి నేనచ్చట నెట్లుండఁగలను! దానిని నేను స్వర్గముగ నెట్లుభావింపఁగలను? వలదు. నాకు మీస్వర్గ మక్కఱలేదు. విజయాచ్ఛత్రసాలులయెడబాటు మీస్వర్గసుఖము లెల్లఁ దుచ్ఛములని యెంతును. నన్ను వారిరువురు నున్నచోటికే కొనిపొండు."



విమలదేవుని స్వర్గీయసౌందర్యమును ఛత్రిసాలుఁడు తదేకదృష్టితో నీక్షించుచుండెను. తుదకతఁడు విజయ నిట్లడిగెను. "విజయా! ఈస్వర్గీయసౌందర్యరాశి యెవరు? ఈమెను గాంచుటకు నాకిదియే మొదటిసారి. ఈమె నన్నెట్లెఱుంగును?"

ఛత్రిసాలునిప్రశ్నకు విజయ ప్రత్యుత్తరమొసంగ సంసిద్ధయైయుండెను. ఇంతలో విమలదేవుఁడు మరల విజయాచ్ఛత్రిసాలులను జూచి ప్రలపింప మొదలిడెను.

"విజయా! నీవుకూడ నాతో స్వర్గమున కేతెంచుచుంటివా? నీవంత తొందరపడుట కచ్చట నేమంతవిశేషమున్నదనితోఁచెను! అచ్చట యువరాజుఛత్రిసాలుఁడు లేఁడే! మఱి మనకానంద మెట్లు కలుగును? నావంక నిట్లు ప్రేమయుక్తమగుదృష్టితోఁ జూచువీరెవరు?"

ఛత్ర — నేను ఛత్రిసాలుఁడను.

విమ — ఛత్రిసాలుఁడవా? నీవు ఛత్రిసాలుఁడవా? మహోబా యువరాజగు ఛత్రసాలుఁడవేనా? అవును నిజమే. నీవుగూడమాతో స్వర్గమునకు వచ్చుచుంటివా? అట్లయినచో మాకు స్వర్గమున నానందము కలుగును. అచట తల్లి హీరాదేవియు లేదు. తండ్రి పర్వతసింహుఁడును లేఁడు. అచ్చట నేవిధమగుసంబంధబాంధవ్యములును లేవు. ద్వేషము, కోపము, మచ్చరము మున్నగువానిపేరుగూడ నచట లేదు. ప్రణయము — ప్రణయము — ప్రణయముతక్క మఱేమియు నచట లేనేలేదు. నీవుగూడ మావెంట వచ్చుచుంటివి కాదా?

ఛత్రి—కోమలీ! ఈవిశ్వమున నీదివ్యసౌందర్యమును విజయ మానవికసౌందర్యమును గాదని యవజ్ఞసేయువాఁ డుండునా? ఐనను నాబుందేలసోదరులు దాస్యజాలముచేఁ జిక్కియుండఁ, గాటకము, దారిద్ర్యము, పరసేవ మున్నగు విపచ్చయము వారి కపారదుఃఖము నొసంగుచుండ, నిట్టిసమయమున నీప్రేమసుధారసమును గ్రోలుచు సాంసారికసౌఖ్యముల ననుభవించుట గొప్పస్వార్థపరత. కావున బుందేలఖండమున కీయాపద తొలఁగిపోవుపర్యంతము నెట్టివిధమగు సుఖానుభూతియుఁ గాంచనని నేను ప్రతినదాల్చితిని. బుందేలఖండము స్వతంత్రమైపోయినపిదప నీఛత్రిసాలుఁడు నీవాఁడు. అప్పుడు నీయిష్టము. చంద్రలోకమునకుఁ గొనిపోయిననుసరే—స్వర్గలోకమునకుఁగొంపోయిననుసరే.

విజయ నవ్వుచు నిట్లడిగెను:—ఛత్రిసాలా! నీవెవరితో మాటాడుచున్నావు?

ఛత్రి—ఈసురలోకసుందరితో.

విజ—సుందరికాదు.

ఛత్రి—సుందరికాదా! మఱెవరు?

విజ—ఇతఁడు యువరాజు విమలదేవుఁడు.

ఛత్రి—(మిగుల నచ్చెరువుతో) యువరాజు విమలదేవుఁడా! ఈకాంతావేషమేమి?

విజ—దీనికై నీకాశ్చర్యము కలుగవచ్చును. నిజమే. అతఁడు స్త్రీవేషమును వేసికొని నాయెదుటికి వచ్చినతోడనే మొదట నేనుగూడఁ జాల భ్రాంతినొందితిని. ఇతనిస్త్రీవేషము చూచువారల కితఁడు పురుషుఁ డనునూహకూడఁ గలుగనంతటి సుందరముగనున్నది.



సందేహదృష్టితోఁ జూడనక్కఱలేదు. ఇతఁడు నిజముగ యువరాజు విమలదేవుఁడే.

ఇంతలో విమలదేవునకు స్మృతి హెచ్చుచుండెను. అదిచూచి విజయ మెల్లఁగ ఛత్రిసాలునితో "ఇతనికి స్మృతికలిగినపిదప నీవితని సత్యస్వరూప మెఱింగిన ట్లితనికిఁ దెలియకుండుఁగాక. లేనిచోఁ జాల సంకోచించు" నని చెప్పెను.

విమలదేవునకు స్మృతికల్గిచూచుసరికిఁ దాను మరణింపలేదనియు జయసాగరమున నొకనావపైఁ బండుకొనియుంటిననియు, విజయ తన చెంతఁ గూరుచుండి యుండెననియు, నామె చెంతనే యొకసుందరయువకుఁడు కూరుచుండి నావ నడిపించుచుండెననియు నెఱుకపడెను. యువకుఁడు కొంచెముపరిచితునివలెఁ గన్పట్టుచుండెను; చాలసారులు చూచినట్లుండెను. కొంచెముసేపటి కతఁడు మహేవారాజకుమారుఁ డగు ఛత్రిసాలుఁడనియు గుఱుతించెను; మిగులఁ బ్రముదితుఁడయ్యెను. అతనిమనసున హర్షతరంగము లుప్పతిల్లసాగెను. కాని, యావిశుద్ధామోదతరంగములు చాలసేపు నిలువలేదు. కొలఁదిసేపటికే యతనికిఁ దనవేసము జ్ఞప్తికివచ్చి కొంచెముసిగ్గును, వ్యగ్రతయుఁ బ్రభవించెను. మెల్లమెల్లగ లజ్జావ్యగ్రతలు మిక్కుటములై యానందవికసితమగు నతనిముఖము భయసంకుచిత మైపోయెను.

జయసాగరసరోవరమధ్యస్థమగు ద్వీపమునకుఁ బోవలెనను వాంఛ విజయ లోలోననే యడఁచుకొనవలసివచ్చెను. ఆమె ఛత్రిసాలునితో నావను తాము మొదట బయలుదేఱినచోటికిఁ గొనిపొమ్మని చెప్పెను. వేగముగ నావ యొడ్డువైపునకుఁ బోవసాగెను. ఆసమయమున జయసాగరమందలి చంద్రప్రతిబింబముం గాంచ నావకును జంద్రునకును బంతమువచ్చినట్లు తోఁచుచుండెను. విమలదేవున

కావిస్మృతావస్థయందలియూహాలిపుడులేవు. ఆకసమందలిచంద్రుఁడును, అచటిస్వర్గసుఖము, ఛత్రిసాలునిసఖ్యము మున్నగున వన్నియు నాతని స్మృతిపథమునుండి తప్పిపోయెను. ఈప్రపంచము, ఓర్ఛారాజమందిరము, సచ్ఛటికష్టములు, మాత్సర్యము, ఛలము మున్నగువిషయములే యాతఁడు యోజించుచుండెను. స్వర్గసౌఖ్యకల్పనముచే వికసితములయిన యాతనినేత్రములు ప్రాపంచికకష్టభావనచేఁ దేజోవిహీనములై పోవుచుండెను. "నేనెల్లప్పుడు నాకల్పనారాజ్యవిహారమునే సల్పుచుండిన బాగుండెడిది. ఈజయసాగరసరోవరము నన్నుఁ బ్రేమరహితయగు తల్లిమాయాజాలమునుండి వెలువఱిచినచోఁ జాల బాగుండెడిది. నీతిశూన్యత, న్యాయబాహ్యత, ద్వేషముమున్నగువానితోఁ బరిపూర్ణములగు సంఘటనములఁ జూచుట తప్పియుండును. ఇపుడు నేను మరల నాతల్లివశమున నుండవలయును. ఘోరములగు నామెయానతుల శిరసావహింపవలయు. ఓపరమేశ్వరా! ఈజంజాటమునుండియు, సంకటములనుండియు విముక్తి యెట్లు!" అని యతఁడుభావింపఁదొడంగెను.

విమలదేవుని యాలోచనాప్రణాళిక మెండగుచున్నకొలఁదిని జయసాగరకూలము సమీపించుచుండెను. తుదకు నావ యొడ్డును దాఁకెను. విమలదేవుఁడుమాత్ర మింకను నాలోచనానిమగ్నుఁడై యుండెను. పైనినాకసమునను గ్రింద జయసాగరజలములను నెదుట నావమీఁదను నాతనికిఁ జంద్రుఁడే చూపట్టుచుండెను. ఆచంద్రుని వదలిపెట్టవలయునుగదా యని యతనికి మిగులఁ జింత వొడమెను. ఛత్రిసాలునితోఁ గూడియుండుటకై యాసమయమున నతఁడు ప్రపంచమందలి సమస్తసౌఖ్యములను ద్రోసిపుచ్చఁగలఁడు. కాని తలఁపఁ దలఁప నాతనికన్నుల నశ్రువులు క్రమ్మెను. తెలియకుండగనే విజయ చేయి పట్టుకొని యాతఁడు క్రిందికి దిగెను.



విజయావిమలదేవులు నావనుండి దిగిపోయినతరువాత ఛత్రిసాలుఁడు విజయతో నిట్లు పలికెను— "విజయా! మనదేశమగు బుందేలఖండముపై భీకరమగు నాపద వచ్చిపడినది. ఇంతదనుక ఢిల్లీయవను లిచటిపవిత్రదేవస్థానముల విధ్వంసమొనర్ప సాహసింపలేదు. కాని, యింక నీదశయుఁ జాలకాలమువఱ కుండునట్లు తోఁచుటలేదు. అప్పుడే—యానాఁటి వింధ్యవాసినీదేవి వార్షికశృంగారసమయముననే రణదులహాఖానుఁడు తనభటుల వెంటఁగొని యవతరించెను. పురాతనసుకృతపరిపాకముచే మహోత్సవమున కెట్టివిఘ్నము గలుగక రణదులహాఖానుఁడు బద్ధుఁడయ్యెను. రణదులహాఖానుని బందీకృతు నొనర్చుటయన ఢిల్లీశ్వరుని యుద్ధమున కాహ్వానించుటయే యని తండ్రిగారు బాగుగ నెఱుంగుదురు. కాని, యాతని వదలిపెట్టినచో మనము సన్నద్ధులము కాకమున్నె గొప్పయాపద తటస్థించుననికూడ వారాలోచించిరి. కావుననే వారు రణదులహాఖానును బందీకృతు నొనర్చిరి. నేఁడుకాకున్న మఱినాల్గుదినములకైన నీవార్త ఢిల్లీకిఁ జేరక మానదు. కొలఁదిదినములలోనే బుందేలుఖండమున ముసల్మానులప్రవేశోపద్రవము లారంభమగును. ఇట్టివిషమసమయమున దేశోద్ధరణప్రయత్నమున సాధ్యమైనంతసాయ మొసఁగుట ప్రతిబుందేలునకును బరమధర్మము. బుందేలఖండముపై ముసల్మానులు దండెత్తునపుడు మునఁగూడ మనము నేఁటివలె ననైక్యవిరోధములతో మెలంగితిమేని, బుందేలఖండస్వాతంత్ర్య మాశాపథమునుండి శాశ్వతముగ భ్రంశమునందును. దేశము ముసల్మానులకు లొంగిపోవును. నీవు ఘాంఢేరరాజమందిరమున కేఁగుదువు. విమలదేవుఁ డోర్ఛారాజమందిరమున కేఁగును. కాని, స్వస్థానములఁ జేరి మీరు లీలాభోగములందును, నామోదప్రాభవములందును మగ్నలు కారాదు. పంచభక్ష్య

పరమాన్నములతో భోజనముసేయునప్పుడు నీసోదరీమణులు వేలకొలఁదిగ నొక్కొక్కగింజకొఱ కెట్లు నోరుతెఱచికొనియుందురో, నంత యా విషయముంగూడ భావింపవలయును. పట్టుగద్దెలపై శయనించుసమయమున నీప్రజ లెందఱు వనాంతరంబుల కటికనేలఁ బడియుండిరో స్మరింపవలయును. అధికారముఁ జూపుసమయమున నీప్రజలపైని స్వయముగ నీపైనిగూడ మహమ్మదీయుల కెంతయధికారమున్నదో యనెయుఁ గొంచె మాలోచింపవలయును. ప్రాణరిక్తమగుకాయ మెట్లు వ్యర్థమో, స్వాతంత్ర్యరిక్తమగు రాష్ట్రముఁగూడ నట్లే నిరర్థకమని బాగుగ నెఱిఁగియుండుము. సాధ్యమైనంతవఱకుఁ బ్రార్థించియైనను, బోధించియైనను, పట్టుదలఁ బూనియైనను, గినిసియైనను దల్లిదండ్రులను దేశస్వాతంత్ర్యరక్షణమునకై యుద్యుక్తుల నొనరింపుఁడు. మంచిది. ఇఁక నేఁగుఁడు. జాగగుచున్నది. మీశిబిర మిట సమీపముననే యున్నది."

ఛత్రసాలుఁడు మరలఁ దననావను ద్రోసికొని పోవసాగెను. విజయావిమలదేవులు శిలాప్రతిమలవలె నటులనే నిలిచిపోయిరి. ఛత్రసాలుఁడు మధ్యస్థమగుద్వీపముకడకుఁ దననావను దీసికొనిపోవుచుండెను. అతఁడు చాలదూర మేఁగినపిదప విమలదేవుఁడు తనతలంపుల కునుకునుండి మేల్కాంచెను. విజయతో నిట్లుపలికెను—

"విజయా! ఛత్రసాలుఁడు మనకొప్పఁజెప్పినకార్యము మనవలన నెఱవేఱునా?"

విజ—నెఱవేఱినను, నెఱవేఱకున్నను, నేను దానికై నాశక్తికొలఁది ప్రయత్నించెదను. అమ్మమనసున స్వదేశాభిమాన ముదయించినపుడెల్ల దానికిఁ బెంపుగూర్చుచుందును. మాకడనుండు ప్రధానులను సర్దారులను నీసన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయుదును. తండ్రిగారినిగూడ చంపతరాయచ్ఛత్రసాలుల ననుకరింపఁ బ్రార్థించెదను. దేశోద్ధరణకార్యక్రమమున వారేదేని విఘ్నమాపాదించినను, దత్ప్రయర్థముగ నేదేని ప్రయత్నము సల్పినను, వారిని సరియగుమార్గమునకుఁ ద్రిప్పుట యమ్మకును, నాకును, బ్రధానులకును, బ్రత్యేకప్రజకును గూడఁ గర్తవ్యమే.



విమ—కాని, విజయా! నేనేమిసేయుదును! ఎన్నియుక్తులుపన్నినను, నెన్నిప్రార్థనలు చేసినను, నెంతబెదరించినను, నాతల్లి తనపట్టు వీడదు. తనయుద్దేశమును మార్చుకొనదు. యువరాజుఛత్రసాలుఁడు మనపైఁబెట్టినకార్యము నావలన నావంతయు నగునని నాకు నమ్మికలేదు. నేనేమిచేయుదును!

విజ—నీవా! నీవు యువరాజుదలపతిరాయల ననుకరింపుము. నీప్రయత్నమున విఫలుఁడ వయ్యెదవని నీకు నిశ్చయముగఁ దోఁచినచో, నోర్ఛాయువరాజపదవిని విసర్జింపుము. స్వతంత్రతాదేవీపతాకాతలమున దేశసేవకై నీదేహమును సమర్పింపుము. ఓర్ఛారాజభవనమున లీలాభోగియగు యువరాజు, హస్తమునఁ గృపాణముందాల్చి తల్లిదండ్రులఁ ద్రోసిపుచ్చి సంగరరంగమున దుమికి స్వాతంత్ర్యమునకై పోరొనర్చఁగాక! ఆసమయమున నోర్ఛాప్రజలెల్ల రాతనికే సాయ మొసంగుదురు. వారిఁక హీరాదేవియడఁపును లెక్కఁగొనక తత్త్రాణమ తమరాఁగలరాజునకు సాయమొనర్ప నెల్లవిధముల సంసిద్ధులగుదురు.

విమ—కాని, స్త్రీవేషమునుధరించి నీయెదుటనిల్చిన విమలదేవుఁడు యువరాజు కానిచో—పురుషుఁడు కానిచో—అప్పుడు!—

విజయ నివ్వెఱపడి విమలదేవునివంకఁ జూడసాగెను. తుదకామె యిట్లనెను. ఏమి నీయీపురుషవేషము డాంబికమా! ఓర్ఛా

రాజ్యమునకు యువరాజు లేఁడా! విమలదేవుఁ డుత్తరమిచ్చుటకు సంసిద్ధుఁడై యుండెను. ఇంతలోననే యొకసేవకుఁడు వానిని వెదకుచు నాదిక్కునకే వచ్చుచుండుట కానవచ్చెను. ఆతఁడు తోడనే మాటునకుఁబోయి తనయాఁడువేషమును దీసివైచికొని మునుపటిపురుషవేషమును ధరించుకొనెను.

విమలదేవుఁడు వాస్తవముగఁ బురుషుఁడుకాకున్నచో నాతఁడు పురుషవేషమున నేలయుండవలయును? విజయ కిది బొత్తిగ బోధపడదయ్యె. మార్గమున నామె మాటిమాటికి నాతనిముఖమును దిలకించుచుఁ బోయెను. విమలదేవుఁడుమాత్ర మామెతో నొక్కమాటయైనఁ బలుకలేదు.

---

## ఎనిమిదవప్రకరణము.



### బంధుద్రోహమునకు ఫలము.

ఎద్దాని ననుసరించి మనుజుఁడు పరులహితమునకే యత్నించుచుఁ బరులకు సౌఖ్యమొనఁగూర్పఁ బాటుపడుచుఁ, బరులకై తనసర్వస్వము నర్పించుచుండునో, యాపరోపకారవృత్తి, ధర్మదృష్టితోఁ జూచినచోఁ గడుంగడు సద్వృత్తియే యైనను, దేశహితక్షేత్రమునుండి పరికించినచో, నొక్కొక్కప్పు డది గౌనమునకు వేరుపురుగు; పౌరుషమునకు విలయాగ్ని. కంచుకిరాయా! నీవు బుందేలఖండముననే జన్మించితివికాదా! బుందేలుర వంశముననే పుట్టితివికాదా! పవిత్రబుందేలఖండక్షేత్రము బుందేలులకొఱకే యనియు, నచ్చటియన్నపానీ



యములపై బుందేలులదే యధికారమనియు, సర్వశక్తిమూర్తియగు పరమేశ్వరుఁడును దత్ప్రతినిధియుఁగాక మఱెవ్వరు నాదేశమును శాసింపరాదనియు నెంచి, యేనికమయూర్తులగు వీరులు యుద్ధక్షేత్రమున రుధిరప్రవాహములఁ బాఱఁజేసిరో, యావీరవరుల కులముననే కదా నీవుద్భవించితివి! నీకాయమున బుందేలరక్తము ప్రవహించుచున్నది. నీనయనముల బుందేలతేజము ప్రకాశించుచున్నది. నీయంతరమున బుందేలహృదయము వసియించియున్నది. ఐనను నీవొకక్షుద్రునివలె నేఁడెట్టిపనికిఁ గడంగితివి! నీవు ఢిల్లీప్రభుల విలాసలాలసతనుజూచితివి. బుందేలుర కృపణావస్థయు నీకన్నులయెదుట నున్నది. నీవు ఢిల్లీసుల్తానుల యధికారమును జూచితివి. జాలిఁబడఁదగు నీప్రజలపరాధీనతయు నీకన్నులయెదుట నున్నది. నేఁడు ఢిల్లీయవనులపై నామోదవిలాసాధికారములు నిరర్గళముగ వర్షించుచున్నవి. నీప్రజలపై నేకాకబుందేలఖండప్రజలందఱిమీఁదను దారిద్ర్యదుఃఖపారతంత్ర్యముల ఘోరపర్వతము పడియున్నది. ఇట్టివిపత్సమయమున నీవు ప్రజాపాలనముసల్పి యాపదల దొలఁగించి వైభవమునుఁ బెంచి భీకరపారతంత్ర్యజాలమునఁ జిక్కకుండ వారిని గాపాడుదువను నాశయమున న్యాయపరుఁడగు పరమేశ్వరుఁడు నిన్ను ధాంధేరరాజవంశమున జన్మింపఁజేసెను. దానికి విరుద్ధముగ నీవు ఘాతుకుఁడ వైపోయితివి. సాక్షాత్పరమేశ్వరునే వంచించితివి. నీబంధుమిత్రులను నీప్రజలను బ్రమందించుటకే నీవుద్యుక్తుఁడ వైతివి. నీయిచ్చవచ్చినట్లొనర్పుము. అధికారమత్తయగు రోషనారను బాగుగ స్తుతింపుము. ఆత్మగౌరవము, పౌరుషము మున్నగు గుణములఁ ద్రోసిపుచ్చి రోషనారతో యథేచ్ఛముగ ఋతానృతములఁ బల్కుము. చంపతరాయల స్వాతంత్ర్యవిషయికోద్యోగములకు బాగుగ విఘ్నములం గూర్పుము. నీయీమర్వ

ర్తనమువలన బుందేలఖండమునఁ గలిగిన విపదాఘాతము నిద్రితమగు. బుందేలఖండక్షాత్రతేజమును మేల్కొలుపుఁగాక! ప్రతిబుందేలునకును బ్రత్యాఘాతమున కిచ్చవొడముఁగాక !

రోషనార కంచుకిరాయల నొకపరిహాస్యునిగ నెంచుచుండెను. కంచుకిరాయ లొకమూల మోకాళ్లపైఁ గూరుచుండి రోషనారబేగమును బ్రసన్నచిత్తం జేసికొనుటకై వివిధనమ్రభావములఁ జూప యత్నించుచుండెను. బేగం యాతని నొక వినోదవస్తువుగ నెంచి మనసున మిగుల సంతసించుచుఁ జిఱునవ్వునవ్వుచుండ నతఁడు బేగము తన యెడఁ గడుంగడుఁ బ్రసన్నయైనదని మైమఱచుచు, నదియే తనకార్యసిద్ధి కానుకూల్యము ప్రాప్తించు సమయమని యెంచుచుండెను. కొంచెముసేపటివఱకుఁ గంచుకిరాయలు బేగము స్వయముగ నేమైనఁ బ్రసంగించినపుడు సందర్భవశమున నన్నివిషయములఁ జెప్పవచ్చునని యూరకుండెను. తానే మొదట మాటాడుట కతనికి సాహసములేకుండెను. కొంచెముసేపటివఱ కిరువురు నూరక యుండిరి. తుట్టతుదకు రోషనార నవ్వుచు నిట్లుపలికెను.

“ రాజాగారూ! ఈమాఱు మీరు చాలనాళ్లకు వచ్చితిరి. ఈనడుమ మీరూపము చాల మారిపోయినది. గుర్తుపట్టుటకైన వీలులేకున్నది.”

కంచు—దేవివారు పలికినది చాల యుక్తముగ నున్నది. ఇక్కడినుండి వెడలినది మొదలు తఱచుగ నాకస్వస్థత కలుగుచున్నది. ఇదికాక ప్రజారాజ్యముల చింతయుఁ గలదు. మునుపటివలె నిశ్చింతత లేదు. బెంగయు మెండగురోగమును, నారూపు మార్చివైచిన వనిన దేవివారి కబ్బురము కలుగదు.

రోష—రాజా! ఢిల్లీదర్బారురక్షణమున నున్నను మీబోం



ట్లకుఁ బ్రజారాజ్య చింత తప్పకున్నదా! ఆచింత చక్రవర్తివంశమున కుండఁదగును. సామ్రాజ్యపు వ్యాపారములు, నేర్పాటులు నన్నియు మీసౌకర్యములకొఱకుమాత్రమే. మీయున్నతికొఱకు, మేలుకొఱకు, క్షేమముకొఱకునే, యింతటిజంజాటమును భరించుట! ఐనను మీరెల్లప్పుడును జింతాక్రాంతులమై యుంటిమనియే మొఱపెట్టుకొనుచుందురు.

కంచు—“ బేగమువారు సెలవిచ్చినది కడుయుక్తము. ఢిల్లీప్రభుత్వము దేశమున మూలమూలలందుఁగూడ శాంతిస్థాపించుటలో నేమియు లోటుచేయలేదు. ప్రజలయవసరము లన్నియుఁ జక్కఁగ దీఱుచున్నవి. రాజులకును మునుపటివలెఁ గష్టము కలుగుటలేదు. బందిపోటులనుండియు విప్లవకారులనుండియు రాజసైన్యములు వారినిఁ గాపాడుచున్నవి. ఒండొరులవివాదములకుఁ జోరొనర్పనక్కఱలేదు. దర్బారుననే యవియన్నియుఁ బరిష్కృతము లగును. దేశములోని ప్రజయంతయు సకుశలముగ నున్నది. కాని, రాజ్యసంబంధములగు చిన్నచిన్నకార్యములు కొన్ని మేము చేయవలసినవి యుండును. అన్నిటికన్న మాకెల్లపుడు నుండునట్టియు, మేము పరమకర్తవ్యముగ నెంచుకొనునట్టియుఁ జింతయేమన—ఢిల్లీసామ్రాజ్యమునకు మేలుగోరుట. ఈసమయమునఁగూడ నేనట్టికర్తవ్యమును బాలించుకొనుటకే యిచ్చటికి వచ్చినాను.”

రోష—సందియమేమియులేదు. రాజాసాహబ్! మీవిశ్వాసపాత్రతయెడను మీహితైషితయెడను మీస్వామిభక్తియెడను ఢిల్లీప్రభుత్వమునకు మిగుల నమ్మకమున్నది. నేర్పుతోడను పట్టుదలతోడను, మీకర్తవ్యమును బాలించుచు సామ్రాజ్యమునకుఁ బెద్దయుపకారములఁ గావించుచుండుట మీపక్షమునఁ గడుంగడు ప్రశంసనీయ

ము. (కొంచెమాఁగి) ఈసమయమున నేదోకర్తవ్యమును దీర్చుకొనుటకై వచ్చినట్లు మీరు చెప్పియుంటిరి కాఁబోలు!

కంచుకిరాయలు మైమఱచిపోయెను. తాను చంపతరాయ ఛత్రసాలుల దుండగముం గూర్చి బేగముతోఁ జెప్పుటతోడనే, యచటినుండి గొప్పసేన బుందేలఖండమున కేఁగి, వారి రాజ్యమును రూపుమాపివైచునని యాతఁడు తలంచుచుండెను. వారిదురాచరణములకుఁ దగినశిక్ష యగుననియుఁ దక్కుంగల విద్రోహులగు రాజులకును దండనమగుననియు, నింక బుందేలఖండమున శాశ్వతశాంతి నెలకొనుననియు నెంచెను. అదికాక తనకు గొప్పపదవియు బిరుదమును లభించుననునాసకలదు. కావున నాతఁడు మిగుల సంతసముతో బేగమునకు వృత్తాంతమంతయు వినిపింప సాహసించెను.

కంచు—సామ్రాజ్యభక్తులును గర్తవ్యపరులును గలయాబుందేలఖండముననే తరుణముంజూచి దోపిడి యొనర్చుచు, జనులశాంతికి భంగముంగూర్చు నవిధేయులును, విప్లవకారులును నగు జమీందారులుగూడఁ గొందఱున్నారను విషయము దేవివారికి బాగుగఁ దెలియనిదికాదు. చాలదినములనుండి యీజమీందారుల సరిదీయుటకు ఢిల్లీదర్బారునుండి యెట్టియేర్పాటును జరుగలేదు. ఈకారణమున వారిసాహసము మించి సార్వభౌమునిముఖ్యులగు హితైషులమీఁదను, సైన్యములమీఁదనుగూడ వారు దాడులు సల్ప మొదలిడుచున్నారు.

రోష—ఏమి! సార్వభౌముని హితైషులను సైన్యములను గూడ దోపిడులుసలుపుటయా! హితులనుమాటకు మీయభిప్రాయము విద్రోహుల నడంచుటకును, దేవాలయములఁ గూలఁగొట్టుటకును, గొలఁదికాలముక్రిందటనే బుందేలఖండమునకుఁ బంపఁబడిన రణదులహాఖానుఁడని కాదుకదా!



కంచు—దేవివారు సెలవిచ్చినది సత్యము. ఇపు డారణదులహాఖానువారివిషయముననే యించుక మనవిసేయుటకై యిచటికి వచ్చితిని.

రోష—(కోపముతో) సరే. చెప్పుఁడు.

కంచు—దేవివా రెక్కువచింతసేయ నవసరములేదు. ఈవ్యాపారమంత చింతింపఁ దగినది కాదు. ఇట్టిసంఘటనములు తఱచు జరుగుచునే యుండును. దీనికిఁ దగిన యేర్పాటు చాలసామాన్యముగనే కాఁగలదు.

రోష—(వినుఁగుతో) సరే. ఇంతకును జరిగినదేదో తెలియనిండు.

కంచు—(కొంచెముసేపు యోజించి) ఏమియులేదు. ఐనదేమనిన—రణదులహాఖాను—

రోష—(ఆవేగముతో) రణదులహాఖానునెవ్వరైన బంధించిరా యేమి?

కంచు—బేగమువారితలఁపు సరిగనున్నది. ఖానుగారు తమ వీరసైనికులఁ గొందఱి వెంటఁగొని చిత్రకూటమున వింధ్యవాసిన్యాలయమును బడగొట్టుటకై వెడలుచుండిరి. అచట నొకగుట్టపై విద్రోహియగు చంపతరాయలు మోసగించి వారినిఁ జెఱబట్టెను.

రోష—(ఇంచుకకోపముతో) ఏమంటిరి? ఇంతటివీరుఁడు యుద్ధనిపుణుఁడు నగుసరదారును సామాన్యరాజొకఁడు బంధింప మీరాతని కేమియు సాయము చేయఁజాలకపోయితిరా?

కంచు—(సంభ్రమముతో) బేగంఆలియా! ఆసమయమే యట్టిది. ఖానుగారే పట్టువడిరి. జరిగినదేమనః—ఖానుగారు తమ ముప్పదినలుబదిమంది ముఖ్యసైనికులను వెంటఁబెట్టుకొని యాలయ

ముదెసకుఁ బోవుచుండ దారిలోఁ జంపతరాయని కుమారుఁడగు ఛత్రసాలుఁడు ఇరువురుముప్వురు మర్త్యులతోఁ దటస్థపడెను. ఇంకనేమున్నది! రాజసైనికులంజూచి యాతఁడు వారివెంటఁబడెను. అతనియనుచరు లదనుజూచి కొందఱిభటులను గొట్టిరి. పోరు ప్రారంభమయ్యెను. చాలసేపు కత్తులు మెఱసెను. గొప్పయుద్ధ మయ్యెను. తుదకు వారి సైనికులు కొందఱు హతులైరి. మఱికొందఱు తమయన్యమిత్రులఁ దోడ్కొనివచ్చుటకై సమీపమందలి శిబిరమున కేఁగిరి. అంతే! తరుణము చూచి ఛత్రసాలుఁడు ఖానువారిని బంధించివైచెను.

రోషనార మిక్కిలి నిర్విణ్ణయయ్యెను. ఛత్రసాలుఁడు నతని యిరువురు ముప్వురు సహచరులును, ఖానుని ముప్పదినలుబదిమంది సైనికుల నెట్లు కొట్టితఱిమి యాతని బంధించిరో, యామెకు బొత్తిగ నర్థముకాలేదు. ఆమె మిగుల నాశ్చర్యమున నిట్లనెను:-‚‚ఛత్రసాలుని యిరువురుముప్వురుసహచరులు, ముప్పదినలుబదిమంది రాజసైనికులను జయించుట యెంతయాశ్చర్యకరము!”

ఇపుడు కంచుకిరాయలకు ఖానుగారిమాట జ్ఞప్తికివచ్చెను. అతఁడు తనమాట సవరించుకొనుటకై యిట్లుపలికెను:—

‚‚నేను మానవిసేయ మఱచితిని. ఆసమయముననే చంపతరాయలు పెద్దసేనతో నచటికి వచ్చెను. ఈయల్లరియంతయు నాతనిమూలమునఁ గలిగినదే.”

కాని, రోషనార యశిక్షితురాలుకాదు. ఆమె కంచుకిరాయల తత్తఱపాటుచే నందేదియో రహస్యమున్నదని గ్రహించెను. అతఁడు తనమాటను సవరించుకొనుటతోడనే యామె యనుమాన మినుమడించెను. కంచుకిరాయలమాట లన్యోన్యవిరుద్ధములుగ నుండెనని యామె తలఁచెను. ఐనానామె ‚‚అప్పు డేమయ్యె” నని యడిగెను.



కంచు—చంపతరాయలు వారినిఁ దమశిబిరములోనికిఁ గొంపోయి చెఱనుంచెను. ఎంతయో కష్టముపై నర్ధరాత్రమున నేను మారువేసమున ఖానుగారిని గలిసికొంటిని. వారు నాకు ఢిల్లీకేఁగి సమాచారమంతయు బేగమువారితో మనవిసేయ నాయోజన మిచ్చిరి. వచ్చునప్పుడు వారు నాకు గుఱుతునకై యొకకత్తినిఁగూడ—

రోష—(నడుమనే) ఏమికత్తి?

కంచు—ఆదంతపుఁబిడికత్తి. దానిపై దేవివారి బొమ్మయున్నది. దాని ననేకపర్యాయములు—

రోష—(తొందరతో) ఏది! ఎక్కడనున్న దాకత్తి?

ఇపుడు కంచుకిరాయలు చిక్కునఁబడెను. అతనినోటినుండి మాట రాదయ్యె. ఆకత్తి యెక్కడనున్నదని చూపును? ఛత్రసాలుఁడా శిబిరముననే దాని నతనినుండి లాగికొనియుండెను. బేగము మాటలవరుసచూచి యతఁడు తనమాటల నామె నమ్ముటలేదని తలంచెను. ఇఁకఁ గత్తిమాట యున్నదున్నట్లు చెప్పినచో బేగము అవిశ్వాసము మెండగును. అతనికిఁ జాల చింతవొడమెను. విపత్పర్వత మెదురుగఁ గన్పింపఁదొడంగెను. అతఁ డూరకుండుటఁజూచి రోషనార మిగుల కోపముతోఁ గఠినస్వరమున నిట్లనెను:-

‚‚రాజాగారూ! మీరు చెప్పితిరికదా! రణదులహాఖానుఁడు మీ కాకత్తినిచ్చెనని. అది యెక్కడనున్నది? చూపుఁడు!”

కంచు—నేను శిబిరమునుండి బయలువెడలుసమయమున ఛత్రసాలుఁడువచ్చి నాయొద్దనుండి దానిని లాగికొనెను......

రోష—బాగు! ఒకకుఱ్ఱవాఁడు మీనుండి కత్తిని లాగికొనుటయా! అయ్యా! మహాత్మా! మీకేమైనఁ జంపతరాయలపై వైరముండి దానిప్రతీకారముకొఱకు మీరీవల వచ్చుట లేదుకదా!

కంచు — మేము ఢిల్లీప్రభుత్వమునకుఁ జిరకాలసేవకులము. మఱియు.........

రోష — సరే. ఇవన్నియు నిట్లుండుచునే యుండును. ప్రస్తుతము రెండునెలలవఱకు మీరు ఢిల్లీలోనే స్థిరపడుఁడు. ఈలోపుగ బుందేలఖండమునుండి సరియగు సమాచారము తెలియును.

కంచు — హుజూర్! —

కాని, యింక రోషనార యచట నుండ నిచ్చగించక యొక దాసికి సంజ్ఞచేసెను. ఆదాసి యతని కిట్లనెను:- రాజావారూ! ఇఁక మీరు దయచేయుఁడు. ఈమాట లింక నెప్పుడైనఁ జెప్పవచ్చును.

నిస్సహాయుఁడగు కంచుకిరాయలు తనమాటలను లోలోననే యడఁచి యుంచుకొనవలసివచ్చెను. రోషనార తనదాసికి రాజభవనమున నొకగదిలోఁ గంచుకిరాయలుండుట కేర్పాటుచేసి ద్వారమున గట్టికావలి యుంచున ట్లాజ్ఞ యిడెను.

కంచుకిరాయలు రెండుమాసములవఱకు ఢిల్లీలోనే బందీయై యుండెను.

---

## తొమ్మిదవప్రకరణము



### శవాలంకరణము.

ఏభయంకరయుద్ధమున షహాజహాఁ చక్రవర్తి ప్రియపుత్త్రుఁడగు దారాసైన్యము విచ్ఛిన్నమై పోయెనో, యేయుద్ధమున విజయమందుటచే నౌరంగజేబుయొక్క ఢిల్లీసింహాసనమార్గము నిష్కంటకమై పోయెనో, యాసోముగడయుద్ధము పరిసమాప్తినంది నేఁటికి సుమారాఱువత్సరము లైనవి. సింహాసనమార్గస్థములగు సోదరరూపకంటకములను నిర్మూలించినపైఁ దనమాయాభైక్షుకవేషమును దీసివైచి యాలంఘీరు తదంతర్గుప్తమైయున్న రక్తవర్ణయుతమగు రాజ్యతృష్ణావేషమును సామ్రాజ్యసభయందుఁ గూరుచుండి ప్రజలకు జూపింపనారంభించెను. ఐహికనిస్సారత్వము నుపదేశించిన యాతనిజిహ్వ యిపుడు ప్రాపంచికసారస్యగానము మొదలిడెను. మక్కాకుఁబోయి శేషించిన తనజీవితమును భగవద్ధ్యానమునఁ గడుపవలయునను నతనియాశయము కేవలనటనయని ప్రజలెల్లరు మెల్లమెల్లగఁ దెలిసికొనుచుండిరి. ఏమహమ్మదీయపండితు, లేన్యాయాధ్యక్షులు, సోదరహంతయని భావించి యాతని శాస్త్రసమ్మతుఁడగు నేలికగ నంగీకరింపకుండిరో, వారిని సమాధానపఱచుట యొక్కటియే యాతనికిఁ గలకొఱఁత. “తనరాజపదవిని స్థిరమొనర్ప సరదారులు, అమీరులు, రాజులు మున్నగువారి పదవులను నధికారములను వృద్ధిబొందింపవలయును” అను నాతని యాశ యింకను సంపూర్ణముగ సఫలముకాలేదు. “ఔరంగజేబు హత్య, రక్తపాతము, పితృద్రోహము, బంధుద్రోహము, దురాశ్రయమానుషత, మున్నగువాని సాయమున ఢిల్లీసింహాసనారూఢుఁ

డయ్యెనని తలంచువారినోళ్లు మూసివైచుపని యింకను మిగిలియుండెను. సామ్రాజ్యసంపాదనమునఁ దనకు సాయమొసఁగిన చంపతరాయాదిభూపతుల సన్మానము మిగిలియుండెను. వికటసమయముల నతనియొద్దనుండి వాగ్దానములఁ గైకొన్నవారు, తత్సంసిద్ధికాలము సమీపించుచున్నదని యెంచుచుండిరి. అతఁడును బ్రజల సంతుష్టులఁ గావించుటకై తద్వశీకరణమునకై తనవాగ్దానములఁ గొలఁదిగనో గొప్పగనో నిర్వహింపనుండెను. ఇంతియకాక రాజ్యసిద్ధ్యనంతరమున నేతత్కార్యనిర్వహణమునకై యాతఁ డొకదినమును బ్రత్యేకించి యేర్పఱచియుంచెను. రంజాన్ మాసపు నిరువదియైదవతిథినాఁడు ఢిల్లీయం దొకగొప్పరాజసభ జరుగునని దేశమందంతటఁ బ్రకటింపఁబడెను. నాఁటిసభయం దుపస్థితులగుటకు దేశమందలి గొప్పగొప్పసరదారులకు రాజులకు నాహ్వానపత్రములు గూడ నంపఁబడెను. స్వయముగ నౌరంగజీబునకు నాట్యము మున్నగుభోగములయం దాసక్తి లేకున్నను ఢిల్లీమహాసభాసంపదచేఁ బ్రజలకన్నులు మిఱుమిట్లు గొల్పుటకును, ముఖ్యముగ ఢిల్లీనివాసులను వశపఱచుకొనుటకును, రంజాన్ మాసపుఁ దుదివారమున బ్రజలెల్లరు గొప్పగొప్పయుత్సవములఁ జేయవలయుననియు నగరమంతయు నృత్యాదులచే దీపింపవలయు ననియు, రాజసభాగాములగు నతిథులకు వివిధస్వాగతము లొసంగవలయు ననియు, నేతత్సర్వకార్యనిర్వహణమునకై, రాజ్యకోశమునుండి ధనము వెచ్చింపవలయు ననియు నతఁ డాజ్ఞాపించెను. ఈయుత్సవమునకు మఱియొకయంగముగూడ నుండెను. నగరోత్తరదిశయందలి యమునాతీరస్థమగు మైదానమున నాల్గుదినములదనుక స్త్రీలయుత్సవమును బణ్యవీథియుఁ గూడును. ఆయుత్సవమున నగరమందలి వనితలెల్లరు గూడుదురు. రాణులు, రాజపుత్త్రికలు, ప్రతీహారిణులు, మున్నగునం



తఃపురవనితల కండఱికి, నాఁటియుత్సవమునఁ బాల్గొన సార్వభౌముఁడనుమతి నొసఁగెను. ఢిల్లీయందలి ధనాఢ్యలు—దరిద్రులు—నగువనితలెల్ల మిగులఁ గౌతూహలముతో నాదినమునకై నిరీక్షించుచుండిరి. అందును యవనికాభ్యంతరవర్తినులగు యువతుల కాయుత్సుకత యధికతరముగ నుండెను—రంజాన్ ఇరువదినాల్గవతిథి యెప్పుడు వచ్చును! ఈకారాగృహమునుండి విముక్తి మన కెప్పటికిఁగలుగును! బహిరంగమగు ప్రదేశమున మన మెన్నఁడు సంచరింపఁగలుగుదుము! ఈపంజరములనుండి వెలువడి స్వేచ్ఛావాయువులఁ దిరుగుసమయ మెప్పటికివచ్చును!

నాట్యవిహారాది భోగానుభవమునకై ఢిల్లీనివాసులును, బిరుదపత్రసంపాదనముం గోరి సామంతాధిపతులును, దమతమ యధికారగౌరవప్రదర్శనాభిలాషచే మంత్రులుమున్నగువారును, బహిరంగవాయుసేవనము వాంఛించి యంతఃపురకాంతలును, రంజాన్ ఇరువదినాల్గవనాఁటికై నిరీక్షించుచుండిరి. ఔరంగజీబునకుఁగూడఁ జాలనాళులు రంజాన్ అంతిమసప్తాహము జ్ఞప్తికివచ్చెను. నేను నాప్రజలరాజభక్తిఁ బాత్రుఁడనై పోయితినని యాతఁ డొకప్పుడు కూరుచుండి తలంచుచుండును. ‘‘న్యాయాధ్యక్షులు, పండితులు మున్నగువారి నందఱ నేను సమాధానపఱిచితిని. వారు నాకాశీర్వాదముల నొసంగుచున్నారు.” అని యొకప్పు డెంచుచుండును. ‘‘నేను సభయం దాసీనుఁడనైయుండ మంత్రిసామంతు లెల్లరుఁ దమలోఁదా నౌరంగజీబు నిజముగ ధర్మవర్తనుఁడే యని గుసగుసలాడుచున్నా” రని యొకప్పుడు భావించుచుండును. సింహాసనాసీనుఁడై ప్రజలకు బిరుదములొసంగి తనరాజ్యాధికారమూలము దృఢ మొనర్చుచున్న ట్లొకప్పు డలపోయుచుండును.

క్రమక్రమముగ శాబాన్‌మాస మంత మొందవచ్చెను. ఢిల్లీయందలి యుత్సవప్రియులగు జనులయౌత్సుక్యముఁగూడఁ గ్రమక్రమముగ వృద్ధిఁబొందుచుండెను. ఇంక నైదుదినములకు రంజాన్ ప్రారంభమగునని యెల్లరనుచుండిరి. నిర్మలాకాశమున రంజాన్ బాలచంద్రుఁడు వెలుఁగనారంభించుటను నిరీక్షణమున, నెల్లరు సంతృప్తులై యుండిరి. కాని, సహసచే యాకసము మేఘాచ్ఛన్నమగుట కానవచ్చెను. సార్వభౌముఁడు భయంకరరోగపీడితుఁ డయ్యెనన్న వృత్తాంతము హఠాత్తుగ నగరమందంతట వ్యాపించిపోయెను. ఇంక నెక్కడిరాజసభ, యింక నెక్కడివిలాసము లని యెల్లరు ననసాగిరి—భావిమహోత్సవాశాజనితమగు నగరవాసుల యానందము మహావిఘ్నము పాలయ్యెను. అట్లయ్యు రాజాధికారులు సభాప్రయత్నములం దెట్టిలోపమును గలుగఁజేయుటలేదు. సర్వకార్యములు నిర్విఘ్నముగఁ గొనసాగుచుండెను.

సభానియతమగుదినము నికటము కాఁజొచ్చెను. రంజాన్ బాలచంద్రుఁడుగూడ నుదయించి, క్రమక్రమముగ వృద్ధిఁబొందుచుండెను. కాని, పాదుషావారియారోగ్య మెట్లున్నది? దినదినము నభివృద్ధిఁజెందుచున్నదా? లేక వ్యాధి యధికమగుచున్నదా? యనువిషయము మాత్ర మెవ్వరు నెఱుంగరు. ప్రజలెల్లరుఁ దమతమయూహాలం బట్టియు ననుశ్రుతములగు వార్తలంబట్టియుఁ జర్చింప నారంభించిరి. సామాన్యజనులమాట యటుండ మంత్రులకు నాస్థానవర్తులకుఁగూడ సార్వభౌముని యారోగ్యవృత్తాంతము తెలియుటలేదు. అంతయేల! రాజకుటుంబములోనివారికి—రాణులకు, యువరాజులకు, రాజపుత్త్రికలకుఁగూడ నేమియుఁ దెలియవచ్చుటలేదు. “ వందలకొలఁది తార్తారుస్త్రీలు సశస్త్రలై కావలికాయుచుండ రోషనారాబేగము సార్వభౌముశుశ్రూషామగ్నయై యున్నది—దినదినము రాజముద్రాంకిత



ములగు నాజ్ఞాపత్రములు ప్రచలితములగుచున్నవి. ఎరికి నెవ్విధమునను నేవార్తయుఁ దెలియకుండవలయునని రోషనార యాలోచించుచున్నది” అను నీవిషయముగూడ వివిధాపోహాలతోపాటు వ్యాపించిపోయెను.

“ రంజాన్ పదునైదవతిథినాఁడు సామ్రాజ్యసభ కూడునా, కూడదా? నాఁటి కొకనాఁడు ముందుగనే యారంభింపఁబడు నుత్సవములు జరుపఁబడునా లేదా?” యని ఢిల్లీనగరవాసు లందఱుఁ జింతించుచుండిరి. మంత్రులు, నాస్థానవర్తులుఁగూడ నీవిషయమున నేమియుఁ జెప్పఁజాలకుండిరి. కాని, వారు సభాప్రయత్నములమాత్రము నిర్వర్తించుచునే యుండిరి. రానున్న మహారాజులు, సామంతులు మున్నగువారి యాతిథ్యము నివాసము మున్నగువానికై వలయునేర్పాటు లన్నియుఁ గడుశీఘ్రముగఁ జరుగుచుండెను. ఇట్టియవస్థలోఁ బ్రజలును సందేహావిష్టులయ్యుఁ దమతమప్రయత్నములఁ జేయుచునే యుండిరి. అంతకన్న వేఱుమార్గ మేమియు వారికిలేదు.

జయసింహమహారాజు ఢిల్లీరాజసభకును విశేషించి యలంఘీరునకును మిగుల విశ్వసనీయుఁడై యాదరపాత్రుఁడై యుండెను. “ హిందువులు కాఫరులు, ద్రోహులు, మాయావులు, రాజ్యశాసనసామర్థ్య మిసుమంతయు వారికి లేదు. కేవలాసమర్థులు” అని దృఢముగ నెంచువాఁడయ్యు నౌరంగజేబు, జయసింహుఁడుమాత్రము హిందువులలోఁ దప్పఁబుట్టినాఁడని భావించి మహాకార్యముల నాతనివశ మొనర్చుచుండెను. కాని, జయసింహునకుఁగూడ రాజసభ కూడునో కూడదో తెలియదు.

రంజాన్ ఇరువదిమూఁడవరాత్రికూడఁ గడచెను. రజనీకరసుధాసమ్మిళితతుషారమున సుస్నాతమైన ఢిల్లీ, భగవానుఁడగు సహస్రక

రునిచే నీయఁబడినస్వర్ణకటమును ధరించుచుండెను. ఆమెయవయవము లన్నియు విభూషణపుష్పమాలికాభరితములై యొప్పుచుండెను. దానికి నలువైపులఁ జక్కనితృణకంబళములు పరివ్యాప్తములై యుండెను. ఆకంబళములపై నుండియే యామె నిర్మలగగనదర్పణమున స్వస్వరూపదర్శనమగ్నయై యుండెను. తత్సౌందర్యదర్శనవిమోహితుఁడై నిరాకారుఁడగు పవనుఁడుగూడ నామెకు నిరంతరసేవ సేయుచుండెను. వాయుసాహచర్యమున వచ్చినసుగంధము ననుభవించుచు వివిధమనోహరగీతములఁ బాడుచు నామె మహానందముతో నాత్మాలంకరణ మొనర్చుకొనుచుండెను. జయసింహుఁడు షాజహాఁ చక్రవర్తినాఁటి ఢిల్లిసౌందర్యము వీక్షించియుండెను. అట్లయ్యు నేఁటితత్సౌందర్యము వర్ణనాతీతమని యతఁడు భావించుచుండెను. కాళిందీతీరస్థమగు తన యందంపుమేడపైఁ గూరుచుండి యతఁడు ఢిల్లీసౌందర్యము నీక్షించుచుండెను. ఢిల్లీ అంతటి గంభీరానందమయరూపము వహించినను జయసింహునివదనము ఖేదవిషాదపరిచ్ఛన్నమై యుండెను. ఢిల్లీనగరపు యావనికసౌందర్యము, యావనికానందము, నతనిమనసున కెక్కుట లేదు. తననాథుఁడు రోగగ్రస్తుఁడై యుండఁగనే జీవనమరణసందిగ్ధావస్థయం దుండగనే, ఢిల్లీ వివిధాభరణకలితయై యానందమున నవ్వుచుఁ గూరుచుండుటయు, నలంఘీరుని సందిగ్ధావస్థయందుఁగూడ నామె యీయుత్సవమంతయు నంగీకరించుటయుఁ దలఁచి యాతఁడు మిగుల విచారించుచుండెను. కులటయగు ఢిల్లీయలంకారముంగాంచిన నాతని కెట్టి యానంద మొదవుటలేదు. అందుచే నతఁడు తనదృష్టి నచటినుండి మరల్చి మనోహరనిర్మలయమునాప్రవాహముం జూడఁదొడంగెను. కాని, యందుఁగూడ ఢిల్లీసంసర్గమూలకములగు చాంచల్యకౌటిల్యము లతనికి గన్పించుచుండెను. తుది కాతఁడు నిర్జరభువనసదృశాలం



కృతమై, పణ్యవీథి (మీనాబజార్) కూడనున్న యావిశాలప్రదేశము దెసకు దృష్టిగొల్పెను. ఆభూమియంతయుఁ దృణచ్ఛదదుకూలవస్త్రపరివృతముగను, నందలిబాటలు వివిధవస్త్రవిరచితలతలంబోలియు నాతనికిఁ గన్పట్టెను. మార్గమున కిరువైపుల బాగుగ నలంకరింపఁబడియున్న యంగణము లున్నవి. ఎల్లచోటులు సుగంధకుసుమములచే నలంకరింపఁబడుచున్నవి. గులాబీలయొక్కయు, మొగలిపూలయొక్కయు, జలాశయములు నిండియున్నవి. తత్సన్నాహమునకయ్యు, కావలికయ్యు, నిటునటుఁదిరుగు యవనసుందరీమణులుతప్ప మఱి యేరు నటఁ గానవచ్చుటలేదు. ప్రశస్తములగు బాటలచే నలువైపులఁ జుట్టఁబడియున్నచోటుల నత్యంతమనోహరములగు విపణు లమర్పఁబడియున్నవి. ప్రతిమార్గమున సంగడు లేర్పఱుపఁబడియున్నవి. రెండుదారులనడుమను బ్రశస్తములగు పుష్పవనము లేర్పఱుపఁబడియున్నవి. నడుమ గాయకురాండ్రు కూర్చుండుటకై యాసనము లమర్పఁబడెను. అచ్చటిహృదయంగమమగు దృశ్యముంగాంచిన జయసింహునకుఁ గొలఁదిగ శాంతిసంతోషములు గలిగెను. తచ్ఛోభాదర్శనమగ్నుఁడై యున్నకాలముననే యొకసేవకుఁ డేఁగుదెంచి, చంపతరాయని యాగమనముం గూర్చి యాతనికిఁ దెలియఁజెప్పెను. మిగుల నానందముతోఁ జంపతరాయల నటకుఁ గొనిరా నతఁడు వాని కాజ్ఞ యొసంగెను. సేవకుఁడు నిర్గమించినంతనే తాను లేచి నిలువఁబడి, చంపతరాయల యాగమనము నిరీక్షించుచుండెను. కొలఁదిసేపటిలోనే చంపతరాయలటకు వచ్చెను. సప్రేమముగ నిరువురును బరస్పరాలింగనము లొనర్చుకొని కుశలప్రశ్నానంతరమున నన్యప్రసంగములకుఁ గడంగిరి. జయసింహుఁ డేయాలోచనముల నింతకుమున్ను నిమగ్నుఁడై యుండెనో, తద్విషయికములగు చర్చనే యారంభించెను. అతఁడింకను ఢిల్లీ

శోభాదర్శనకుతూహలుఁడై యుండుటం గాంచి కొంచెము విచారించి చంపతరాయ లిట్లు నుడివెను:—

"మీజీవితమున సగముకన్న నధికముగ స్వదేశీయులధనము నిర్బంధమునఁ గరరూపముననో లేక శిక్షారూపముననో గ్రహింపఁబడి తన్మూలముననే యీవిలాసములన్నియు జరుగుచుండుటఁ గాంచుట లోనే కడచిపోయినది. ఐనను మీమనసు శవాలంకరణమును శవశోభను గాంచుట కెట్లుసమ్మతించుచున్నదో నాకుఁ దెలియుటలేదు. కౌరవపాండవులనాఁటినుండి చౌహాణపృథ్వీరాజుకాలముదనుకఁ గ్రమక్రమముగ నింద్రప్రస్థనగరి దుర్బలయగుచు వచ్చెను. తుదకు రాఠోడ జయచంద్రునిచేతి విషపాత్రమునుద్రావి యదియానాఁడే మరణించినదని చెప్పవచ్చును. జీవనహీనయగు నాయింద్రప్రస్థనగరికే ఢిల్లీయను నామధేయమిడి యవనచక్రవర్తులు నూతనసామ్రాజ్యమునుండి తదలంకరణము మొదలిడిరి. రక్తపాతము, హింస, ధర్మనాశనము, నీతిరాహిత్యము, మున్నగు కళంకములచే నంకితములగు భూషణముల ధరింపఁజేసి వారు దీని నలంకరించిరి. ఐననేమాయె. శవము శవమేకదా!"

జయ—మీమాట చాల బాగుగనున్నది. కాని, మనము దినదినము సంఖ్యచే, బలముచేఁ బౌరుషముచే క్షీణించిపోవుచుండుట మీ రెఱుంగుదురు. మనప్రవృత్తి బానిసతనముదెసకు సాగుచున్నది. మనము స్వయముగనే స్వపాదముల గొడ్డంట నఱకికొనుచున్నాము. మిమ్ముఁబోలు పురుషశ్రేష్ఠు లిరువురుముగ్గురు దేశోద్ధరణప్రయత్నమునుండఁ దద్విద్వేషులై విఘ్నముల నాపాదించువారు క్రమక్రమముగ నభివృద్ధిఁజెందుచున్నారు. ఇట్టియవస్థలో దేశకల్యాణ మెట్లుచేకూఱఁగలదు! సరియే. ఈవిషయములన్నియు నెప్పటికైన నుండు



నవే. బహుశః రేపటిమహాసభకొఱకే మీరు విచ్చేసియుందురని తలంచెదను.

చంప—బహుదినములనుండియు మీదర్శనము లభించుట లేదు. రాజసభానిమంత్రణముగూడ ముందుగనే చేరెను. మఱియుఁ జిరకాలమునుండి ప్రాణనాథస్వాములవారు ఢిల్లీయందలి సార్వభౌమాస్థానపుఁబరిస్థితులన్నియు ఛత్రసాలకుమారునకుఁ జూపఁదగునని కోరుచుండిరి. ఈయన్నికారణములనుబట్టియు నొకసారి ఢిల్లీకిఁబోయి చూచివత్తమని నిశ్చయించుకొంటిని.

జయ—కానిండు. బాగుగనే యున్నది. యువరాజు ఛత్రసాలుఁడుగూడ మీవెంట నున్నాఁడుగదా!

చంప—ఔఁ. ఛత్రసాలదలపతిరాయకుమారు లిరువురు నాతోడనే యున్నారు.

జయ—దలపతిరాయ లెవరు?

చంప—సాగరదేశపుయువరాజు.

జయ—సాగరదేశపుయువరాజా! శుభకరణునికుమారుఁడా!

చంప—ఔను.

జయ—అతఁడు మీతో నెట్లువచ్చెను?

చంప—తనబంధునిద్రోహకార్యములయం దెట్టివిఘ్నమును గలుగకుండ శుభకరణుఁడు తనసుతుని రాజ్యమునుండి బహిష్కరించెను. ఛత్రసాలదలపతులకుఁ గలమైత్రి ననుసరించి యాతఁడు ప్రస్తుతమున మాకడనే యున్నాఁడు; మాతో వచ్చినాఁడు.

అటుపైఁ గొలఁదిసేపటిదనుక వివిధప్రసంగములు జరిగెను. తుదకు జయసింహచంపతరాయులు మేడమీఁదినుండి క్రిందికి దిగివచ్చిరి. క్రిందికి దిగివచ్చునప్పటికి జయసింహునికుమారుఁడగు రామసిం

హుఁడు చంపతరాయాదుల కాతిథ్యసత్కారములను బాగుగ సమర్పియుంచెను. తనకుమారుని కార్యకౌశలముం గాంచి జయసింహుఁడు చాల నానందించెను.

---

## పదియవప్రకరణము.

రంజాన్ ఇరువదినాల్గవరాత్రి.

రంజాన్ ఇరువదినాల్గవరాత్రికిఁ దనప్రభలచే సాయపడనేరని పరోపకారపరుఁడగు సూర్యభగవానుఁడు పశ్చిమదిశను మెల్లమెల్లఁగ వెలుంగఁజొచ్చెను. పరోపకారియగు తననాథుని శ్రమనివారణమునకై పశ్చిమాశాసుందరి విశ్రాంతిభవనద్వారమున సలజ్జయై నిలువఁబడియుండెను. పశుపక్ష్యాదులెల్ల స్వభాషల నాత్మోపకారియగు గ్రహపతిగుణగాన మొనర్చుచు శీఘ్రప్రత్యాగమనమునకై యతనిఁ బ్రార్థించుచుండెను. దివాకరకరశోభితములగు నీరజములు శోకమగ్నములై యున్నట్లుండెను. యోగ్యుఁడగు నొకభూమీశుని మరణకాల మాసన్నముకాఁగాఁ బ్రజలెల్ల రయోగ్యుఁడగు తమభావిభూపాలునిఁ దలఁచికొని యెట్టినిరాశకు లోనగుదురో, యట్టినిరాశయే యాసమయమున నలుగడలఁ గ్రమ్ముకొనిన ట్లుండెను. కాని, నాఁటి ఢిల్లీపరిస్థితిమాత్ర మేమో విలక్షణముగ నుండెను. వివిధమానవపరివృతమగు నాచంద్రికావిపణి యుత్సవలోలురగు నచ్చటిప్రజల తద్విషయిక విమర్శనము, వివిధజాతీయులై, వివిధవేషులై, వివిధభాషాభాషులగు నచ్చటిప్రజలను గాంచి నీప్రపంచమండలి యొకసాధారణనగరమునుగాక పరమేశ్వరుని యనంతరచనానైపుణినిఁ బ్రదర్శించు నొకమహోన్నతోదాహరణముం గాంచిన ట్లుండెను. భగవంతుఁడగు ప్రభాకరుని వియోగసమయము నికటమగుట వీక్షించి, వనస్పతికులమెల్ల, పశుపక్షిసంతతి యంతయు, మానవకోటి యంతయు, నిరాశాసముద్రమున మునుఁగుచున్న ట్లుండెను. ఇంతయయ్యు నొంటరియై యానందోత్సవసుఖపరవశయై యున్న ఢిల్లీనిఁ గాంచి, యదియే తత్ప్రపంచబాహ్యమగు నగరమని యెంచిన నాశ్చర్యమేమి! అందు హాని యేమున్నది! అచ్చటి యుత్తేజితానందమయస్వరములను, హేళనాట్టహాసములను వినిన నచటనుండినవా రస్తమించెడి సూర్యునితో నీవియోగము మాకు సుఖప్రదమే యని చెప్పుచున్న ట్లుండెను.

కాని, నీవెవ్వతెవు? ఇచ్చట నీవేమిచేయుచున్నావు? కొంచెము నీనలువైపులఁ జూచికొనుము. ఈయుత్సవమున నింతమందివనితలు కూడియున్నారు. కాని, వారిలో నెవ్వరును నిన్నుఁ బోలి నిరాశాదుఃఖభరితలై కాన్పించుటలేదు. వారెంతయానందసుఖమగ్నలై యున్నారు! కాని, వారు నీకేల కాన్పించుటయైన లేదు! నినేత్రములు బాష్పపూరితములై యున్నవి. సూర్యుని భవిష్యద్వియోగము నీదుఃఖకారణము కాదుకదా! కాని, నీవు ఢిల్లీయందున్నావు! దివాకరవియోగఖిన్నమగు నీప్రపంచమునకు బయట నున్నావు. ఇంక నీకు దుఃఖమేల? అరె! ఈమె వెక్కివెక్కి యేడ్చుచున్నది! ఈమెచర్యలను వస్త్రాదికములను గాంచిన రాజాంతఃపురవాసినియు, మహాభిమానినియు వలెఁ గాన్పించుచున్నది. రాజభవనములనుండికూడ నేఁ డెట్టియద్భుతవ్యక్తులు బయల్వెడలినవి! సార్వభౌముఁడు తనభవనమందలి రాణులున్నగువారిని నాల్గుదినములదనుక, నెట్టియాటంకములేక విపణివీథిం దిరుగ ననుమతి నొసంగెను. ఇట్టిస్థితిలో స్వేచ్ఛావిహారము సలు

ఏక నీవిచ్చట నేమిచేయుచున్నావు? స్వాతంత్ర్యపూర్ణమగు నీదినచతుష్టయము గడచిన మరల నీవు రాజమందిరకుడ్యములనడుమ దుఃఖమయజీవనమును గడపవలసియుండును. కొంచెమావిపణిదెసకు నడువుము! అచ్చట గొప్పగొప్పయధికారులయొక్కయు, ధనవంతులయొక్కయు, బాలికలు మహాడంబరముతోఁ దమతమయంగడుల నేర్పఱిచి కూర్చుండియున్నారు. వారిసౌందర్య మెంతయధికమో వారి యంగడియందలి వస్తువులమూల్యముగూడ నంతయధికమని యెఱింగిన నీ వచ్చెరువందుదువు. చూడు మాసుందరి యొక్క క్షణములో, చీనావానిచేఁ జేయఁబడిన మాయావజ్రమును, యువకుఁడగు నారాచవానికి నూటయిరువదియైదు వేల రూప్యముల కమ్మివైచినది. ఆరూప్యములన్నియు నాయనుకృతవజ్రమూల్యము కాదు. ఆయువతి ప్రేమమూల్యము. కాని, నీకటు దృష్టియే లేదు. నీకావిపణి మనసున కెక్కకున్న నాసమీపముననే యున్న మఱియొకదానిలోని కేఁగుము. అచ్చట నీమనము ప్రసన్నమై తీరును. అచ్చట స్త్రీపురుషసమూహములు నడచుచున్నవి. ఆశోభ వర్ణనాతీతము. రాజవంశజలగు యువతులు చాలమంది తమతమఖ్యాతినిఁ బ్రదర్శించుకొనుచున్నారు. లావణ్యవతియగు నారాజపుత్త్రి బవరున్నీసా నేఁడు రాజపుత్త్రవనితవేషముతోఁ గూర్చుండియున్నది. ఆసౌందర్యము నెదుట సమీపస్థలగు తెక్కుకుమీఱిన యువతులసౌందర్య మంతయు వెలవెలఁబోవుచున్నది. అట్టిదివ్యసుందరీవీక్షణమైన నీకు సంతోషదాయకము కాఁజాలదా! నీనిరాశ యంతకంత కధికమగుచున్నది. నీవిట్లిచ్చటికి వచ్చితివి! ఇంతయానందమయమై శోభామయమై యున్న స్థానమువీడి నీవు యమునాతీరమున కేలవచ్చితివి? మానవకోటిపై నీకంతటి విసువేల! నిర్జనముగు యమునాతీరము సుఖవాంఛారహితులగు యోగులకైన రహస్యా



నందభోగులగు ప్రణయియుగళములకైన నక్కఱకువచ్చును. కాని, యట్టిస్థితిగతులతో నీ కెట్టిసంబంధమును గన్పట్టుటలేదు. ప్రణయవాంఛ నీహృదయమునుండి తొలఁగి చిరకాలమైనది. నీమనసున వైరాగ్యతరంగోత్పత్తి యగుటకింకను జాలకాలము పట్టును. అట్లైయుండ నీవు నిర్జనయమునాతీరమున కేలపోవుచున్నావు?

తానచ్చటి కేల యేఁగుచున్నదో యామెకే తెలియదు. ఆమె యిట్లాలోచింప మొదలిడెను. "రేయి యప్పటిదుఃఖకరస్వప్నమునుండి పరహితకారియగు సహస్రకరుఁడు తనమృదుకరములతో నాకు విముక్తి నొసంగినప్పటినుండి, ఢిల్లీపట్టణమం దంతటను, సమీపస్థములగు ప్రదేశములను, బాడఁతోఁటలను దిరుగుచుంటిని. ఐనను నాకార్యసిద్ధి యగు లక్షణముమాత్ర మొకించుక యైనఁ గానవచ్చుటలేదు. నేఁటి యంతిమాశాసూర్యుఁడుగూడ నస్తమించినాఁడు. ఇంక నేను మరల శాశ్వతముగ దుఃఖసంకటమయమగు భయంకరపరాధీనతాంధకారమున మునిఁగి యుండవలసినదే!" ఈయాలోచనలచే నామె హృదయము బ్రద్దలైనట్లుండెను. ఆమె మాటిమాటికి నస్తమయరవిని జూచుచు నధికతరముగ శోకాకులయగుచు ముందంజ వేయుచుండెను. ఆదుర్గ్గనకుఁ దనగమ్యస్థాన మాత్మాశ్రుపూరితమై యున్నట్లామె యెంచుచుండెను.

భావిరవివియోగవ్యాకుల యగు నాప్రౌఢ నెమ్మదిగ నడచుచు యమునాతీరముం జేరి యచ్చటి యొకఱాతిగట్టుపై నాసీనయయ్యెను. ప్రపంచమంతయుఁ దన్నుఁబోలి దుఃఖసముద్రముననే మునిఁగి యున్నట్లామె భావించుచుండెను. తనకల్పనారచితమగు చిత్రమునం దామె యీవిషయముం గాంచెను. "కాళింది నైసర్గికమగు తనచాంచల్యమును వీడి గాంభీర్యమును వహించినది. పశుపక్షులు, దుఃఖమ

యములై యేడ్చుచుండెను. పవనుఁడు దీర్ఘనిశ్శ్వాసముం గొనుచుండెను. వనస్పతికుల మంతయు ఖిన్నమై తనజీవనదాతదెసఁ జూచుచుండెను. సృష్ట్యాదినుండియు, మానవజాతి బాల్యమునుండియు, భగవంతుఁడగు చండకరుఁడు మానవుల యౌన్నత్యమునకై నిరంతరకృషి సలిపినాఁడు; అనన్యసాధారణమగు జ్ఞానమును మానవున కొసంగినాఁడు. అట్టియెడఁగూడ మానవులయందు దినదినాభివృద్ధిగాంచుచున్న ద్రోహము, నైచ్యము, దౌష్ట్యము, కృతఘ్నత మున్నగువానింగాంచి యత్యంతసంతప్తుఁడై జగముచుట్టము పశ్చిమసముద్రమున దుముకనుండెను.

శోకమగ్నయగు నావనిత పర్వతముపై స్థిరముగనున్న సూర్యునింగాంచి యిట్లెంచెను. "పాప మీసూర్యుని కిఁకఁ గొలఁదియాయువే మిగిలియున్నది. ఒకటిరెండుక్షణములలో నితఁ డస్తమించిపోవును. ఇఁక నవ్వఁడు! నలుదెస లంధకారమయమై పోవును." కొంతసే పాఁగి మరలఁ దనలోఁ దానే యిట్లనుకొనెను. "దివాకరా! నీవును బ్రాణనాథుఁడును సమానమగు స్థితినే యున్నారు. ఇరువురును సంపత్తికాలమున సంపూర్ణతేజములతో వెలుఁగుచుండిరి. ఆకాలమునఁ దేజఃపూర్ణములైన మీముఖములను జూచుటకైన నేరికిని సాధ్యము కాకుండెను. కాని, యిప్పు డిరువురిప్రభయు వినష్టమై పోయినది. కాఁబట్టియే యిప్పటివఱకు నాకసమున నడఁగియున్న తారకలుసైతము, మాత్సర్యవీక్షణముల మీపైఁ బఱపుచు నవ్వుచున్నవి. అంధకారమును బ్రేమింపఁజూచెడి పశ్చిమ నీయందు నూతనతేజోజననము కాకుండఁగనే నిన్ను స్వర్గభువనమునుండి బహిర్గతునిఁగావింప నెంతటిప్రయత్న మొనర్చుచున్నది! పశ్చిమా! నీవు నిజముగ రోషనారానుబోలు దుర్మారవే! మాయావినివే యగుదువు! నీవుగూడ నామెవలె హృదయశూ



న్యవు. ఆమెకుఁబోలె నీకును స్వార్థముతప్ప నన్యమేమియుఁ గానవచ్చుటలేదు. విషయాధికారలాలసతావహ్ని రోషనారకోమలమనఃప్రవృత్తుల నెట్లో, యట్లే నీమనఃప్రవృత్తులఁగూడ దగ్ధ మొనర్చివైచినది. ప్రత్యక్షమగు నంశుమాలి వినాశనప్రయత్నము! అతతియెడఁ గృతఘ్నతాభావము!—నీకెంతటి భయంకరసాహసము! అట్లయ్యు మందహాసముతో నీవాసాహసము నొనర్చుచున్నావు! కాని, నీయీనవ్వు—లజ్జావినయసంయుక్తమగు నీనవ్వు—రోషనారావదనమున నెన్నఁడును గాన్పింపదు! ఐన నీవు రోషనారవు కావా! ఈసూర్యుఁడు పాదుషావారివలె నాసన్నమరణుఁడు కాఁడా! కాఁడు. ఇతఁడు పశ్చిమసముద్రమున దుముకఁ గోరుటలేదు. దినమంతయు నవిరతపరిశ్రమ మొనర్చి యలసి యిప్పుడు తనప్రియపత్నియగు పశ్చిమసుందరిని గలిసి యంతఃపురప్రవేశ మొనర్పనున్నాఁడు. రాత్రియంతయు విశ్రమించినతరువాత నూతనాశాసహితుఁడై నవతేజోభరితుఁడై పూర్వధరాధరముపై వెలుంగును. కాని, నాథా! నిర్భాగ్యురాలనగు నేను నిన్నెట్టియవస్థలోఁ గాంచనోచితినో కదా! ఈసూర్యుఁడు—ఆకాశగంగాసంచారియగు నీసూర్యుఁడు రేపు మరల నూతనప్రభల నుద్దీపించును. కాని, నాసూర్యుఁడు—రోషనారాజాలమునఁ దగుల్కొనిన ఢిల్లీసూర్యుఁడు రేపీ ప్రపంచమున........"

"ఓదయామయా! లోకనాథా! నేఁటిదనుక నేను నీతోఁ బెట్టుకొనిన మొక్కుల కిదియే ఫలమా! భగవతీ! వింధ్యవాసినీ! అనన్యభావమున నేను నిన్నాశ్రయించినను నాపై నీకనుగ్రహము కలుగలేదు. నేను నేఁటిదనుక యవనగృహవాసినినయ్యు జీవించియుంటిని. దేవీ! దిక్కుమాలినదానను, భాగ్యహీనను నగు నాపాపరాశి నీదయ కలంఘ్యముగ నున్నదా! విశుద్ధప్రేమను బవిత్రకర్తవ్యమును దలంచికొనియే

నేను యవనను గావలసివచ్చెను. కాని, యింతమాత్రముననే నేను భవదీయానుగ్రహమునకు దూరమగుదునా! కాను. కాను. దేవీ! గతి విహీనయగు నీయబలనుద్యజింపకుము.”

ఈరీతి శోకస్వరమున వింధ్యవాసినీప్రార్థన మొనర్చుసమయమున నామె నేత్రములు నిరంతరబాష్పవాహకము లయ్యెను. అందుచే వింధ్యవాసిని యనుగ్రహించి తనసాయమునకై పంపినవ్యక్తిపై నామెదృష్టి ప్రసరింపలేదు. మరల నామె మొదటియట్లు ఉత్కంఠయై యనుకొనఁజొచ్చెను.

“దేవీ! వింధ్యవాసినీ! నీహస్తములయందలి యాయుధము లెంతభయంకరములో, యెంతక్రూరములో, నీయంతఃకరణ మంత సరళమనియుఁ, గృపాపూర్ణమనియు, నేఁటిదనుక నేనెంచుచుంటిని. కాని, నీహృదయ ముగ్రతాక్రౌర్యముల నీయస్త్రముల కెవ్విధమునను వెనుకాడదని యిప్పుడు నేను విశ్వసించుచున్నాను. భవదీయయగు నొకబాలిక స్వపరివారదూరయై, జాతిధర్మభ్రష్టయై, విధర్ములగు నన్యులహస్తములంబడి యీసమయమున వినయపూర్ణయై యెంతయో ప్రార్థించుచున్నది. ఐనను నీమనసు కరఁగుటలేదు. నీవు దయాశూన్యవని తోఁచుచున్నది! నీవు పతితపావనివా?”

“శాంతవుగమ్మ. శాంతవుగమ్మ. నిష్కారణముగ వింధ్యవాసినీదేవిపై నిందను మోపకుము. ఆత్మదోషఫల మనుభవించునప్పుడు దేవతలను నిందింపకుము.”

అపరిచితమగు నీస్వరము వినఁగనే యావనిత కొంచెము మెలకువఁ గాంచెను. మిగులఁ గష్టమున నామె కన్నీటిం దుడిచికొని యెదుటికిఁ జూచెను. శాంతగభీరుఁడగు నొకయువకుఁ డామెదెసఁ జూచుచుండెను.



వనిత—నేనెట్టిదాననని నీయభిప్రాయము ?

యువ—నీతివిహీనవని.

వని—కాను. ఎప్పటికిని గాను. నేను నీతిశూన్యననుటచే నీవు నన్నే కాక న్యాయసత్యధర్మములనుగూడ నవమానించుచున్నావుఁ. విషయవాంఛచే నేను స్వజాతిధర్మములను వీడితినని నీవెంచితివి కాఁబోలు ! కాని, నీయీయూహ పొరపాటు. నీవు నన్నెంతటి యవినీతిజాలమగ్నగ నెంచుచుంటివో నేనట్టిదానను గాను.

యువ—ఐన నీకీవేషమేమి ? జాతినిబట్టి నీవు హైందవవని తెలియుచున్నది. కాకున్న వింధ్యవాసినిని బ్రార్థించియుండవు.

వని—నేను శారీరకముగ యవననైనను మానసికముగ హైందవనే. నాహిందూసోదరుల శుభముంగోరిన, హిందూధర్మముపై శ్రద్ధనుంచిన, హిందూదేవతల యెడ భక్తివహించిన నందుఁ దప్పేమి?

యువ—నీవు మానసికముగ హైందవవు. శారీరకముగ యవనవు. ఇట్టివికటావస్థలో నీతిరక్షణ మెట్లుకాఁగలదు ? శారీరకముగ యవనవగుట, అన్యుని విషయవాంఛాపూరణమునకై నీశరీర మర్పించుట, నీతిధర్మబంధనములఁ దెగ్రింపివేయుటయే యనఁదగును.

వని—తమయయోగ్యతమూలమున, నసామర్థ్యముచే, లేక యధికారబిరుదాదిలాలసతచేఁ, బురుషులు తమయక్కసెల్లెండ్రను గూఁతుండ్రనునిచ్ఛాపూర్వకముగఁ గాకున్నఁ బరవశులై యుండుటచేఁ బాదుషాయంతఃపురముల కనుపుచున్నారు. అట్టియబలలమీఁద మరల వారికింతటిక్రోధమేల ? వారిపై నింతటిరోతయేల ? సాహసివై యిట్టి యన్యాయమును దొలఁగించుటకు మారుగ నపరిచితను దిక్కుమాలినదానను నగునాపై నిష్కారణముగ వాగ్వర్షముం గురిపించుటయే పరాక్రమమని నీవెంచుచుంటివా ? ఇంతటి నీతిగర్వములుగలవారు

ముందుగఁ దామెంతటి నీతిమంతులో యరసికొని, పిమ్మట నితరుల నీతిని బరీక్షింపవలదా ?

యువ—(ఉద్రిక్తుఁడై) యవనపరాక్రమప్రభలంగాంచి, గోమాయువుంబోలి దాఁగికొను పౌరుషహీనుఁడు శాంతుఁడై యిట్టినీ మాటలను వినఁగలఁడు. కాని, స్వగౌరవరక్షణమునకై యాహవరంగమున నాత్మరక్తప్రవాహములఁ గల్పించుబుందేలుఁ డిట్టినీతిహీనవచముం గనఁజాలఁడు. బాగుగఁ గన్నులు తెఱచిచూడుము. మహీబాయువరాజగు ఛత్రసాలుఁడు నీయెదుట నిలిచియున్నాఁడు. అన్యులనీతిపరీక్ష యొనర్చు నధికార మీతనికిఁగలదో లేదో నీవే యెఱుంగఁగలవు.

అన్నపానాదులయభావమున మరణింపనున్న క్షామపీడితునియెదుట సుభక్ష్యభరితములగు పళ్లెరములనుంచిన వాని కెంతటియానందము గలుగునో, వాడినతీవపై నీరుపడిన నెట్లుపచ్చఁదనముందాల్చునో యట్లే ఛత్రసాలునిమాటలను వినుటచే మలినమగునావనితమోము ప్రఫుల్ల మయ్యెను. ఇంతదనుకఁ దనకుజరిగిన యవమానమును మఱచి యావనిత యేకాగ్రదృష్టితో ఛత్రసాలునింజూచి యిట్లనెను. “ కుమారా ! నీవు చంపతరాయలకుమారుఁడవా ! మహీబాయువరాజవా !”

క్షణమాత్రసంజనితమగు నాయువతివిలక్షణవికారమున కధికాశ్చర్య మొంది ఛత్రసాలుఁడు శిరఃకంపన మొనర్చి “ అవును ” అనియెను.

వని—అట్లైన నిశ్చయముగ నావిజ్ఞప్తి ఢిల్లీప్రదేశమును దాఁటి వింధ్యవాసినీదేవికర్ణములఁ బడినది. తల్లీ ! వింధ్యవాసినీదేవీ ! ఈభాగ్యహీన యుద్విగ్నచిత్తయై తెలియక నిన్ను నిందించినది. అండులకు దీనిని మన్నింపుము. నీవు పతితులఁ బావనులుగ నొనర్చుదానవు. నీకృపకుఁ బాత్రముకాని దెద్దియునులేదు. ఈబాలికవిజ్ఞప్తి నాలించి ప్రపంచమునకు భవదీయాపారకృపాపరిచయముం గలుగఁజేసినావు. దేవీ ! ఈసమయమున నీవే స్వయముగ నాసాహాయమునకై ఛత్రసాలకుమారు నిట కంపినావని నేనెంచుచున్నాను. కుమారా ! నీదక్షిణహస్తముం జూపుము. నేను దాని కీరక్షాబంధముం గట్టెదను. రేపటిసభకై చంపతరాయలు వచ్చునని నేను వింటిని. ఈయాపత్సమయమున నాతఁడే నాకు సాయపడఁదగునని నేనప్పుడే తలఁచితిని. నేటిప్రాతఃకాలమునుండియు నాతనినే వెదకి యీరక్షాబంధ మాతనికిఁ గట్టుటకై యెల్లచోటులఁ దిరుగాడుచుంటిని. తుదకు నిరాశనై యిటువచ్చితిని. కాని యదృష్టవశమున నిచ్చట నీతో సమావేశ మయ్యెను. ఇంకఁ జంపతరాయని వెదకనక్కఱలేదు. నీవు నాకు సహాయభూతుఁడవై నన్నీయాపదనుండి యుద్ధరించెదవని, యిప్పుడు నాకు విశ్వాసము కలిగినది. ఈరక్షాబంధము స్వీకరించి నన్నుఁ గాపాడుసోదరుఁడవు గమ్ము.

ఇట్లుచెప్పి యాకాంత ఛత్రసాలకుమారునిహస్తమున రక్షాసూత్రముంగట్టుటకై ముందఱికి వచ్చెను. కాని, ఛత్రసాలుఁడు తనహస్తముంజాఁపక క్షణక్షణప్రసన్నతరమగు నామెమొగముదెసఁ జూచుచు మాటాడక నిలువఁబడియెను. అంత నాకాంత దుఃఖితయై యిట్లు చెప్పెను.

“ ఛత్రసాలా ! నాకు సోదరుఁడవగుట నీకవమానకరమని సంశయించుచున్నావా ? నేను యవననై యవనమందిరమున నున్నంత మాత్రమున నీతివిదూరనైతినని నీవెంచుచున్నావా ? నీవట్టియూహను మాని దిక్కులేనిదాననై యసహాయనై యున్న నాకుఁ దోడుపడ సం

సిద్ధుఁడవుగమ్ము. నీవీరక్షాబంధము ధరింపవేని నీబంధుత్వచిహ్నమును దిరస్కరింతువేని, కేవలకల్పితమగు నొకకారణమున నాకు సహాయభూతుఁడవు కాకుందువేని, ఆర్యవనితలు నిన్ను దయాశూన్యుఁడవని యెంచి నీమొగముచూచుటయే యమంగళకరమని తలంతురు. ఈరక్షాసూత్రము నీహస్తమునఁ గట్టువడినంతనే నీహృదయమున వాస్తవికబాంధవ్యజ్ఞానము గలుగును. ఇప్పటిదనుక నీవెవతెను నీతిభ్రష్టయని యెంచుచుంటివో యామెయే నీసోదరి యగును."

ఛత్రిసాలుఁడు గంభీరభావమునఁ దనహస్తముం జాఁచెను. ప్రథమమున నామె శౌర్యలక్ష్మీసంయుతమగు నాతనిముఖమువంకను, తరువాత ముందఱికిఁ జాఁచఁబడిన బలిష్ఠమగు నాతనిహస్తమువంకను, తుదకుఁ దనరక్షాబంధమువంకను, సమాధానపూర్వకముగఁ జూచెను. ఆతనిహస్తమున రక్షాబంధముఁ గట్టఁగనే యందామె కేదియో కన్పట్టెను. ఆమె యానందాతిరేకమున దానిం గట్టుటయే మఱచెను. ఛత్రిసాలుఁడు మఱింత వెఱఁగుపడి యేమోచెప్పనుండ నింతలోఁ బ్రసన్నయై యామెయే యిట్లనెను.

"చాలబాగుగ నున్నది. ఇంక నాకార్యము తప్పకసిద్ధించును. దేవీ! వింధ్యవాసినీ! నీయీయపారకృపకై రాఁబోవువత్సరమున నీవార్షికోత్సవసమయమున మణివజ్రములఁ గానుకగఁ బంపెదను. కాని, యువరాజా! నీఋణము నేనెట్లు తీర్చుకొనఁగలను?

ఛత్రి—(సాశ్చర్యముగ) నాఋణమెట్టిది? నేను నీకెట్టియుపకార మొనర్చితిని?

వని—ఇప్పటివఱకు నేమియు నొనర్పకున్నను, నిటుపై నొనర్చునవసరము లభించును.

కొలఁదిసేపటివఱకు ఛత్రిసాలునిహస్తమందలి ఖడ్గము నీక్షించు



చుండి యామె యిట్లడిగెను. "ఈకరవాలము నీకెచ్చట దొరకినది?

ఛత్రి—దీనిని నేను ధాంధేరదేశపురాజగు కంచుకిరాయలహస్తమునుండి లాగికొంటిని.

వని—దీనిపిడిపై నున్నబొమ్మను గాంచితివా?

ఛత్రి—ఆ. నేనీచిత్రము చాలసారులు చూచితిని. కంచుకిరాయలు చిరకాలము ఢిల్లీరాజమందిరములం దుండియుండెను. ఆకాలమున నేరాజపుత్రియో యాతని నీఖడ్గముచే బహూకరించియుండునని నాతలంపు.

వని—కుమారా! ఈకృపాణము తనయజమానురాలిహస్తమునుండి యనేకామానుషకార్యములఁ జేసినది. కాని, పుణ్యశీలమగు నీకరమునంబడి యది తనక్రౌర్యమంతయు మఱచినదని తోఁచుచున్నది. న్యాయాన్యాయవిచారణముమాని యూరక రక్తపాతము సేయుటయే దీనిపనిగ నుండెను. అట్లయ్యు నీహస్తమునుండి నేఁడిది తనదయాగుణమును ప్రకటించు మహోజ్జ్వలప్రమాణముం జూపఁగలదు.

ఛత్రి—(మఱింత వెఱఁగుపడి) నాకు నీమాటలయర్థము తెలియుటలేదు. నీయభిప్రాయమేమి?

వని—ముందుగ నీహస్తమున నీసూత్రముఁ గట్టనిమ్ము. బంధుప్రేమబంధమును దృఢతర మొనరింపనిమ్ము. అటుపై నీకంతయుఁ దెలియఁజెప్పెదను.

ఇట్లని ముందుగ నామె మిగులఁబ్రేమతో ఛత్రిసాలునిహస్తమున రక్షాబంధముంగట్టి సంతుష్టయై యిట్లనెను. "ఛత్రిసాలా! నేఁటినుండి నీవు నాసోదరుఁడవైతివి. ఇఁక నన్నన్నియాపదలనుండి యుద్ధరించుట నీకర్తవ్యము. నారక్షణ మిఁక నీపరమధర్మము. ఏకమా

తృగగ్భజనితులగు సోదరీసోదరులసంబంధమును మించినదీబంధుత్వసంబంధము. దీనిమూలమున నీవు నాకై యొనర్పవలయుకార్య మత్యావశ్యకము.

ఛత్రి—(గంభీరముగ) ఇదియంతయు నేను బాగుగ నెఱుంగుదును. ఈకార్యమునకై నాప్రాణములనైన నర్పించుట యింక నాకర్తవ్యము. మాతండ్రిగారెంతటిస్వవాఙ్నిష్ఠులో నీవెఱింగియుందువు. నేను వారికుమారుఁడను—నిజముగ బుందేలుఁడగువీరుఁడు స్వవాక్యములఁ బ్రాణాధికమూల్యవంతములుగ నెంచును. ఇంక నీవు నీకార్యమేమో నాకెఱింగింపుము. నీపైఁబడినవిపద్వృత్తాంతమును బూర్తిగ నాకుఁ దెలియఁజెప్పుము. అటుపై మానవికములగు ధైర్యశౌర్యధర్మముల నీవ యెఱుంగుదువు.

ఛత్రిసాలుని నిశ్చితవాక్యముల నాలించి యామె మఱింతయు తేజితయై యధికతరగాంభీర్యమును వహించెను. ఆమెవదనమునఁ బ్రసన్నతాచ్ఛాయ లింకనట్లే యున్నను దన్మానసికగాంభీర్యప్రతిబింబము ఆమెమొగముపైఁ గన్పింపకుండనుండలేదు. కొలఁదిసేపాఁగి యామె యిట్లుపలికెను—

“ఛత్రిసాలా! ఢిల్లీచక్రవర్తి యీసమయమున నెట్టిఘోరవిపత్తునం బడియున్నాఁడో నీవెఱుంగుదువా!

ఛత్రి—ఆ. అతఁడిప్పుడు మహావ్యాధిఁ బడియున్నాఁడని యెఱుంగుదును. రేపటిసభకు వచ్చుటయు, రాకుండుటయుఁగూడ నింకను దెలియలేదు.

వని—అతనిమరణవార్త వినిన బుందేలఖండస్వాతంత్ర్యయోధులగు మీరెంతయు సంతసింతురుగదా! శత్రువు తనంతఁదాఁజచ్చిన మీకానందముకదా!



ఛత్రి—(ఆశ్చర్యోద్రేకములతో) ఆనందమా! మావైరి వ్యాధిపీడితుఁడై మరణించిన మాకానందమా! శత్రువుమరణించిన మాకానందమేకలుగును. కాని, యదెప్పుడు? మేము స్వయముగఁ బోరాడి యాహవరంగమునఁ దత్ప్రాణములను గొనినప్పుడు! వ్యాధి, దురదృష్టము మున్నగు నన్యకారణములచే శత్రువు మరణించిన బంధుగులేగైన మరణించినప్పటియంత దుఃఖము కలుగును.

వని—చాలబాగున్నది. కాని, ముందిది చెప్పుము. పాదుషావారు రేపే నీరోగులై బుందేలఖండమున మిగిలియున్నస్వాతంత్ర్యమునుగూడ హరింప సంసిద్ధులైనచో నప్పుడు?

ఛత్రి—అప్పుడేమి! మాకు మఱింతసంతసముకలుగును. స్వాతంత్ర్యప్రాప్తిసమయ మంతవికటమగునేని, మేము మఱింతసంతోషముతో యుద్ధభూమి నాతనినెదిరించి పోరాడి స్వాతంత్ర్యముం బొందుదుము.

వని—ఛత్రిసాలా! నీయిట్టిదృఢము నుదారము నగుమాటవినిన నాకత్యంతానందము గలుగుచున్నది. నన్నాపదనుండి యుద్ధరింప భగవతి యోగ్యుఁడగుప్రతినిధిని బంపినది. వినుము. నీవేమియొనర్పవలయునో చెప్పుచున్నాను. హిందూధర్మవినాశన మొనరించి, యిస్లాముస్థాపించుటయే తనవిధియని యెంచువాఁడును భారతీయులకు, భారతీయస్వాతంత్ర్యమునకుఁ బరమశత్రువును, భవదీయాదర్శమార్గస్థితమహాకంటకము నగుఢిల్లీచక్రవర్తి నాత్మవిపద్గ్రస్తునకై, యాత్మమార్గము మరింతగఁ గంటకాకీర్ణ మొనరించుకొనుటకై మరణమునుండి కాపాడవలయును. అతనిప్రాణములను రక్షింపవలయును.

ఛత్రి—(సాశ్చర్యముగ) సార్వభౌముఁడు రోగియైయున్నాఁడు. నేనతని నెట్లు రక్షింపఁగలను! నేను వైద్యుఁడనుగాను. రోగికి నాచేత

గునుపకార మేమి? ఈసమయమున సమర్థుఁడగు వైద్యుఁడు కావలయును.

వని—అక్కఱలేదు. సార్వభౌముని సాధారణవైద్యులేకాక సాక్షాద్ధన్వంతరియైన బ్రదికింపలేఁడు. ఇంతదనుక నతఁడు రోగియై యున్నాఁడనుట కల్లమాట. ఒకదురాశయసిద్ధికై నింద్యకార్యనిర్వహణమునకై పాదుషా రోగపీడితుఁడై యున్నాఁడను నసత్యవార్త నలుగడల వ్యాపింపఁజేయఁబడుచున్నది. అతఁడు నిర్బంధపూర్వకమగు నౌషధసేవనముమూలమున, స్మృతివిహీనుఁడుగ నొనర్పఁబడినాఁడు. కాని, యావిస్మృతి కొలఁదికాలమున నశింపఁగలదు.

ఛత్రి—ఐన నావిషయమున నేనేమియొనర్పవలయును?

వని—రేపు సూర్యోదయమైనతరువాత రెండుగడియలకుఁ బాదుషావారికి విష మొసంగఁబడును. దానికై యంతయు సిద్ధముగ నున్నది. రేపు నిండుసభలో సార్వభౌమునిమరణమును బ్రకటింప నేర్పాటు జరిగినది. విషపానమున మరణింపకున్న నాతనిమస్తకము ఖండింపఁబడును. సార్వభౌము నీయాపదనుండియే నీవు రక్షింపవలయును.

ఛత్రి—ఓపరమేశ్వరుఁడా! నైచ్యము, క్రౌర్యము, దుర్నీతి, పారముముట్టినవి. విషముచే ఢిల్లీశ్వరునిప్రాణముపోకున్న మస్తకము ఖండింపఁబడునా! ఈయుపాయములఁ బన్నినవారు శిలామయులై యుండవలయును. ఇట్టిపైశాచికకార్యమును నివారింప నీసంబంధము నావలయునా! కృపాలేశమైన హృదయమునఁ గలవాఁ డెవ్వఁడైన నీమాటను వినినంతఁ దనప్రాణముల నొడ్డియైనఁ బాదుషాను రక్షింపఁ బరుగెత్తును. అలంఘిరుపాదుషా బుందేలఖండమునకు మాత్రమే శత్రువుకాఁడు. హిందువనువానికే శత్రువు. ఐనను నతని నిట్టికృత



ఘ్నతనుండియు, మాయనుండియు, రక్షింప హిందూస్థానవాసియగు ప్రతివాఁడును సంసిద్ధుఁడే. దేశీయహితాహితములనుబట్టి తప్పక యతఁడు మాకు వైరియే యగును. కాని, యాతనితోఁ బగసాధింప బహిరంగయుద్ధరంగ మున్నది. సాధారణమానవసంబంధమునుబట్టి యౌరంగజీబు మాబంధువు. ఇట్టియాపత్సమయమునఁ దత్సహాయ మొనర్చుట యెల్లరకుఁ గర్తవ్యము. ఆయుపాయము బన్నినట్టినీచుని, పాపిని, అధముని, నాకెఱింగింపుము. రేపు సూర్యోదయమునకు ముందుగనే వాని నాత్మదుష్కర్మఫల మనుభవింపఁజేసెదను. పాదుషాకు విసమొసంగువారును దన్మస్తకము ఖండించువారు నెవరు?

వని-కుమారా! ఆమె యత్యంతకోమలాంగియగు నొకయువతి.

ఛత్రి—ఆఁ. ఒకయువతి యౌరంగజీబును జంప నెంచుచున్నదా! ఆపిశాచిని యెవ్వతె!

వని—ఎవతెచిత్రము నీఖడ్గముపైఁ జూచుచున్నావో యామెయే.

చాలసారులుచూచినయాచిత్రమును మఱియొకమారు శ్రద్ధతోఁ జూచి ఛత్రసాలుఁ డిట్లనెను:—ఈమె రూపవతియగు నొకయవనవనిత.

వని—ఔను. ఆరూపవతియే పాదుషాప్రాణములఁ గొననున్నది.

ఛత్రి—ఆమెయెవతె?

వని—షహాజహాన్ చక్రవర్తిప్రియపుత్త్రికయగు రోషనారాబేగం. ముంతాజ్ గర్భమున జనియించిన యౌరంగజీబుతోఁబుట్టువు.

ఛత్ర—మఱియామె తనసోదరునికే విషమీయఁ గోరుచున్నదా?

వని—ఒకవిషమీయఁగోరుటయే కాదు. తనస్మాలమునఁ

గార్యసిద్ధి కాకున్నఁ దన్మస్తకమును ఖండింపనుగూడఁ గోరుచున్నది.

వని—[illegible]సోదరుని యెడ సోదరి యిట్టివ్యాపార మొనరించుచునా! ఓయీశ్వరా! [illegible] దుష్టసేవకులను, పాపాత్ములను, నరకమున కేల పంపివేయవు! ఈప్రపంచమున వారి నేలయుండనిచ్చెదవు! మంచిది. రోషనారాబేగము తనసోదరు నేలచంపనెంచుచున్నదో చెప్పుము?

వని—షహాజాక్ఖానను సర్దారునికొమార్తెను బాదుషా వివాహమాడెను. ఆమెతో రోషనార కత్యంతమైత్రి. ఆమె కాతేండ్ల పుత్త్రుఁ డొకఁడు కలఁడు. రోషనార తనసోదరునిప్రాణములహరించి సింహాసనముపై నాకుఱ్ఱవానినే కూర్చుండఁబెట్టఁగోరుచున్నది. అట్లయిన రోషనారకుఁ బరిపాలనాధికార మనుభవించుటకును, దనయిచ్చ వచ్చిన ట్లానందించుటకును, నవకాశము లభించును. తనసోదరునిఁ జంపుటలో బేగమున కున్ననీచాశయ మిదియే.

ఛత్రి—ఐన ముఅజ్జింకుమారునివిషయమున నామె యేమియే ర్పాటొనరింపనున్నది?

వని—ఆవశ్యకతకలిగినప్పు డొక్కఖడ్గాఘాతముచే నాతని నంత మొందించి తనమార్గము నిష్కంటకమొనర్పవచ్చునని యామె బాగుగ నెఱుంగును. నేను నీకప్పఁజెప్పినకార్యమున ముఅజ్జిం కుమారుఁడు గూడ నీకధికముగ సాయపడును. కాని, యన్నిటికన్న గొప్పవిషయ మిది. నీహస్తమున నీఖడ్గమున్నంతవఱకు నన్యులసహాయము నీకక్కఱలేదు. దీనిసహాయమున నీవు వందలకొలఁది తాత్తారుస్త్రీలనుదాటి నిర్భయముగఁ బాదుషావారిగదిలోనికిఁ జేరఁగలవు. రాజమందిరమున నీకృపాణము నీకోర్కులను గొఱంతలను, నన్నిటిని దీర్చివైచును. దీని యర్థ మేమన—ఈకరవాలము నీకరమున నున్నంతవఱకుఁ దాత్తారుస్త్రీలందఱు నీయాజ్ఞకుఁ గట్టువడియుందురు. నీచేయుపనులకు వేనికి నాటం



కముం గలిగింపరు. ఇప్పుడు అచ్చటి కేఁగి కర్తవ్యనిశ్చయ మొనర్చుకొందము. పాదుషావారు దుష్టయగురోషనార వలనుండి వెలువడుదురని యిప్పుడు నామనస్సు సాక్ష్యమిచ్చుచున్నది. రేపటిసభాశోభను వారు తప్పక యభివృద్ధిఁ గొందింతురు. ఇంక రోషనారతపన్నుగడలు సిద్ధింపవు. నడువుము. ఆరులట యుత్సవమునఁ దిరుగుచున్నసమయముననే మనము మందిరమునకుఁ బోయి మనప్రయత్నమున నుందము. లేకున్న మనయుపాయ మొక్కటియు నెఱవేఱదు. ప్రాతఃకాలముననే పాదుషావారిప్రాణములు........"

అటుపై యొక్కమాటయైనఁ జెప్పఁజాలక శీఘ్రముగ ముందు నడువ నారంభించెను. ఛత్రసాలుఁడు నామెవెంట నంటెను. కొంచెముదూర మేఁగినంత నతఁ డిట్లనెను:—

"కాని, యింతదనుక నీవెవరో నాకుఁ దెలియలేదు. పాదుషా ప్రాణరక్షణమునకై నీవింతగ నేలప్రయత్నించుచున్నావు?"

ఛత్రసాలునిగంభీరవదనముం గాంచి యామె యిట్లనెను. "దానికిఁ గారణమిదియే. అతఁడే నాసర్వస్వము. నేను తచ్చరణదాసిని. అతఁడు నాకుఁ బ్రాణాధికుఁడు.

ఛత్రి—నీపేరేమి! నీవెవరిపుత్త్రికవు?

వనిత—సార్వభౌమునిమందిరమున కెట్లువచ్చితినో నేను చెప్పఁజాలను. కాని, రాజమందిరమున నన్నందఱును అయేషాబేగం అని పిలుతురు.

ఛత్రి—ఐన నీవు యువరాజగు ముఅజ్జిమునకుఁ దల్లివా?

వనిత—అవును.

## పదునొకండవప్రకరణము.



జీవనమరణసంధి.

అట్లాయుద్యానమును వీడి అయేషాచ్ఛత్రిసాలు లిరువురును మీనాబజారుమార్గమునఁ గాక వేఱొకమార్గమున నయేషామందిరము దెసకు బయల్వెడలిరి.

కోలాహలమున నుత్సవము పెద్దగఁ దాండవించుచుండెను. ప్రాకారములోనికి కెలఁకులందలి యుద్యానములదాఁటి అయేషాబేగముమందిరపుఁ బ్రవేశద్వారముకడ నిలిచియుండిన యిరువురు యువతీమణులును గౌతుకముపొంగుచుండ ద్వారమువీడఁజాలక యొండొరులు మేలమాడుచు సంతసించుచుండిరి.

ఒక—నీవు నవ్వించుటచే నన్ను నేనే మఱచిపోవుచున్నాను. ఎట్లునవ్వింతునాయని యాలోచించుచు నీవుందువు. మందిరమున నెవరైనఁ బ్రవేశించినను మనకుఁ దెలియదని తోఁచుచున్నది.

రెండ—నీకు నవ్వకున్నను నోడలు తెలియుటలేదు. నీస్థితియే యటులున్నది. కులుకు మీఱినది.

మొద—నీకంటెనా? మాటిమాటికిని నవ్వువారికన్న నవ్వించువారికే యెక్కువయుల్లాస ముండవలయును. లేనిచో నడుగడ్డునకు నట్టిమాట లెట్లుస్ఫురించును!

రెండ—అది యుల్లాసముచేఁగాదు. అది నాబుద్ధి. నా తెలివి.

మొద—నీ తెలివి తెల్లవాఱెనులే! వదరుటయే తెలివియైనచో నాకును దెలివియున్నది.



రెండ—వదరఁగలవుగాని నావలె నవ్వింపఁగలవా! హాస్యమనిన నీకేమి తెలియును! అది నాకేచెల్లినది.

మొద—(నవ్వి) అబ్బో!—నేను నవ్వకున్నచో నీవు నవ్వించునదేమి! ఏదీ? ఈసారి నవ్వింపుము. చూచెదను.

రెండ—చూడుము.

మొద—నవ్వింపుము.

రెండ—చూడుము.

మొద—ఏమిచూడను! నవ్వింపుము?

రెండ—అద్దము తెత్తునా?

మొద—ఎందులకు?

రెండ—మఱి నీనవ్వు నీవెట్లుచూడఁగలవు?

మొద—(నవ్వును)

రెండ—అదినవ్వేనా?

మొద—(నవ్వుచు) ఓడిపోయితినే! మఱచిపోయి నవ్వినాను.

రెండ—అదియే దానిగుణము.

మొద—దేనిగుణము!

రెండ—దానిగుణము.

మొద—రాణిగారువచ్చుచున్నారే!

రెండ—నోరుమూసికొనుము.

మొద—ఏమి? అటుచూడుము.

రెండ—అదికాదు. వారు వచ్చునపుడు విచ్చలవిడిగ నవ్వినచో బాగుండదని యట్లంటిని.

మొద—(నవ్వుచు) ఓసి! నీ—ఆవచ్చురెండవవా రెవరో నీకుఁ దెలియునా?

రెండ—వారు—ఫలానావారు.

మొదట—సరిగఁ జెప్పుము.

రెండ—ఫలానా వారని చెప్పినను దెలియకపోయిన నేనేమి చేయుదును?

మొద—(నవ్వుచు)

అయేషాచ్ఛత్రిసాలురు ప్రాకారముదాఁటి చక్కనిమార్గమున నడచివచ్చుచుండిరి. ఇరుకెలంకుల మనోహరములగు తోఁపులు పుష్ప పరిమళముల వెదచల్లుచు సాయంతనమందమారుతమున మెల్లఁగ నిటునటు కదలు కోమలకుసుమలతాపరివృతములగు శాఖలచే రాణికి వీవనలు వీచుచుండెను. అపరిచితుఁడగు ఛత్రిసాలకుమారునికి సాదరముగ స్వాగతము నొసంగుచుండెను. మార్గము రాణిమందిరమునకే చెందినదైనను దనరాణిచేతఁగన్నఁ బరులచే నెక్కుడుమెట్టఁబడి విసువుచెందినదై వత్సరమునకు మూఁడునాల్గుసారులుమాత్రమే ప్రాప్తించు రాణిపాదస్పర్శమహాభాగ్యసౌభాగ్యమున సంతోషము వెదలఁగ్రిక్కుచున్నదో యన సాంధ్యకాంతిచే నామార్గము మధురరాగమున నలరారుచుండెను.

మాతాపుత్త్రులవలె వారిరువురును మందిరమును బ్రవేశించిరి. అతనిని వెంటఁగొని యామె యొకగదిలోఁ బ్రవేశించి యందొకమృదులాసనమున నాతని గూరుచుండఁజేసి తానును సమీపమున వేఱొకయాసనమునఁ గూరుచుండెను. పిదప నామె "మోతీ" యనిపిలువ నొకదాసి యేతెంచి యభివాదమొనరించి నిలిచెను. ముఅజ్జంకుమారునిఁ దోడ్కొనిరమ్మని యాదాసి కాజ్ఞాపించి యయేషా ఛత్రిసాలుని తో మాటాడుచుండెను.

విచ్చుకత్తులతోఁ గఠినహృదయులగు తాతారుస్త్రీలు ద్వారముల కడనిల్పి తానును బిజలీయును తనదాసియుఁ దప్ప తనయానతి లేక యట సంచరించువారిని చంపుట కాస్త్రీల కానతియిడి, తనసంకల్పము నతిగూఢముగఁ గాపాడుకొనుచున్న యారోషనారాకు సదర్పముగ నుత్సవమున సంచరించుతఱి నౌరంగజేబువిషయమున నెట్టి యనుమానముగాని భయముగాని కలుగుట కవకాశము లేకుండెను.

కాని, యంతగూఢముగ దాఁచిన యాఘోరవిషయము ముఅజ్జమునకు, అయేషాకు నింతలో నెట్లు తెలియఁగల్గెను!

బిజలీ రోషనారకుఁ జాలవిశ్వసనీయ. రోషనార యొనరించు ప్రతికార్యమునను బిజలీ యామెకు చాలఁగ నుపకరించుచుండెను. రోషనారయెడ నామె కెంతేని భక్తి. అంతభక్తిగలబిజలీ తనరహస్యమును వెల్లడించునని రోషనార యనుమానించుటెట్లు? బిజలీయును దాని నెవ్వరికిని జెప్పరాదని నిశ్చయించుకొనెను.

ఒకనాఁడు బిజలీ యేదియో మిక్కుటమగు చింతలో మునిఁగి యుండ నా మంత్రియుఁడగు ఖాన్‌జహాన్ ఆమె నిట్లు ప్రశ్నించెను.

"బిజలీ! ఏమట్లుంటివి? విశేష మేమైనఁ గలదా?"

బిజ—ఊరకే యిట్లుంటిని.

ఖాన్—అట్లుకాదు. ఏదియో విశేషమగు వ్యాకులత నీమొగమునఁ జూపట్టుచున్నది.

బిజలీమనసున కెద్దియో వేదనకలిగెను. ఆమె కాతనియెడ చాలప్రేమ. రోషనారయెడ భయభక్తులు; రోషనారరహస్యము నెవ్వరికిని జెప్పరాదని తలఁచినప్పుడు తనప్రియునిమాట నామె తలంపలేదు. ఇపుడాతనిమాట దీసివైచుట కామెకుఁ బ్రాణమొప్పుట లేదు. తుద కామె యిట్లనెను. "ఈవిషయమున క్షమింపుము. ఇది యొకరరహస్యము"

ఖాన్—బేగమువారి యాజ్ఞ కాఁబోలును! అట్లైన నిర్బంధింపను.

వాస్తవమున రోషనార బిజలీ కాజ్ఞ యొసఁగియుండలేదు. కాని, యామెకు బిజలీయం దెంతయో విశ్వాసము. బిజలీయును వాగ్దానమును జేసియుండలేదు. కాని, యామె రహస్యము వెలిపుచ్చరాదని మాత్రము నిశ్చయించుకొనియుండెను. బేగమువారి యాజ్ఞ కాఁబోలు నని ప్రియుఁడు పలికెను. అట్టియాజ్ఞ లేకయే యతనిమాట నిట్లు చుల్కనసేయుట కామెకు మన సొప్పకుండెను. చాలసేపు చింతించి యెట్టకేలకుఁ దనప్రేమాస్పదునకు రోషనారాసంకల్పవిషయము సర్వము నెఱింగించివైచెను. కాని, యానాఁడు బిజలీ కేమియు శాంతి లేకుండెను.

ఖాన్‌జహాన్ రాజోద్యోగి. అతఁడు మంచిగాయకుఁ డగుటచే ముఅజ్జ మప్పుడప్పు డతనిపాట కానందించి పారితోషికము లొసంగుచుండును. షాజహానునకు ముఅజ్జీమునెడఁ బ్రీతి; పాదుషాయెడఁ గృతజ్ఞత. తనప్రియురాలివలన నింతటిఘోరసమాచారము వినుటతోడనే—అలంఘీరుపాదుషా చంపఁబడునను కఠోరవార్త చెవులఁబడఁగనే—యాతఁ డింక సహింపఁజాలక ముఅజ్జీమున కెఱింగించివైచెను. కాని, బిజలీ కిది తెలియదు.

వెంటనే ముఅజ్జీ మాతురతతోఁ దనతల్లికడ కేఁగి యామెకీమాట తెల్పెను. వారిరువురును గొంతతడవు చింతించి తుదకుఁ బాదుషాను గాపాడునుపాయముల నాలోచింపఁ దొడంగిరి. మందిరమునఁ బ్రవేశించి పాదుషాను గలిసికొనువా రెవ్వరని వారు యోజించిరి. జయసింహునకు నియోగింపనెంచియు నాతఁ డావార్తవిని యెక్కువ దుఃఖించునే కాని, యాయాపదను దొలఁగించు ఘనకార్యమును నిర్వ



హింపఁదగినంతసాహస మతనికడ లేదని యెంచిరి. తుద కింక సామ్రాజ్యసభకై యేతెంచిన మహోదారులగు చంపతరాయచ్ఛత్రసాలురు దక్క వేఱెవ్వరును శరణ్యులు లేరని నిశ్చయించిరి. వారిసాహసౌదార్యములు తమ కుపకరించునని తలంచుచు వారిరువురును వారియన్వేషణమున బయలుదేఱిరి. ముఅజ్జీము జయసింహునిమందిరముకడ కేఁగెను. అయేషా స్వయముగ నుత్సవమున వెదకఁ బోయెను.

అయేషా ఛత్రసాలునటఁ గలిసికొని మందిరమునకుఁ గొనివచ్చెను.

ఆమందిరమున ముఅజ్జీమువచ్చువఱకు నయేషా ఛత్రసాలునితో రోషనార కావించిన దుర్మార్గతను, దాను పాదుషానుజూడకుండుటకుఁగావించిన యేర్పాటులు మున్నగు వృత్తాంతమునంతను దెల్పెను. తుద కీఘోరవార్త ఖాన్‌జహాన్‌వలనఁ దమకుఁ దెలిసినరీతిఁగూడఁ దెల్పెను. ఛత్రసాలుఁడు చాలవగచెను. పిదప నతఁ డిట్లనెను. "ఇంకను బాదుషావారు విస్మృతియందే యున్నారుకాఁబోలు! మత్తు విఱుచుట కొకమందు దెప్పింపవలయును."

ఇంతలో ముఅజ్జీమువచ్చి తల్లికి నమస్కరించెను. ఛత్రసాలుఁడు లేచి ముఅజ్జీమున కభివాద మొనరించెను. అయేషా యానతి నిరువురు నాసీనులైరి. పిదప నయేషా ముఅజ్జీమునకు ఛత్రసాలునిపరిచయ మొసంగెను. ఛత్రసాలునికడనున్న ఖడ్గమువలనఁ గార్యమంతయు నిర్విఘ్నముగ నెఱవేఱునని ముఅజ్జీమమితానందము నొందెను. ఇఁక విలంబమేలయని అయేషా యతని నొకవిశ్వాసపాత్రుఁడగు వైద్యునియొద్దనుండి మత్తువిఱిచెడిమందును దెమ్మని పంపెను. వేఱొకరితోఁ గార్యము చెప్పరాదనియు వైద్యునకు వార్తనంపి రప్పించి

యతనిచేతనే తెప్పించుటకుఁ జాలతడవగుననియు నయేషా ముఅజ్జీమునే పంపెను.

పిదప నయేషా ఛత్రిసాలునకు రోషనారమందిరమునఁ బ్రవేశించి పాదుషాగదిచేరువఱకును బోవలసినమార్గ మెఱిఁగించి యిట్లనెను.

“జాగరూకతతో మాత్రి మేఁగుము. నీకు జయము లభించుఁగాక! పెద్దభారము నీపైఁ బడవైచితిని. నిస్సహాయనై యిట్లుచేయవలసివచ్చెను. ఎట్లైనను నాకుఁ బతిభిక్ష నీవే పెట్టవలయును.

ఛత్రి—అట్లనకుఁడు. ఇందు నేను చేయునదేమి! అధర్మ మింతటిఘోరకృత్య మొనరించుచుండ దివ్యశక్తిసమన్వితమగు ధర్మ మూరక చూచుచుండునా! జయము ధర్మమునకే కలుగును. ఆమహాపతివ్రత గాంధారి యిపుడేలోకమున నున్నదో కాని ధర్మమునకు జయమగునని ప్రశస్తముగ నుచ్చరించినది. ఆమాట మనకు మిక్కిలి యాశాజనకముగ నున్నది.

ఆయ—అట్లు ధర్మమునకు జయము గూర్చుటకు నీవంటిమహాత్ములే యుదయించుచుందురు.

ఛత్రి—మనము కేవలము సాధనభూతుల మగుదుము. యంత్రములవలెఁ బనిసేయుదుమే కాని యందుఁ గార్యనిర్వాహ మొనర్చుశక్తి వేఱు. అవసరమైనపుడాశక్తి కొన్నిప్రకృతుల నావహించి జయమును గాంచుచుండును.

ఆయ—నీయౌదార్య మెఱింగియే నీసాయ ముపేక్షించితిని.

ఛత్రి—ఇది నాకర్తవ్యము; నావిధి.

ఇంతలో ముఅజ్జీము మందుగొనివచ్చెను. “ఇది త్రావించినచో మత్తు తగ్గించుటయే కాక దాహముతగ్గించి వెంటనే శక్తినొసంగునఁట.” అని పలుకుచు ముఅజ్జీము తనతల్లిచేతి కామందు నిచ్చెను. ఆమె యొకసారిచూచి ఛత్రిసాలుని కిచ్చెను. ఇంతలో ముఅజ్జీ మిట్లు పలికెను. “రోషనారాబేగ మిప్పుడే యుత్సవమునుండి మందిరముదెస కేఁగినది. మనకార్య మెప్పుడు నిర్వహింపఁదగునో మఱి!”



అదివిని వారు మిగులఁ గలఁతఁజెందిరి.

అయే—“ఆమె యింకను రాదుగదా, మనకార్య మిప్పుడే తీర్చుకొందమ” ని యెంచితినినుమా నేను! ఇప్పుడు చేయఁదగినదేమి—సోదరా! నామనసు శాంతివీడినది. ఏమొనర్పఁదగునో నీవే యోజింపుము.

ఛత్రి—రోషనారాబేగము రాత్రియంతయుఁ బాదుషావారి కడనే యుండునా!

అయే—రాత్రి తనశయనాగారమున సుఖముగ నిద్రించి యుదయమున వచ్చును.

ముఅ—అంతసురక్షితముగఁ జికిత్సాగృహమును గాపాడుచున్నయామె రాత్రికూడఁ దనసుఖ మేలపాడుచేసికొనును? రాత్రి యెనిమిదిగడియలగుసరి కామె శయనాగారమున కేఁగును. అదియే మన కార్యము సాధించుట కనుకూలసమయము.

ఛత్రి—(ఆలోచించుచు) అటులైన నర్ధరాత్రిమున నేఁగినచో బాగుండును.

ముఅ—అవును. తలుపులు తెఱచియుండును. మీకడ వలసినఖడ్గమున్నది. జనసంచారము తగ్గును. నిరాఘాటముగఁ బోవచ్చును—నేను మీకెట్టిసాయ మొసఁగవలయును?

ఛత్రి—మీరొకపల్లకిని నేనచటికిఁ బోవునప్పటికి సిద్ధము చేయుఁడు.

ముఅ—సరే.

ఛత్రి—రోషనారకాక పాదుషా వారియొద్ద మఱియెవ్వరు నుండరా?

ముఅ—బిజిలీయను నొకదాసి యుండుట వాడుక.

ఇట్లు వీరు సంభాషించుకొనుచుండ మరల మోతీవచ్చి యెవ్వరో ముఅజ్జం కుమారునితో మాటాడవచ్చెనని చెప్పి యొకచిన్నపత్రము నిచ్చెను. దానిపై ఖాఁజహాన్ నామము చదివికొని వెంటనే ముఅజ్జం మాతనిని వేఱొకచావడిలోనికిఁ గొనిరమ్మని దాసి కాజ్ఞాపించి యిట్లనెను. "ఇపు డతఁ డెందులకువచ్చెనో నేనుబోయి కనుఁగొని వచ్చెదను. మీ రాలోచించుచుండుఁడు" అని యాతఁడు త్వరితముగ వెడలిపోయెను. అపు డయేషా ఛత్రిసాలునితో నిట్లనెను.

"ఈవచ్చినయాతఁడేసుమా మాకీరహస్యము నెఱింగించిన ఖాఁజహాను!"

ఛత్ర—అటులనా! ఇంక నేదియో యీసందర్భమునసే తెలుపవచ్చినట్లు తోఁచుచున్నది.

ఆయ—కావచ్చును.

ఛత్రిసాలుఁడు గాఢాలోచనమున మగ్నుఁడయ్యెను. అయేషా యతని నేమియుఁ బలుకరింపలేదు. కొంచెముతడవునకు ముఅజ్జం మరలివచ్చి "బిజలీకి జ్వరమువచ్చెనదఁట. ఆమె నేఁడచటి కేఁగలేదఁట" యని సంతోషమునఁ దెల్పెను.

నాఁటియశాంతి బిజలీకి జ్వరముంగూర్చెను.

ఛత్రసాలుఁ డింకను రాలేదేమని చంపతరాయ లనుకొనుచుండ నింతలో ఛత్రిసాలుఁ డేతెంచెను. జయసింహుని యాదరసత్కారములంగొనుచుఁ జంపతరాయాదులు భోజనాదికములఁ గావించుకొనిరి.



రాత్రి పదిగడియలాయెను. సామాన్యమగు వేషముధరించి రోషనారబొమ్మఁగల ఖడ్గము మొలను వ్రేలాడ వింధ్యవాసినికి నమస్కారము గావించి నిగర్వమగు నాత్మవిశ్వాసమున ఛత్రిసాలుఁడు కార్యదీక్షాపరతంత్రుఁడై జయసింహునిమందిరమునుండి బయలుదేఱెను. వడివడినడకతో నతఁడు మొదట నయేషామందిరమునకేఁగెను. కొంతతడవున కతఁడు ముఅజ్జముతోఁ గలిసి మాటాడుచు నటనుండి బయలుదేఱెను. ఒకచో నాపి, ముఅజ్జము తానంతకుముందుగనే సిద్ధపఱిచియుంచిన పల్లకిని చెట్లమాటునుండి సేవకులచేఁ దెప్పించెను. ఛత్రిసాలుఁ డందెక్కెను. ముఅజ్జమునుండి యతఁడు సెలవుగైకొనెను. ముఅజ్జము వెడలిపోయెను. ఛత్రసాలునిపల్లకి తిన్నఁగ నటనుండి సాగిసాగి తార్తారుస్త్రీలు విచ్చుకత్తులూని కాపుఁగాయుచున్న యీమందిరమునకుఁ గొంతదూరమున నాగెను. ఛత్రిసాలుఁ డందుండి దిగి తనవెంటవచ్చిన ఖాన్‌జహానుతోఁ బల్లకిని సమీపమునసే యుంపుమనిచెప్పి తిన్నఁగఁ బ్రాకారద్వారముం జేరెను. అచటఁ గొందఱుఖోజ్జాలు విచ్చుకత్తులతో నిల్చియుండిరి. ఛత్రిసాలుఁడు వారితో గంభీరముగ "దారివిడువుఁడు" అని పలికెను.

అందు ఘో[illegible]దుఖా నిట్లు పలికెను:—"రోషనారాబేగ మనుమతిలేనివా రిందుఁ బ్రవేశింపరాదు."

ఛత్రిసాలుఁడు కత్తిఁజూపుచు నిట్లుపలికెను:—"ఇదిగో! అనుమతి కానవాలు"

దీపములవెలుఁగునఁ గత్తిపై రోషనారబొమ్మ ధగధగ మెఱసెను. వారందఱును దమమొత్తి నకత్తులదింపి ఛత్రిసాలునకు సలాములు చేసిరి.

తిన్నగ నాతఁడు సింహద్వారముం జేరెను. అచట నలువురు

స్త్రీలు నిలువఁబడియుండిరి. మఱికొందఱు సంభాషించుచుఁ గూరుచుండిరి. అందఱిచేతులలోను గరాళఖడ్గము లున్నవి. ఛత్రసాలునిఁ జూచి యెల్లరు లేచి నిలిచిరి. "రోషనారబేగం అనుమతిలేనివా రెవ్వరును రాఁగూడదు" అని యొకతె పల్కెను. అతఁడు మరల ఖడ్గముపై బొమ్మచే వారినోళ్లు మూసెను. ఎల్లరును గత్తులవ్రాల్చి సలాములుచేసిరి.

ఇట్లు నాల్గుద్వారములుదాఁటి ఆయేషాచెప్పిన ట్లొకపెద్దచావడి కొకమూలఁ బాదుషాచికిత్సాగృహముం గాంచెను. గుమ్మముదాఁటి యడ్డుగనున్న తెరయెత్తిగించుకొని యతఁ డాగదిలోఁ బ్రవేశించెను. ఒకప్రక్క నొకమంచముపై మహాసామ్రాజ్యాధిపతి స్మృతిలేక పడియుండెను.

ఛత్రసాలునికిఁ గన్నులనీరు గ్రమ్మెను. ఉపచారముసేయుట కెవ్వరు నచట లేకుంటచే నతనికి విచారము, సంతసముగూడ నొదవెను. అతఁడు పాదుషాను సమీపించెను.

ఫౌలాదుఖాను ద్వారముకడ ఛత్రసాలునికత్తింజూచి గతిలేక విడిచెనే కాని యంతకుము న్నెన్నఁడు రోషనారకడకు వచ్చియుండని యాక్రొత్తయువకుఁ డిపు డర్ధరాత్రమున రానేలయని యనుమానించెను. ఆకత్తి యెట్లువచ్చెనోమాత్ర మతనికిఁ దెలియదాయెను. కొంచెముసేపు యోజించి యావార్త బేగముతోఁ జెప్పుటయే శ్రేయస్కరమని యెంచెను. రోషనార కావించు గుప్తసభమాట యాతని కొక్కనికే తెలియును. అతఁడు వెంటనే గుప్తసభ దెసకుఁ బరుగెత్తుకొని పోయి "హుజూర్! ఎవ్వరో యొకక్రొత్తయువకుఁడువచ్చి మందిరమున బ్రవేశించె" నని పలుక "నెవరది" యని యాశ్చర్యపడి రోషనారా త్వరితముగ ఫౌలాదుఖానుతో మరల నిట్లనియెను.



"అతనిని మీ రేల పోనిచ్చితిరి! నాయనుమతిలేక వచ్చినవారిని వధింపుఁడని నేనాజ్ఞాపించితినిగదా!"

ఫౌలా—దేవివారిబొమ్మగలకత్తిని జూపినాఁడు. బేగమువా రానవాలిచ్చి యెందులకైనఁ బంపినారేమో యని విడిచితిమి. కాని మున్నెన్నఁడు నేనతనినిఁ జూడకుండుటచే సందేహముగలిగి మనవిసేయవచ్చితిని.

రోష—కత్తియా! ఎవ్వఁ డామోసగాఁడు?

ఫౌలాదుఖానువచ్చుసరి కామె సభచాలించి వచ్చుచుండెను. ఇప్పు డామె క్రోధముచే శరవేగమున మందిరమునకు వచ్చెను. చికిత్సాగృహమున ఛత్రసాలుఁడు చేతులుగట్టుకొని పాదుషాముఖమును దిలకిం[illegible] ఇంతలో నతనికిఁ బదధ్వని వినఁబడెను. త్వ[illegible]ల సమీపమయ్యెను. ఒకక్షణములో "ఎవరది" యను నొకగభీరకంఠధ్వని యతనికి వినవయ్యెను. వెంటనే యతఁడు దీర్ఘుఁడై ద్వారముదెసఁజూడఁ దెరఁదోసికొని యొకభీకరసుందరస్త్రీమూర్తి క్రోధభరితలోచనయై లోనఁజొచ్చెను. ఆమె కిరుప్రక్కల నిరువురంగరక్షకు లుండిరి. అతఁ డామెనుజూచి యిట్లనెను.

"తమరేనా రోషనారాబేగం! బంద్గీబేగంసాహబా!"

రోష—నీవెవ్వఁడవు!

ఛత్ర—నేనా! ఈబానిసదేశములో నివసించు నొకమానవమాత్రుఁడను.

రోష—సరిగ వచింపుము. నీవెవ్వఁడవు? ఇచటికెట్లు రాఁగలి తివి?

ఛత్ర—ద్వారములన్నియు దాఁటి సరళమగుమార్గముననే రాఁగల్గితిని.

రోష—ఇంతమంది కావలికాయుచున్న యీద్వారముల నీ వెట్లుదాఁటివచ్చితివి?

ఛత్రి—రావలెనను నిచ్ఛయుండినఁ గావలివాండ్రడ్డగింపఁగలరా?

రోష—వెఱ్ఱిసమాధానములఁ జెప్పకుము. రోషనార సామాన్యవనిత కాదని యెఱుంగుము. ఇప్పుడు నీ వొకపెద్దయపరాధ మొనరించితివి. నాప్రశ్నలకు సరియగుప్రత్యుత్తరముల నొసంగుము. నిన్నడ్డగించినవారి నెట్లుమోసగించితివి?

ఛత్రి—బేగంసాహబా! నేనా మోసగించువాఁడను? మోసగించుట—అది యెట్లో నాకుఁ దెలియదు. కత్తులదింపి సలాములు చేసి యందఱును నన్ను లోనికి సాగనంపిరి.

అడిగినప్రశ్నకు సరియగుసమాధాన మతఁడు చెప్పకుండుటచే నామెకుఁ గ్రోధము హెచ్చెను. అతనిని జంపవలయుననికూడ నామె యెంచెను. కాని, రోషనార మూర్ఖురాలుకాదు. ఆమె యతనివలనఁ దెలిసికొనవలసినది చాలఁగ నుండెను. అంతగుప్తముగ దాఁచిన తనసంకల్పము పొక్కెనేమోయని యామె యనుమానించెను. ఇంకను దనసంకల్ప మెవ్వరికి వెల్లడియయ్యెనో తెలియదు. అది తెలిసికొనకుండ నతనిని జంపినచోఁ దనయుద్దేశము నిరాతంకముగ నెఱవేఱు నెట్లు? పాదుషా రోగమువలననే మరణించెనని యెల్లరికి నమ్మిక గలిగింపవలయును. అట్టియెడఁ దనచర్య కొందఱికిఁ దెలిసినను దానూరకుండుట శ్రేయముకాదే! ఇంతకు నాయువకునకుఁ దనసంకల్పము తెలిసియే వచ్చెనో వేఱొకకార్యమునకై వచ్చెనో మొదట నెఱుంగవలయును. అతనివచనము లన్నియు వినినవెనుక నావశ్యకమైనచో నిస్సహాయముగఁ దనయింటనున్నకుఱ్ఱనిఁ జంపుట యెంతపని! క్షణమాత్రములో నాయువతి మనోవీథి నీభావపరంపరయెల్ల నొక్కమారుగ దళుకుతళుకున మెఱసెను. తొందరపడక యామె యతనిప్రత్యుత్తరము లన్నియు వినఁగోరెను.



ఛత్రిసాలున కామెయెడ సేవగింపు కలదు. తలవనితలంపుగ నామె యకస్మాత్తుగ వచ్చుటచే నతనికి మొదట నాశ్చర్యముకలిగెను. చంపుట కుద్యమించునని యతఁ డొకసారి తలఁచెను. కాని, తననుండి సమాచార మెఱుఁగకయే చంపఁబోదని యాబుద్ధిమంతుఁడు గూడ నూహించెను. కనుకనే యాతఁ డంతయుద్ధతముగ మాటాడుటకు వెనుదీయలేదు.

రోష—నీవిచ్చటి కేలవచ్చితివి?

ఛత్రి—దర్శనములభించినఁ మీతోడను లేనిచో బాదుషావారితోడను మాటాడఁగోరి వచ్చితిని.

రోష—అంతమాటాడవలసినపని యున్నచో రేపు పగలువచ్చినచో సావకాశముగ మాటాడవచ్చునే. ఇంతరాత్రివేళ నిక్కడకు రానేల! ఇప్పుడు తొందరయేలకలిగెను?

ఛత్ర—తొందరయే కలిగినది. రేపు పాదుషావారు మరణించినవెనుక వచ్చి చేయునదేమి?

రోష—ఏమి! నీకెవరుచెప్పిరి? రేపు పాదుషా మరణించునా?

ఈవచనములు పలుకునపుడు బేగముసంభ్రమమునకు మేఱలేకపోయెను.

ఛత్రి—అట్లే తెలిసినది.

రోష—నీకెవరుచెప్పిరి?

ఛత్రి—మీరుదాఁచినను భగవంతుఁడు దాఁచినాఁడుకాఁడు. ఇక్కడ సంచరించునేగాలియో మాచెవులఁ బడవైచినది.

రోష — ఏమిది ! నేను దాఁచుటయేమి ! నీవెవరితో మాటాడుచుంటివో తెలియునా ? సామ్రాజ్యమునంతను దనపిడికిట నిమిడ్చికొనియున్న రోషనార నీయెట్టయెదుట నిలిచి ప్రశ్నింప సరియగుప్రత్యుత్తరముల నొసంగకుండుటయేకాక యిట్టియనుచితప్రలాపములనాడుటకు ఫలమేమగునో యెఱుంగుదువా ? జాగ్రత్త ! అర్ధరాత్రిమున నేను లేనపుడు రోగగ్రస్తుఁడగు పాదుషానిదురించుచుండ వారిచికిత్సాగృహమునకు ద్వారరక్షకులను మోసగించి యేతెంచుట ఘోరతరమగు నపరాధము. అటుపై నాప్రశ్నలకు సరియగుసమాధానముల నొసంగకుండుటయు, నన్ను ధిక్కరించిపలుకుటయు గొప్పతప్పులు. వీని కన్నిటికిఁ దగినశిక్ష నొసఁగుటకు ముందు నాప్రశ్నల కనుకూలప్రత్యుత్తరముల నిమ్ము. అవి నాకుఁ దృప్తిఁగూర్చిన సరియే. లేదా యైదు నిముసములలో నీపని తీఱును.

ఛత్రి — మీప్రశ్నలకు సమాధాన మిచ్చుటకు సిద్ధముగ నున్నాను.

ఎటులైనఁ బాదుషా లేచువఱకుఁ బాముచావకుండఁ గఱ్ఱవిఱుగకుండ ఛత్రసాలుఁడు బేగమును మాటలలో నుంచుట మంచిదని యెంచెను. రోషనార యొకకుర్చీకడకేఁగి యందుఁ గూర్చుండెను. ఛత్రిసాలుఁ డామెయెదుట నిలిచెను. అంగరక్షకు లామె కెలంకుల నిల్చిరి. రోషనార యిట్లుప్రశ్నించెను.

“అగోచరమగు భవిష్యద్గర్భమునఁ గలపాదుషాజీవనమరణవిషయము నీవెట్లు నిర్ధారణ సేయఁగలవు?”

ఛత్రి — బేగంసాహెబా! నేనది నిర్ధారణ మొనర్చుటలేదు. కాని, యీసమయమున మీప్రశ్నల కుత్తరములిచ్చుటకై యిచ్చటికి నేనేతెంచినకారణముననే పాదుషావారికి మరణము తప్పినదని నా



నమ్మిక. రేపువచ్చినచో వారు మరణించియుందురు. కాని, భగవత్సంకల్పము విరుద్ధమగుటచే నేనిప్పుడే వచ్చితిని.

రోష — సరళముగఁ బలుకఁజాలవా! — నీవు రాకున్నచో వారు రేపుమరణింతురనుటకు రోగమంత హెచ్చుగ లేదే! నీకు నిదర్శనమేమి? నీరాకచే నది యెట్లునిల్చును?

ఛత్రి — మహారాజ్ఞీ ! మరణించుటకురోగ మొందులకు ! కావలెననిచచ్చువారికిని బరులచేఁ జచ్చువారికిని రోగ మక్కఱలేదు. అట్టి మరణములు మాన్పుటకుఁగూడ సాధ్యములే. ఆధైర్యముననే నేనిటు వచ్చితిని.

రోష — పాదుషా స్వయముగ మరణించుననియా నీయభిప్రాయము ?

ఛత్రి — కాదు. బేగంసాహెబా —

రోష — ఛీ ! ఇట్టియవమానకరములగు మాటలాడకుము. ఎవ్వరిని లోనికిరానీయక నేను స్వయముగ నుపచారములు సేయుచుండ వారిని జంపువా రెవ్వరని నీయభిప్రాయము ?

ఛత్రి — ఔను. దేవీ ! ఎవ్వరును లోనికైన రాకుండ, నెల్లపుడు మీరే యుపచార మొనర్చుచుండ నిఁకవీరికి విషమిడ సంకల్పించువా రెవ్వరుందురు ?

రోష — విషమా ! విష మీయఁబడునని యెవరుచెప్పిరి ?

ఛత్రి — నాకయేసాబేగమువారు స్వయముగఁ దెల్పిరి. వారే నన్నిచ్చటికిఁ బంపినారు.

ఈసమయమునఁ బాదుషా కొంచెము కదలుట ఛత్రిసాలుఁడు కాంచెను. కాని, రోషనార చూడలేదు. ఛత్రిసాలుఁ డాఁగక యిట్లు

పల్కెను:— "విషప్రయోగము చేయఁబడనున్నదని వారు నాకుఁ దెల్పిరి. అది తప్పించుటకై నేనిటకు వచ్చితిని!"

రోష— ఎవరు ప్రయోగింతురని తెల్పినది?

ఛత్రి— మేల్కని నిదురనటించువారిని బాధించినఁగాని వారు లేవనొల్లరు. దేవీ! మీరే ప్రయోగింతురఁట.

రోషనారకన్నులు రోషభరితము లైపోయెను. వెంటనే యామె యిట్లనెను:— "ఏమి! ఛీ! ఊరకుండుము— ఆఁగుము." అని కొంచెము కుదుటఁబడి పిదప నిట్లనెను. "నీకయేషా చెప్పినదా! జ్ఞప్తినుంచుకొనుము. మకుటసింహాసనము లిప్పుడు నాయాధీనమున నున్నవి. పాలనమంతయు నేనొనర్చుచున్నాను. అయేషాకిది సహింపఁజాలక యిట్టియర్థము లేనిదుర్వార్తను గల్పించి యేమియు నెఱుఁగనినిన్ను నామందిరమునకు బలిపెట్టుటకై పంపినది. ఆమె యౌరంగజేబుభార్యకదా! ఏమియో లాభము చేకూరునని చిన్నతన పుటూహచే నీవు సాహసించితివి. నీపనులయందును మాటలయందును జిన్నతనము కనఁబడుచున్నది. నేనయేషానుగూర్చి మొదటనే యనుమానించితిని. అది తెలిసికొనుటకే యింతవనుక నిన్నుఁ బ్రశ్నించితిని! అయేషా చెప్పిన నీవు నమ్మితివి! సరే!— నీవు రానేవచ్చితివి కావున నొకమాటఁ జెప్పెదవినుము."

ఛత్రి— సెలవిండు.

పాదుషా యింకను లేవలేదేమనుశంక ఛత్రసాలుని బాధింపఁ జొచ్చెను.

రోషనార తనసంకల్పము వెల్లడియయ్యెనని యెఱింగి మితిమీరినయాశ్చర్యము నందెను. బిజలీపై నామె కనుమానము కలుగకపోలేదు. ఛత్రసాలునుండి యామెకుఁ గావలసినవిషయము తెలిసినది.



అయేషాకే తనసంకల్పము వెల్లడియయ్యెను. ఇంకఁ జేయునదేమి? ఆమెమనసు చాలఁ బ్రతిభావంతము. ఛత్రసాలునివలన వలసినది తెలిసినను వేఱొకపనికై యతనితోడిసంభాషణ మామె పెంచెను. అయేషా నెట్లైన వంచించి యామెకు ముప్పు దెచ్చుటకు భేదోపాయమున ఛత్రసాలుని నియోగింప వీలుకలుగునేమో యని యత్నింపఁగోరి యతనిని లోఁబఱచుకొనుటకై యామె శాంతముగ మాటాడెను. లోఁబడనిచో నతనినిఁ జంపుటకే నిశ్చయించెను. రోషనార యిట్లనెను:— "విషముమాట నాపై నారోపించుట తప్పు కాని, నీవాసపడి వచ్చితివి. కావున చెప్పుచున్నాను. బాగుగ యోచించుకొనుము. నాయనుగ్రహముం బడసితివేని గొప్పపదవి నొసంగుటకును వలసినచో గొప్పభూభాగముం గూడ నొసంగుటకును నాకధికారమున్నది. ఏమిసేయుటకైన నాకు సామర్థ్యమున్నది.

ఛత్రి— కావుననే యింతరాత్రివేళ రావలసివచ్చినది.

రోష— తప్పుచేసితివి. ఐనను నీకు భయము లేదు. నేను క్షమించితిని. రేపే సామ్రాజ్యసభ.

ఛత్రి— కనుకనే యిపుడువచ్చితిని.

రోష— సరియే. సభలో నీకొకపదవి లభించును. నీవెవరవో చెప్పుము.

ఛత్రి— అటులైనఁ బాదుషావారు సభకురారా?

రోష— పాదుషావలన లభింపనున్నది నావలననే నీకు లభింపఁగలదు. ముసలిఁ బాదుషామాట నీకేల! వారస్వస్థతగ నున్నారు.

ఛత్రి— కావలసినది నేనే సంపాదించుకొనఁగలను. నాకంతమునఁ బ్రాణముండ నాకెవ్వరియనుగ్రహము నక్కఱలేదు. కాని, పాదుషావారు సభకురారా?

రోష—ఎవ్వరియనుగ్రహము నక్కఱలేదా? కాని, యింతటి విషమావస్థయందు నాకడకే తెంచితివి కావున నాయనుగ్రహమో, నాగ్రహమో, యేదియో యొకటి స్వీకరింపక నీకుఁదప్పదు. యోజించుకొనుము. నాదయకుఁ బాత్రుఁడవైతివేని ధన్యుఁడవు. లేదా, యీక్షణముననే వందలకొలఁదిఖడ్గములు నాయాజ్ఞను బాలించుటకు సిద్ధముగనున్నవి. నీవొంటరిగ వచ్చితివి. ఎంచుకొనుము. అనుగ్రహమా, ఆగ్రహమా? సంపదయా, మరణమా?—

ఛత్ర—దేవీ! నాస్థితి నేను బాగుగ నెఱుంగుదును. ఆకత్తులన్నియు నేను చూచియే వచ్చితిని. కాని, మీరు నాయెడఁ గ్రోధముందాల్పక పాదుషావారియెడఁ బ్రేమచే వచ్చిననాకు సరళమగు సమాధానము ననుగ్రహింపకుండుటకు హేతువు నాకేమియు నగపడుట లేదు. ఇపు డేమంతవిషమస్థితి వచ్చినది! ఎవ్వరికిని హానిచేయుటకై నేను రాలేదు. అయేషాబేగమువా రనుమానించిన దుస్సంకల్పము లెవ్వియు మీకు లేనపుడు ఇఁక వైషమ్య మేమున్నది?

రోష—నీవెవరవో సరిగఁ దెల్పుము?

ఛత్ర—నేను మహీబాపాలకులగు చంపతరాయల కుమారుఁడను; ఛత్రసాలుఁడను.

రోష—(ఆశ్చర్యమున) మహీబాఛత్రసాలుఁడవా నీవు!—ఛత్రసాల్! నీవే అయేషామాటల నమ్మితివా! నాపై నింద్యమగుశంక మారోపింపఁబడినది. దీనికి నేను ప్రతీకార మొనర్పవలయును.- కాని, ఛత్రసాల్! ఒకవేళఁ బాదుషాకు విషమీయఁబడుట సత్యమైనను నీవాతని రక్షింపవచ్చుటయం దర్థమేమి? పాదుషా మీకు గర్భశత్రువుకదా! అతఁడు మీసేనను నష్ట[illegible] నిక్కె



యభినివేశమేమి? ఇప్పు డట్టిదేదియు లేదుకాని, యట్లగుట సంభవమని నమ్మినను, నీవు పూనుకొనవలసిన పనికాదే!

ఛత్ర—బేగంఆలియా! మాశత్రువులను మేము స్వయముగ ధర్మసంగరమునఁ బరాక్రమముచే నిర్జించి మాకార్యఫలములఁ బడసి తృప్తినందుదుమేకాని మాశత్రువైన నిట్లమానుషముగ వధింపఁబడునపుడు సామాన్యమానవసోదరత్వ మెంచి మేము వారిని గాపాడ మాప్రాణములనైన నొడ్డుటకు సిద్ధపడుదుము. అదికాక, అయేషాబేగము నాకుఁ దోరముఁగట్టినది. కావున నామెకు సాయమొనర్చుట నాధర్మము.

రోష—పాదుషా మీబుందేలఖండమునకు స్వాతంత్ర్య మీయకున్నచో మీరేమిచేయుదురు?

ఛత్ర—మొదటినుండియు మేమేమార్గమున గెలుతుమని యాసించుచుంటిమో యాధర్మమార్గమే మాకెప్పటికి ననుసరణీయము. యుద్ధ మొనరించి సంపాదింతుము.

రోష—సేనలఁ గోల్పోవరా?

ఛత్ర—కర్తవ్యముకొఱకుఁ గోల్పోవుదుము.

రోష—అట్టినష్టము లేకయే మీకు స్వాతంత్ర్యము లభించిన?

ఛత్ర—పాదుషాయిచ్చినచో సంతసమే. కాని, యట్లు జరుగుట కష్టము.

రోష—ఛత్రసాల్! నీకాస్వాతంత్ర్యము నేనొసఁగెదను. నీవిపుడు వెడలిపోయెదవా?

ఛత—పాదుషావారు జీవించియుండ నిఁక మీరు నాకు స్వాతంత్ర్యమొసఁగనేల? మీరు నాకేమియు నీయవలదు. ఎటులైన నేను వెడలిపోయెదను. మీవాగ్దానమునకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. మా

దేశమున కిపుడశ్రమమున స్వాతంత్ర్యము లభించినది. కాని, దానిని ధర్మమునకై యాహుతి యొనర్చుచున్నాను. నేను బుందేలుఁడను. చంపతరాయలకుమారుఁడను. ధర్మమే నాజీవితాదర్శము.

రోష—అట్లైన నీవెందులకువచ్చితివి?

ఛత్ర—పాదుషా వారిని గొనిపోవ వచ్చితిని.

రోష—మరలఁ బాదుషాయందువేమి! అతఁ డివు డెట్లు వచ్చును?

ఛత్ర—నేను తీసికొనిపోవుటకే వచ్చితిని. తప్పక తీసికొని పోయెదను.

ఇఁక రోషనారరోష మాఁగినదికాదు. ఆతని యౌద్ధత్యమును సహింపఁజాలకయుఁ దనయత్నము నిష్ఫలమగుటచేతను, ఇమిడియుండినక్రోధము నంతను వెడలఁగ్రక్కుచు నిట్లుపలికెను. “ఓరీ! నిర్భాగ్యుఁడా! ఎన్నిచెప్పినను నీకు బుద్ధివచ్చుటలేదు. నీమొండితనమునకు ఫల మనుభవింపుము. (బిగ్గరగా) రహమత్ ఖాఁ! (ఛత్రసాలునితో) నీదేవునిఁ బ్రార్థించుకొనుము. నీమరణ మాసన్నమైనది.”

ఛత్రసాలుఁ డేమిచేయుటకో తనగుప్తఖడ్గముపైఁ జేయినిడికొని యుండెను. “వింధ్యవాసినీదేవికి జయము” అని పాదుషావంకకుఁ జూచుచు నతఁడు పలికెను. దేవతాప్రార్థనమని యామె తలంచెను. పాదుషా రోషనారదెస కొకసారి చూచి మగతతో నిస్తేజమగు తన దృష్టిని మూసెను. ఆక్షణముననే రహమత్ ఖాను వచ్చి యామెకు సలాముచేసెను. ఆమె “రహమత్ ఖాఁ! వీనిని గొనిపోయి” యనుచుండఁ బాదుషామూల్గెను. వెంటనే యతనిని బొమ్మని రోషనారా సైగచేసి యచ్చెరువుతోఁ బాదుషావంకఁజూచి, ఛత్రసాలునివంకఁ గోపదృష్టింబఱపి మందులపెట్టెకడకుఁ బోవుచుండ ఛత్రసాలుఁ డిట్లనెను.



“మీరు మత్తుమందు దొసఁగుటకుమాత్రము శ్రమపడకుఁడు. మీరు వచ్చుటకుముందే విఱుగుడుమందు నిచ్చితిని. మీమందిపుడు పని చేయదు.”

రోషనారకోపము మితిమీఱెను. ఏమిచేయుటకు నామెకు స్వస్థత లేకపోయెను. మరల నామె రహమత్ఖానును బిలువ నక్కడనే నక్కియుండిన యతఁడు వచ్చెను. ఆమె యొకపాత్రముంగొని వేగముగ వచ్చెను. “ఖాఁ! ఇతనిని బంధింపుము” అనియెను. “ముట్టకుము” అని ఛత్రసాలుఁడు గంభీరముగఁ బలుక వాఁడు రోషనారావంకఁ జూచెను. “పదిమందిఖడ్గధారులను గొనిరమ్ము” అని రోషనారా పలుక నతఁడు వెడలిపోయెను.

“దేవీ! నాయాత్మరక్షణమునకై కత్తిదీయకతప్పునట్లు లేదు. క్షమింపుఁడు” అనుచు ఛత్రసాలుఁడు దంతపుపిడికత్తిని వెలువఱుప నాశ్చర్యముతో రోషనార యిట్లనెను. “ఆకత్తి నీకెక్కడిది?”

ఛత్ర—చెప్పితినిగదా నాకుఁ గావలసినది నేనే సంపాదించుకొందునని! ఇది యట్టిదే!

రోషనార మనమున భయము, క్రోధము, ఆశ్చర్యము, దుఃఖము నన్నియు నల్లరిచేయఁజొచ్చెను.

ఛత్రసాలునకుఁ జాలవికటస్థితి సంప్రాప్తమైనది. పాదుషా వెంటనే మేల్కనినచో ఛత్రసాలునకు క్షేమము. లేవకముందే రోషనార పదిఖడ్గములచేఁ దానాక్రమింపఁబడును. అప్పుడు వధలను గావింపవలసివచ్చును. కత్తులు వచ్చుచున్నవి. పాదుషా లేవలేదు. ఛత్రసాలున కేమియుఁ దోఁచలేదు. గట్టిగ మాటాడినఁ బాదుషామగత తగ్గునేమోయని యతఁడుబిగ్గరగ నిట్లనెను:—“ద్రోహము! ద్రోహము! జహాపనాహ్! ప్రాణనష్టము! సామ్రాజ్యనష్టము! సర్వనాశనము!”

ఇంతలో రహమత్ ఖాఁ ఖడ్గధారిణులతో వచ్చెను. ""నాశనము నాశనము!" అని ఛత్రసాలుఁడు సింహనాదము సేయుచు గుఱ్ఱెట్టుఁజేసి సిద్ధముగ నిలిచెను. అదివిని యెల్లరును మొదట నోహటించిరి. రోషనారా ""అతనిని గదలనీయకుఁడు" అనెను. వారు మీఁదికిఁ రాఁబోవుచుండ ఛత్రసాలుఁడు ""జాగ్రత్త!" యని ""జహాపనాహ్! ద్రోహము! నాశనము!" అని యఱచెను. అపుడు పాదుషా యులికిపడి కన్నులు తెఱచి ""యెవరది" యని యాశ్చర్యమునఁజూడఁ దార్తారు స్త్రీలు ద్వారమును దాఁటుచుండిరి. రోషనార యొకగవాక్షమున వంగుచుండెను. విచ్చుకత్తినూనిన ఛత్రసాలుఁడు సలాముచేసి కత్తినోఱలోనుంచి యెదుట నిలిచెను. పాదుషాకుఁ గన్పడకుండఁ దలవైపున రహమత్ ఖా నొక్కఁడు నిలిచియుండెను. భయభ్రాంతుఁడై పాదుషా యిట్లనెను. ‚ఏమియీయల్లరి? నీవెవరవు?—రోషనారా!"

ఛత్ర—మహాప్రభూ! నన్నుమానింపకుఁడు—అనుచుండ రోషనార పాత్ర నాపెరటిలో నొకచోఁ బాఱవైచి రిత్తచేతులతో వడివడిగ వచ్చుచు, ""జహాపనాహ్! చూచితిరా యీద్రోహిని" అనియెను.

పాదు—ఇస్!—ఇదియేమి!—రోషనారా!

రోష—ఇతఁడు నన్ను మందీయనిచ్చుటలేదు.

పాదు—ఇతఁడు విచ్చుకత్తితో నిలిచె నెవ్వరు? అంతమంది యెందులకువచ్చిరి! నాశనమని యెవ్వరో గట్టిగ నఱచిరి. ఇదియంత యునేమి?

ఛత్ర—మహాప్రభూ!—

రోష—ఊరకుండుము—ఇతఁడు నన్నును రహమతుఖానును



గత్తితో నెదురింపఁ బడిమందిచే బంధింపఁజేసి మీకు మందిచ్చుటకై వచ్చుచుండ నితఁడు నాశన మని గట్టిగ నఱచెను.

పాదు—(ఛత్రసాలునితో) నీవెవరవు? ఆనాశనమేమి?

రోష—ఎవఁడో తులువ! తనప్రాణమునకు నాశనమని యఱచెను. మీరు లేవకుండిన నేఁజేయదలఁచినపని చేసియే యుందును.

ఛత్ర—మహాప్రభూ! తులువనగుదునో కానో నాకుఁ దెలియదుకాని, నేను మహీబాచంపతరాయలకుమారుఁడను; ఛత్రసాలుఁడను.

రోష—(ఆశ్చర్యమునటించుచు) అటులనా?

ఛత్ర—చిత్తము! దేవీ! మీరు మఱచితిరి కాఁబోలు!

రోష—చూచితిరా! జహాపనాహ్! ఔద్ధత్యము!

పాదు—నీవు ఛత్రసాలుఁడవా! నీవిచటి కేలవచ్చితివి?

ఛత్ర—మహాప్రభూ! రేపు సామ్రాజ్యసభలో దేవరవారిని సందర్శింప వచ్చితిని. మున్నెన్నఁడు నెఱుఁగను.

పాదు—(సాశ్చర్యముగ) రేపే సామ్రాజ్యసభయా!

ఛత్ర—చిత్తము.

పాదు—ఈమందులతో నిక్కడనే యుంచితివా రోషనారా!

రోష—రేపు పంపుదమని యనుకొనుచుంటిని. (అనిఛత్రసాలునివంక నీర్ష్యతోఁజూచును.)

ఛత్ర—ఔనుదేవీ! నేనురాకున్నచో రేపేపంపియుందురు.

పాదు—సరే! నీవిపు డిచటి కేలవచ్చితివయ్యా?

రోష—నేను చెప్పునది వినుఁడు. ఎవరో నాతో మాటాడుటకై వచ్చిరనివిని నేనప్పుడే వత్తమని యేఁగితిని. ఇంతలో నెవ్వరో వచ్చి లోనఁబ్రవేశించిరని ఫౌలాదుఖాను నాతోఁ జెప్పఁ బరుగున

వచ్చి చూచితినిగదా! ఇతఁ డొంటరిగ మీకడ నిలిచి యేమిచేయుటకో మీముఖమును బరికించుచుండెను.

పాదు—బిజలీ లేదా?

రోష—నేఁడు దానికి జ్వరమువచ్చినది.

పాదు—నన్నొంటరిగనే విడిచిపోయితివా రోషనారా!

రోష—క్షమింతురుగాక. వెంటనే వత్తుమని యేఁగితిని.

ఛత్రి—జహాపనాహ్! నేనేతెంచిన కారణములను నేనే చెప్పుట కనుజ్ఞవేఁడుచున్నాను. నాదోసములను గ్రహించి నన్ను శిక్షింపవచ్చును.

పాదు—కానిమ్ము. రోషనారా! నీకు శ్రమమేల! వినుచుండుము.

రోష—ఇతఁ డధికముగ మాటాడుట నాకిష్టములేదు. ఇతఁడు ద్రోహి. వెంటనే శిక్షించుటయే మంచిది.

పాదు—అంతయు వినినపిదప నిర్ణయింపవచ్చును. ఛత్రిసాల్! చెప్పుము.

ఛత్రి—జహాపనాహ్! నిన్నసాయంకాలమున నయేషాబేగమువారు చూచి, యెఱింగి, సంతసించి, వారియాపదయందు నాసాయమపేక్షించి తోరముగట్టిరి. ఇదిగో! చూడుఁడు!

పాదు—ఏమది! తోరముఁగట్టుట కేమియాపదవచ్చినది?

ఛత్రి—జహాపనాహ్! నానోట నది యుచ్చరించుట చాలకష్టముగ నున్నది.

అని యతఁడు సక్రోధముగ రోషనారవంకఁ జూచెను. పాదుషా రోషనారమొగముఁజూడ నామె వ్యంగ్యముగుచిఱునగవుతో నేమియు నెఱుఁగనట్లు బొమముడివైచి ఛత్రిసాలునివంకఁ జూచుచుండెను.



ఔరం—(ఛత్రిసాలునితో) నేనాజ్ఞయిచ్చుచున్నాను—చెప్పుము.

ఛత్రి—జహాపనాహ్! మీకు మత్తుమందొసంగఁబడినదని దానిని విఱుచుటకై బేగమువారు నాచే నొకమందునంపినారు.

ఔరం—మత్తుమందా! ఎవరిచ్చినారు?

ఛత్రి—మీసోదరీమణియే యిచ్చెనని అయేషాబేగమువారు తెలిపిరి.

రోష—బాగున్నదా!

ఛత్రి—నేను విఱుగుడుమందు దెచ్చి మీకిచ్చుటచేతనే మీకిప్పుడీచైతన్యము కలిగినది. జహాపనాహ్! మీరు నేఁటి కెన్నిదినములు మెలఁకువతో నుంటిరో యోచించుకొందురుగాక! మీరీగృహమునఁ బ్రవేశించి యెన్నిదినములాయెనో మీకే తెలియునుగదా!

రోష—నేను మీకు మత్తుమందిచ్చితినఁట! ఎంతవింత!

పాదు—రోషనారా!

రోష—సరేసరే. చెప్పనిండు.

ఛత్రి—మీకుఁ జైతన్యము వచ్చినపిదప నీగృహమును త్యజింప మిమ్ముఁ బ్రార్థింతమనియే యెంచుచుంటిని. ఇంతలో నెటనుండియో రోషనారాబేగమువారే తెంచిరి.

పాదు—అయేషాకు వచ్చినయాపద యిదియేనా?

ఛత్రి—మహాప్రభూ! ఇదియేకాదు! చెప్పుచున్నాను. మీరాశ్చర్యపడవలదు. నేను మనవి చేసినదంతయు వినినవెనుక నాకడ నేరమున్నచో మీరొసంగుశిక్ష ననుభవింతును. రేపటియుదయమున రెండుగడియలకు మీకు రోషనారాబేగమువారే విషమీయ సంకల్పించిరఁట!

రోషనార "ఛీ" యనియుఁ బాదుషా "విసమా!" యని యు నొక్కమారే పలికిరి. పాదుషా రోషనారవంకఁ జూడ నామెమొగము క్రోధారుణితమై యుండెను. ఆమె వెంటనే యిట్లనెను:— "ద్రోహీ! ఎంతెంతమాటలాడుచుంటివి? ప్రభూ! చూచితిరా! ఎంతకుట్రయో!"

పాదుషా సంభ్రమముతో రోషనారయొక్కయు, ఛత్రసాలునియొక్కయు ముఖచర్యలను బరికించి పిదపఁ గన్నులెఱ్ఱఁజేసి "ఏఁ! ఏమిది?" యనెను.

రోష—సోదరా! నేనిఁక దీనిని సహింపఁజాలను. నాకే నాగరకత లేకుండినచో నిప్పుడే యీగృహమధ్యముననే యీద్రోహిని ముత్తునియలుగా ఖండించియుందును. ఛీ! ఇంతింతకుట్రలు జరుగుచుండ నేను గనిపట్టలేకుంటిఁగదా! జహాపనాహ్! ఇఁక నెన్నఁడును సామ్రాజ్యభారము నాపైఁబెట్టకుఁడు. మీకును నాకును సామ్రాజ్యమునకునుగూడ హాని. ఈతఁని మాటలు మీరు నమ్మియే యుందురేని నేనుతత్క్షణమే ప్రాణత్యాగముచేయ సిద్ధపడియుందును. ఛీ! ఇట్టి ద్రోహినోట నింకను మీరు వినఁదగిన దేమున్నది! ఇఁక వీనిని బ్రతుకనీయఁ రాదు. రహమత్ ఖాన్!

పాదు—రోషనారా! తొందరపడకుము. ఇంకను నేమేమిచెప్పునో వింపము. వంటయింటికుందే లితనిని శిక్షించు టెంతపని! ఇతఁడు ద్రోహియనికదా చెప్పితివి. ద్రోహు లెన్నెన్నిపోకడలుపోవుదురో తెలిసియుండుట మంచిది. ఛత్రసాల్! విషమిచ్చుటయం దభిప్రాయ మేమైయుండును?

ఛత్ర—సామ్రాజ్యాధిపత్యము సంపూర్ణముగ లభించుటయే!

రోష—నాకేమాని సుఖముగ నంతఃపురమున వసింపఁజాలక,



కోరుకాలని నలువురచే ననిపించుకొనుచు, యుద్ధరంగములందును, శాంతిచెందుచు రాజకార్యములందును శ్రమపడుచు, మహాభారమంతయు నెత్తిపై నిడికొనఁ బ్రేమాస్పదుఁడగు సోదరునిఁ జంపయత్నించితినని నీక యేషాబేగము చెప్పినదా! నీవు నమ్మి చచ్చుటకై యిటవచ్చితివి!

"దారా, షుజా, మురాదులు, నీకు సోదరులుకారా! వారినిఁ జంపుటయందు సాయముచేసిన నీకు నౌరంగజేబు ప్రేమాస్పదుఁడయ్యెనా" యనువచనము లప్రయత్నముగ ఛత్రసాలుని నాలుకకొనకు వచ్చెను. కాని, యది సమయముకాదని యతఁడు వెలువఱుపలేదు. ఔరంగజేబునకుఁగూడ నదియే స్ఫురించెను.

ఛత్ర—మహాప్రభూ! ఉద్దేశ మేదియైననేమి? కొన్నికొన్ని ప్రవృత్తుల కుద్దేశములుండవు. మనసులోనియుద్దేశము చూపరానిది. కాని, యీచేష్టమాత్రము సత్యము. మహాప్రభూ! నేను మీహితమును, సామ్రాజ్యహితమును, బ్రజలహితమునుగోరి యింతసాహసమొనర్చితిని. మీరేకార్యమునను సావధానత వీడరనునమ్మిక నాకు సంపూర్ణముగ నున్నది. సర్వము నారయుదురుగాక!

రోష—నీక యేషాబేగము చెప్పెననుట కేమియాధారమున్నది? జహాపనాహ్! ఇదిచెప్పవలదా?

ఛత్ర—అట్లాధారముంజూపిన మీరంగీకరింతురా? ఇదిగో నాచేతికి వారు తోరముఁగట్టినారు.

రోష—వారుకట్టినారని నీవు చెప్పినసరియా! నీవే కట్టుకొంటివేమో!

ఛత్ర—ఇంతవఱకు దాఁచితిని. మహాప్రభూ! తగినసమయ

ము వచ్చినది. అయేషాబేగమువారు నాచే మీకొకజాబు నంపిరి. ఇదే పరికింపుఁడు.” అని ఛత్రిసాలుఁ డొకజాబు నిచ్చెను.

పాదుషా గొప్పప్రతిభాశాలి. తనకు సామ్రాజ్యము చేఁజిక్కునపు డెంతసావధానత వహించియుండెనో, యెల్లకార్యములందు నతఁ డట్టిసావధానతనే పూనుచుండుట వాడుక. అట్టియాతఁడు నేఁడు రోషనారాబేగము తనకు మత్తుమందు నిడెననియు విషమీయ నున్నదనియు విని “తనసోదరియే తన్నిట్లుచేయునా” యనుమూర్ఖతకు లోఁబడునా! అది యసంభవమని యాతఁడు తలఁపలేదు. ఛత్రిసాలుని మాటలను నాతఁడు పూర్తిగ నమ్మక పరిస్థితులను బరిశీలింపఁదొడంగెను. అతఁ డయేషాలేఖను గొని దీపమువెలుఁగునఁ జదువుకొనెను. అందిట్లుండెను.

“హృదయేశ్వరా! నాకిపుడు సంప్రాప్తించిన మహాపదనుండి కాపాడుటకై యీసత్పురుషుని సాయముగోరి తొరముఁగట్టితిని. నా జాబుగొని మిమ్ము సందర్శింపవచ్చిన యీఛత్రిసాలునిమాటలను నమ్మి నాజాబును జూచికొన్నపిదప నిఁక నొకక్షణమైనఁ దడయక మీరీతఁడు కొనివచ్చినపల్లకినెక్కి యీరాక్షసగృహమును వీడుడుగాత మని ప్రార్థన.

“రేపటియుదయమున రెండుగడియలకు రోషనారాబేగము విషముచేఁగాని, కత్తిచేఁగాని, మీప్రాణములను గొననున్నది. దరిసెనమైనపిదప నంతయు విన్నవింతును. ఇఁక వ్రాయఁజాలను—జాగువలదని ప్రార్థన—

ఇట్లు, అర్ధాంగి, అయేషా.”



పాదుషా చూచి మడచెను. “అది అయేషాబేగము వ్రాసినదేనా” యని రోషనారా యడుగఁ బాదుషా యామె కాలేఖ నిచ్చెను. ఆమె చదువుకొనునంతలో నౌరంగజేబు ఆమెముఖమువంకఁ జూచుచు మనసున బాగుగ నాలోచించుకొనెను. తాను సామ్రాజ్యాధిపత్యము సంపాదించుకొనునవసరమున రోషనార తనక్రూరకార్యములం దెంత సాయమొనరించియుండెనో యతనికి బాగుగ జ్ఞప్తికివచ్చెను. తనకార్యములకై తనసంకల్పసిద్ధికై తక్కుంగలసోదరుల మర్దించుటకును, తండ్రిని బందె నుంచుటకును, ప్రజలనోళ్లు మూయుటకును దన కుపకరించుతఱి నతఁడు మెలఁకువతో నామెయుపకారముల నందుకొనెనే కాని, తన్నే మడియించి సామ్రాజ్యమును జేఁజిక్కించుకొన యత్నించుచున్నదను సూచనమైన లభించినపిదప నతఁ డామెవలలో నేలచిక్కుకొనును? అన్నిక్రూరకృత్యములు దనపై ప్రేమచేతనే యామె కావించెననియుఁ, దనకంతటిద్రోహము చేయదనియు మూఢముగఁ దలంపక సామ్రాజ్యాధిపత్యమునకై యీరోషనార తన్నైనఁ జంపుటకు వెనుదీయకుండుట సంభవమని యతఁడు భావించెను.

అదికాక అయేషానఱి. అట్టియామె సామాన్యముగ నింతటి సాహసము వహింపదు. కావున నది సంభవమని యతఁ డెంచెను.

ఇఁకఁ దనవిస్మృతిమాట—స్వయముగ నతని కనుభూతమే. అన్నిదినములనుండి యాతఁ డామంచమున శయనించియుండినను, మెలఁకువతోనున్న సమయ మతనికిఁ జాలతక్కువగ గోచరించెను. మత్తుమందిడెననుటకు వేఱునిదర్శన మక్కఱయే లేకపోయెను. దానికి హేతు వామెదుస్సంకల్పమేయని యతనికిఁ దోఁచెను. సాధ్యమగునంతత్వరితముగ నచటినుండి వెడలిపోవుటయే సర్వవిధముల శ్రేయోదాయకమని యతఁ డెంచెను. ఇంతలో ఛత్రిసాలుఁ డిట్లనెను:—

“మహాప్రభూ! ఈనిదర్శనముచాలదా! బేగంసాహెబా! మీ రింక నంగీకరింతురా?”

రోష—(ఉత్తరముమంచముపైనుంచి) కుట్రలనిన నింతకట్టుదిట్టముగ నుండునని నేనెఱుఁగనైతిని. అయేషాబేగముకూడ నిందున్నదని నేను తలంపనైతిని. సోదరా! పైకిఁగన్పట్టునట్లయేషా వట్టియమాయిక యనియే నేనెంచుచుంటినిగాని యీమెకు నాయెడ నింతటియసూయ కలదని కలనైన భావింపలేదు. ఇంతియు నేను సామ్రాజ్యకార్యములఁ దీర్చుచున్నందులకేకదా! మొదటినుండియు రాజకీయపరిస్థితులను బాగుగఁ బరికించుచున్నదాననుగదా యని నేనీభారము వహించితినికాని, సౌఖ్యమనియా! ఆమె కోరినచోఁ దానే వహించియుండునుగదా! జహాపనాహ్! ఇదియంతయు నాయధికారము సహింపఁజాలక నాయెడఁ గావించినకుట్రకాని, వేఱుకాదని నమ్ముఁడు. ఇట్టి గృహకలహములఁ దెచ్చుకొనుట సామ్రాజ్యమునకు క్షేమముగాదు. బాగుగ నాలోచించుకొనుఁడు. నేనెవ్వరిని శిక్షింపవలయునని చెప్పను. అంతయు మీరెఱుఁగుదురు. ఈరాజ్యవ్యవహారమునకును నాకు నిఁక నెట్టిసంబంధమునులేదు. సామ్రాజ్యము నాచేతనున్నపుడు ద్రోహులగువారి నరబ్బీకుక్కలకాహార మొనరింపఁదగునని యెంచుచుండెడిదానను. పదినిముసముల క్రిందటివఱకు నాకట్టియధికార ముండుటచే నితనిని నట్లుచేయనెంచియే యందఱిని రావించితిని. ఇంతలో మీరు మేల్కాంచితిరి. మీరే విచారింపఁ దగునని వారిని బొమ్మంటిని. ఇఁక మీరేమియొనర్చినను సరే. మీకారోగ్యము లభించినది. అదియే నాకుసంతసము.

ఛత్రి—మహాప్రభూ! అయేషాబేగమువారు నాకు నియోగించినకార్యము నిర్వహించితిని. మీమనసునకు నేఁజెప్పఁదగిన దిఁక



నేమియులేదు. నేను ద్రోహినని యనిపించుకొనుట నాయాత్మగౌరవమున కాఘాతమైనను, దేవరసాన్నిధ్యమున నేమియు ననఁజాలను. విషమువిషయమున నాధారములఁ దెల్పుట కయేషాబేగమువారే బాధ్యులు. దేవరవారికై పల్లకి సిద్ధముగ నున్నది.

పాదు—సరే. దానికేమిగాని—నేనులేచెదను.

రోషనారాఛత్రిసాలు లిరువురు మెల్లఁగ నతనిం గూర్చుండఁ బెట్టిరి.

పాదు—రోషనారా! నీవుచెప్పినట్లు గృహకలహము లుండుట శ్రేయముకాదు. కావున నీవయేషాబేగమును క్షమించితిననుము.

రోషనార సిగ్గుచేఁ గుంగిపోయెను. ఆమె మెల్లఁగ “దేవరవారు క్షమించిన నందఱును క్షమించినట్లే” యనెను. పాదుషావ్యంగ్యోక్తియు రోషనార వికటావస్థయు ఛత్రసాలుఁడు గ్రహించి లోలోన నవ్వుకొనెను. పాదుషా యిట్లనెను:—ఏలయన, ఇంతసామ్రాజ్యమున నెందఱోశత్రులు, మిత్రులవలెనుండి ద్రోహముందలపెట్టువారు, నెన్ని విధములవారో యుందురు. వారిని గనిపెట్టి లోఁగఁదీసికొని సామ్రాజ్యమును జయప్రదముగఁ బాలించుకొనవలెఁ గాని గృహకలహములు మనకుఁ దగవు—అయేషాబేగ మిచ్చటికొకసారి—వలదు, నేనే యచటికేఁగెదను. ఎన్నాళ్లనుండియో మందులుమ్రింగుచు నీయింటనే యుండుటచే నసహ్యముగ నున్నది. ఒకసారి యచటికిఁ బోవలయును. నాకు బాధయేమియు లేదు. ఇఁక—మఱచితిని. ఛత్రసాలునిమాట యందురా! మహీంబా మనమెఱుఁగమా! చంపతరాయల నెఱుఁగమా! ఇతని నెఱుఁగమా! వీరెప్పుడును మనచేతిలోనివారే. అయేషా చెప్పినది సత్యమని తలంచి తోరముఁగట్టుటచేఁ దప్పక వచ్చినాఁడు కాని, మతేమియుఁగాదు.

రోష—అవునవును. అట్లే నేనును తలంచుచున్నాను.

పాదు—నేనొకసారి యచటి కేఁగెదను.

రోష—ఉదయమున దయసేయరాదా!

పాదు—ఇపుడే పోయెదను.

అని లేవఁబోవ ఛత్రిసాలుఁ డొకప్రక్కను రోషనార వేఱొకప్రక్కనుబట్టి మెల్లఁగ లేవఁదీసిరి. రోషనార యిరువురసేవకులఁ దీసికొనిరమ్మని రహమత్‌ఖానును బంపెను. పాదుషా నొకకుర్చీలోఁ బఱుండఁజేసి సేవకు లిరువురు గొంపోవఁదొడఁగిరి. ఛత్రిసాలుఁడు మనసుననే వింధ్యవాసినికి జయజయశబ్దములు పలుకుచు, పాదుషా బుద్ధిశాలితను మెచ్చుకొనుచుఁ బాదుషా కెడమప్రక్క నడచి పోవుచుండెను—రోషనార యేమియుఁ బలుకక ద్వారము లన్నియు దాఁటువఱకును వచ్చి పాదుషాయనుమతివడసి వెనుకకు మఱలుచుండ ఛత్రిసాలుఁడు „ దేవీ ! సెలవు ” అని సలాముచేసెను.

ఖాన్‌జహాన్ పల్లకిని గొనివచ్చెను. పాదుషా యందెక్కెను. పల్లకి యాగృహమునకు దూరము కాఁజొచ్చెను. ఖాన్‌జహాన్ ఛత్రిసాలు లిరువురును మాటాడక పల్లకితోఁ బోవుచుండిరి. పాదుషా యాజ్ఞానుసారము పల్లకి అయేషామందిరమునకే పోయెను. పాదుషా సురక్షితముగ వచ్చెనని విని అయేషా ముఅజ్జీములు పట్టరానియానందముతోఁ గన్నీరునించుచుఁ బాదుషా కెదురేఁగి యతనిని లోనికిఁ గొంపోయిరి. ఛత్రిసాలుఁడుగూడ ముఅజ్జీమ నాహ్వానమున లోని కేఁగెను. ఖాన్‌జహాన్ సెలవుఁగైకొని వెడలిపోయెను. తిన్నఁగఁ దొలుత నాలోచనములుసలిపినగదిలోని కందఱు నేఁగిరి. అందొక మెత్తనిపాన్పుపై నయేషా పాదుషా నాసీనుంజేసెను. అయేషా ఛత్రిసాలునెడ గాఢమగు కృతజ్ఞతం దెలిపెను. ఛత్రిసాలుని యుపకారమునకుఁ బాదుషా సంతసముం బ్రకటించెను. డస్సియుండుటచేఁ బాదుషా యాపాన్పుపై శయనించి మఱునాఁడు సభాప్రారంభమున కించుకపూర్వ మొకసారి తనమందిరమునకు రమ్మని ఛత్రిసాలు నడుగ నాతఁ డంగీకరించెను. వా రచట శయనించుమని ఛత్రిసాలుని గోరినను దండ్రికడ కేఁగక తప్పదని వారినుండి సెలవుగైకొని యతఁడు బయలుదేఱెను. ముఅజ్జి మతనిని సాగనంపెను.

రోషనార ఛత్రిసాలునిచేతఁ దనబొమ్మగలఖడ్గముం జూచియుఁ బ్రత్యక్షముగ రణదులహాఖానుఁడే తన్నుఁ జంపతరాయలుబంధించిన వార్తఁ జెప్పువఱకు నావిషయమును విశ్వసింపనెంచక కంచుకిరాయల నట్లే బంధించియుంచెను.

మఱునాఁ డుదయమునఁ బాదుషా రోషనార కామెయుపచారములకు సంతసముం దెలుపుచు నొకజాబువ్రాసెను.

---

## పండ్రెండవప్రకరణము.



### సామ్రాజ్యసభ.

వివిధాలంకారమండితయు, మోహనాకారసంపన్నయు నగు యువతి విలాసము కుంకుమతిలకము లేకుంటచే నసంపూర్ణమగుభాతి, నమావాస్యా వివిక్తనీలాకాశమండలము, అగణితతారావిలసిత మయ్యుఁ జంద్రుఁడు లేకుంటచేఁ దేజోవిహీన మగురీతి, నేఁడు రాజసభ శోభావిహీనమై వెలవెలఁబోవుచుండెను. ఇహలోకస్వర్గమనఁబరఁగు రాజసభ నలంకరించుటకు ధనవ్యయమునఁగాని దైహికపరిశ్రమమునఁగాని యెట్టికొఱంతయు లేదు.

గొప్పగొప్పవజీరులు, మషీరులు, ధనాఢ్యులు, సరదారులు, రాజవంశజులు, యథాచారముగ యథోచితముగఁ దమతమస్థానము లందాసీనులై యుండిరి. వారివిలువగలవస్త్రములు, వలు తెఱఁగులగు నమూల్యరత్నాభరణములు, నొకదానికన్న నొకటిమిన్నగ వెలయు నాడంబరములు, విలాసములు నన్నియుఁ జూడ నీశ్వరున కొకచక్కనిమానుషరచనాప్రదర్శనముగఁ గన్పట్టును. సభ్యులయనుభావము పూర్ణముగ వెలయుచుండెను. సభయంతయుఁ బుష్పసౌరభములచేతను, సుగంధిద్రవ్యపరిమళములచేతను, గుప్పు మనుచుండెను. దూరమున నలువైపులను సుషిరవాద్యములు శ్రోత్రపేయముగ మ్రోఁగుచుండెను. ఎల్లరును సజీవసాలభంజికలన నొప్పుచుఁ గొలువుచవికె చెలువమును రెట్టించుచుండిరి. కాని, యాశోభ కళావిహీనమై యుండెను. ఎన్నియేని నగలుండియు, సౌభాగ్యచిహ్నము లేనిబాలిక ముఖకాంతికిఁ గళయుండునా! ఇఁక సంపత్సౌభాగ్యతిలకములేక—పరిషత్కుముదబాంధవుఁడు లేక—సభాశోభకుఁ గళయెట్లుగలుగును?

అలంఘిరుపాదుషా మయూరసింహాసన మట్లే యింకను రిక్తముగనే యుండెను. చాలమంది పాదుషారాక కెదురుచూచుచునే యుండిరి. కాని, కొలఁదిమందివజీరులకును, సరదారులకునుమాత్రము ఈవిషయమున మనసున సంశయము కలదు. పాదుషావారు చాలదినములనుండి యస్వస్థులుగ నుండిరి. వారి యారోగ్యవిషయమున నెవ్వరికిని సరియగువార్త తెలియుటలేదు. రాజాజ్ఞలను పాలించుటకై సభయందు మాండలికరాజులు సరదారులు మున్నగువా రెల్లరు విచ్చేసియుండిరి. మయూరసింహాసనమున కిరుకెలంకుల నిరువురురాజకుమారులు సన్నద్ధులై నిల్చియుండిరి. ఎదుటఁ గొంచెముదూరముగ మూల్యవంతములగు వస్త్రాభరణములను ధరించి మఱియిద్దఱురాకొమరులు నిల్చియుండిరి. రాజమండలిలోఁ జంపతరాయలుకూడ నుండెను; యువరాజుఛత్రసాలుఁడు కొంచెముసేపటికిందటనే లేచి యేఁగిన దెచ్చటికో యని యాతఁడు చింతించుచుండెను. జయసింహుఁ డొకప్పు డాతనికి ధైర్యము చెప్పుచు నొకప్పుడు చింతితుఁడగుచు, నిటునటు చూచుచుండెను. చాలమంది ప్రసన్నతతోడనే సార్వభౌమునిరాక కెదురుచూచుచుండిరి. కాని, కొలఁదిమంది గొప్పగొప్ప వజీరులకును సరదారులకును మాత్రము ముఖముల నాప్రసన్నత లేకుండెను. వారిముఖములందు గాంభీర్యము, ఉత్కంఠ, జిజ్ఞాస, మిశ్రితములుగఁ బ్రసరించుచుండెను. దీని కొకనిగూఢమగు విశేషహేతువు కలదు.

దర్బారునకు వెనుకటిరాత్రి రాజభవనమందలి యొకగదిలో రోషనారాబేగము పైనిఁబేర్కొనిన కొలఁదిమందివజీరులకును సరదారు

ఆతను నొకచిన్నరహస్యసభ జరిపెను. ఆసభయందు రోషనార వారితో నిట్లుపలికెను:—

“సార్వభౌమునిశరీరస్థితి నానాఁటికిఁ జెడిపోవుచున్నది. వారి యిప్పటియవస్థ చాల నిరాశాజనకముగ నున్నది. దర్బారున కన్నియేర్పాటులును జరిగినవి. భగవత్కృపవలన నీసంతోషసమయమున దుఃఖసంఘటన మేమియు సంభవింపకుండుఁగాక!” ఆసభయందు బేగము తనసేవాదికముంగూర్చి పెద్దపెద్దవాక్యములలోఁ జాలతడవు చక్కని వర్ణన మొనర్చెను. తాను సార్వభౌమునికిఁ జికిత్సఁజేయుటలో నేమియు లోటు చేయలేదనియు, నైనను భగవత్సంకల్ప మెవ్వరికి నధీనము కాదనియు, భవిష్యము చాలబలవంత మనియుఁ బలికెను. వారిలోఁ గొందఱనుభవశాలులు బేగంగూఢోద్దేశమును లోలోన బాగుగ నెఱుంగుదురు. ఏలయన వారుగూడ ననేకవిధముల బేగం కుట్రయందు సహాయకులుగ నుండిరి. ఐనను బయలకనుపఱచుటకు బేగమును మెచ్చుకొనుచు నామెవచోలాస్యముల కంగుచేయుచుండిరి. ఇట్లామాటలసంతయందుఁ జాలసేపటివఱకు కమ్మకము హెచ్చుగ నుండెను. తుదకు బేగము సామ్రాజ్యమున కుత్తరాధికారముమాట యెత్తి తన రాజనీతిజ్ఞత వెల్లడిచేయుట కొకచిన్నయుపన్యాస మొసంగెను. అందనేకచిరంతనసంఘట్టనముల వర్ణించి, యీసిద్ధాంత మొనరించెను—లేక యొనర్చుటకుఁ బ్రయత్నించెను. “షహజహాన్‌ఖానునికూఁతు రొక్కతెయే యౌరంగజేబునకు వివాహితయు శాస్త్రసమ్మతయు నగు ధర్మపత్ని. తక్కినబేగము లందఱును బట్టితెచ్చి శుద్ధాంతమున నుంపఁబడినవారే! కావున అయేషా (పట్టపుదేవి) కాని, క్రైస్తవరాణులు కాని, యుదయపురరాజపుత్త్రికలుకాని, రాజసింహాసనమున కుత్తరాధికారిణులు కాఁజాలరు. ఉంపుడుకత్తెల బిడ్డలు రాజ్యమును బొందఁ



జాలరు. గద్దెకు ముఖ్యదాయాది యువరాజగు అజీమే. వేఱొకఁడు కాఁడు. పాదుషాప్రాణములకు రేపటిలోఁగా నేమైన వాటిల్లినచో— భగవంతుఁ డట్లు చేయకుండుఁగాక. రేపటిరాజసభలోనే అజీము సింహాసనమున కుత్తరాధికారియనియు, యువరాజు పెద్దవాఁడగునంతవఱకు రాజ్యకార్యములనెల్ల మీయందఱసాయమున నేను నిర్వహించుచుందుననియు, ఘోషణముకావలయును.” సరళమగునీచిన్నివిషయమునకే వారికర్ధరాత్రమువఱకు శ్రమ మొసంగఁబడినది. ఒకవజీరుగాని యొకసరదారుగాని దాని కెదురుపలుకలేదని వేఱ చెప్పనక్కఱలేదు. ఏలయన ఎదురుపల్కువారి కాసభయందుఁ బ్రవేశమే కలుగఁజాలదు. కొందఱిముఖములందు గాంభీర్యము, ఉత్కంఠ, జిజ్ఞాస, మిశ్రితములై యుండుటకుఁ గారణమిదియే. సగము రాత్రివఱకు మేల్కాంచియుండుటచే వారిలోఁ గొందఱ అప్పుడప్పుడు కునికిపాట్లుగూడఁ బడుచుండిరి.

అందఱును దమతమస్థానములఁ గూరుచుండియుండిరి. సభాప్రారంభముహూర్తము సమీపించెను. నెమ్మిగద్దెమాత్ర మింక నట్లే రిక్తముగనే యుండెను. కొంతసేపటికి సార్వభౌమునివాహన మంతఃపురమునుండి బయలువెడలినదని యెల్లరకుఁ దెలిసినతోడనే వారిముఖపద్మములు వికసించెను. కాని, వారియుత్సుకతమాత్రము మఱియు హెచ్చెను. పాదుషావారివాహనము రానున్నమార్గమువైపున కెల్లరును ఱెప్పలువాల్పక చూడసాగిరి. పటహధ్వానసమేతములై మధురతూర్యరావములు వినవచ్చెను. ధ్వజములపైఁ జలాచలంబులగు పతాకలును, ధ్వజములును గన్పట్టఁదొడంగెను. మెల్లమెల్లగ వాహనము సభవఱకేతెంచెను. సభయందలి సర్వజనులును లేచి నిలువంబడిరి. చాలమంది రాజకుమారులును, యవనయువరాజులును, సర్ధ

వలయాకారముగ బారుగట్టి మయూరసింహాసనమునకు వెనుకప్రక్కఁ జుట్టునిల్చిరి. రాజవంశజులు కొందఱు విశిష్టులగుసరదారులు ముందు నడువ సార్వభౌముఁడగు నౌరంగజీ బొకహస్తమును దనకుమారుఁడగు ముఅజ్జీం భుజముమీఁదను, రెండవదానిని ఛత్రసాలకుమారునిభుజము మీఁదను, ఆని మెల్లమెల్లఁగ వచ్చి మయూరసింహాసనముపైఁ గూరుచుండెను. గద్దెపైఁ గూరుచుండి పాదుషా యొకప్రక్కయాసనముపై ఛత్రసాలుని, రెండవప్రక్కయాసనముపై ముఅజ్జీమును గూరుచుండ సంకేతమొనరించెను. దర్బారుమర్యాదలు ప్రారంభమయ్యెను. వందిగీతములు ముగిసెను. కానుక లర్పింపఁబడెను. ప్రార్థనలు చదువఁబడెను. దీవన లొసంగఁబడెను. బిరుదములు పేర్కొనఁబడెను. జనులు సమ్మానింపఁబడిరి. ఇట్లింకను గార్యక్రమము చాలఁగ జరిగెను. అదంతయు ముగిసినపిదప నౌరంగజీబు యువరాజుఛత్రసాలునికి నిలువ సైఁగచేసెను. తదనుసారముగ యువరాజులేచి సింహాసనమునకుఁ జాలచేరువకు వచ్చి నిలిచెను. పాదుషా సభ్యులందఱిని సంబోధించి కొలఁదిమాటలలో ఛత్రసాలుని పరిచయమొసంగి యతనిని మిగుల మెచ్చుకొనుచు నిట్లువాక్రుచ్చెను:—“మాప్రాణముల నీతఁడే కాపాడెను. సభ్యులు, సరదారులు, రాజులు, నీతనియెడఁ గృతజ్ఞులు కాఁదగును.” పాదుషా దుర్బలుఁడుగ నుంటచేతను, నస్వస్థుఁడుగ నుంటచేతను, నిదియంతయు సంగ్రహముగఁ దెలిపెను. ఛత్రసాలునిఁ బ్రశంసించుటయు, నాతనికి ధన్యవాదము లొసంగుటయు నైనపిదప, నతడు జయసింహునికి చంపతరాయలతోఁగూడవచ్చి నెమ్మిగద్దెకు నికటముగఁ గూర్చుండ నానతియొసంగెను. జయసింహుఁడు వెంటనే యాయాజ్ఞను బాలించెను. జయసింహచంపతరాయలువచ్చి సింహపీఠసమీపమున నాసీనులైనపిదపఁ బాదుషా యిట్లు పలికెను:—



“నేఁడీసౌభాగ్యసమయమున సామ్రాజ్యమున కాధారభూతులును, విశ్వాసపాత్రులును నగుసహకారులసమావేశమువలన మాకుఁ బ్రాప్తించిన సంతోషము వర్ణనాతీతము. కాని, యింతకన్న నధికతర సంతోషవార్త యేమన, పరమేశ్వరుఁడు ప్రజాసామ్రాజ్యములకు రక్షణపోషణముల నొసంగు, సింహాసనకిరీటముల కధిపతియగు తనసేవకు నింకను గొన్నిదినములవఱకు నీలోకమున వసించి తనయాజ్ఞలఁ బాలించుటకును, ప్రవర్తకప్రదర్శితమగు మార్గమున నాదీనరక్షకుని సేవకుల నడపుటకును, నవకాశ మొసంగెను. ఎవరియుపకారమున నేఁడు మీకెల్లరకు సభాసందర్శనభాగ్యము లభించెనో, యాపురుషునెడ నిపుడు మీరెల్లరు సర్వాధికకృతజ్ఞులు కానగును. ఆపురుషుఁడు మహీపాలకుఁడగుచంపతరాయలకుమారుఁడు ఛత్రసాలుఁడు. ఆప్తులగు గొప్పగొప్పసరదారులవలనను, అమీరులవలనను, దుదకు రాజబంధువులవలననుగూడఁ గాని ఘనకార్యము మిక్కిలిసొంపుగ నేఁడీ ఛత్రసాలుఁడు నిర్వహించినాఁడు. ఛత్రసాలుఁ డేతత్సేవాక్రమమునఁ దనకిచ్చవచ్చిన దేదియైనఁ గోరికొనవచ్చునని యనుమతి యీయఁబడుచున్నది.”

ఛత్రసాలుఁ డేదియో పలుకుటకై మఱొక్కయడుగు ముందఱికిడెను. అందఱిదృష్టియు నతనివైపున కాకృష్టమయ్యెను. ఈయమూల్యావకాశమును ఛత్రసాలుఁ డెవ్విధమున నుపయోగించునో సార్వభౌమునొద్దనుండి యేమివాంఛించునో యని యెల్లరు యోజింపసాగిరి. పాదుషాకూడ నాతఁ డెద్దియోని గొప్పబిరుదమునుగాని, యుచ్చపదవినిగాని, కాంక్షించునని యభిప్రాయపడెను. కాని, యట్లు కాలేదు. వారిని నాశ్చర్యచకితులఁజేయుచు ఛత్రసాలుఁ డిట్లు చెప్ప మొదలిడెను.

“సర్వంసహాచక్రవర్తీ ! ఒకయప్రథితుని పేలవమగుసేవకై ప్రభువర్యు లింతగ గారవించి యెద్దియేని వరముగూడ వాంఛింప నవకాశముదయసేసినందులకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. కాని, యీస్థితియందు స్వయముగ నాకేమియు నక్కఱలేదని విన్నవించుకొనుచున్నాను. ప్రస్తుతము నాకుఁ బ్రాప్తమైయున్న దానితోడనే సంతుష్టిఁ గాంచుచున్నాఁడను. అదియే పర్యాప్తమని యెంచుచున్నాఁడను. దినదినమును సేవాశృంఖలముల బంధింపఁబడుచున్న నాబుందేలసోదరులకై నాకుఁ జాల చింతకలదు. బానిసతనమురీతి యెట్టిదనిన—అది యేజనులను దనజాలమునఁ జిక్కించుకొనునో వారలఁ గృపణులుగను, నిస్సహాయులుగను, విషయలంపటులుగను జేసివైచును. ఏదేశముపైఁ దనయధికారము స్థాపించునో యది క్షామము మున్నగు వివిధసంకటములకు నావాసమగును. ఢిల్లీసింహాసనమారుతము బుందేలఖండస్వతంత్రతాదీపిక నార్పుటకై యత్నించుచున్నది. అచ్చటియేమాక్షత్రికములకు కిరీటముపై స్థానముదొరకవలసియుండెనో యవి యిపుడు చరణములచేఁ జూర్ణీకృతము లగుచున్నవి. వారిస్వాతంత్ర్యము స్థిరముగ నుండకుండుటకును, వారిపౌరుషము చూర్ణీకృత మొనర్చుటకును, యత్నము జరుగుచున్నది. సార్వభౌములు బుందేలఖండమునకు సర్వవిధస్వాతంత్ర్యము దయచేసినచో, నింకముం దెన్నఁడును బుందేలుల యధికారములకు భంగముకలుగఁబోదని వారికి విశ్వాసము గలుగఁజేసినచో, నాసేవలకన్నిటికి సంపూర్ణమగు పారితోషికము లభించెననియే భావింతును.”

ఔరంగజేబుముఖ వించుక కాంతిదక్కెను. ఏమిపలుకవలయునో యాతని కేమియుఁ దోఁపలేదు. ఛత్రసాలునికోర్కి నెఱవేర్చుట యాతని కిష్టము కాదు కాఁబోలు!



ఛత్రసాలునిమాటలు వినుసరికిఁ జంపతరాయల కానందముగలిగెను. సార్వభౌముఁ డూరకుండుటఁగాంచి యాతఁడు లేచి నిలువఁబడి యిట్లు పలుకసాగెను:—

“రాజాధిరాజా ! ఛత్రసాలునిప్రార్థనపై నేమియు నభిప్రాయము ప్రకటితముకాలేదు. అతనిసేవ యతనిప్రార్థనాపరిపూరణమునకుఁ దగినంతమూల్యవంతము కాదు కాఁబోలు! ఒక్కఛత్రసాలునిసేవ యీప్రార్థన సెల్లించుటకుఁ జాలనిదైనచో నేను పూర్వపుసేవలఁ గొన్నిటి జ్ఞప్తికి దేఁగోరుచున్నాఁడను. సోముగడయుద్ధమున రుధిరవాహినులఁ బ్రవహింపఁజేసి స్వపరాక్రమమువలన వైరులజయించిన దెవరు? ఈగద్దెను బొందుటయందుఁ బ్రభువర్యుల కందఱికన్న నెక్కుడుసాయ మొనర్చిన దెవరు ? మయూరసింహాసనప్రాపణమార్గమును నిష్కంటక మొనర్చిన దెవరు ?”

ఔరంగజేబించుక శాంతివహించి యిట్లుపలికెను:—“రాజా ! మీరు చెప్పినది చాలయుక్తముగ నున్నది. సందేహము లేదు. మీసేవలత్యధికములే, మూల్యవంతములే.”

చంప—నేను నాజీవనమును నంతయు లక్ష్యపెట్టక సోముగడయుద్ధమున జయమంది ప్రభువులకై నెమలిగద్దెను నిర్ముక్తముగావించితిని. నేఁడు ఛత్రసాలుఁడు ప్రభువర్యుల మృత్యుముఖమునుండి కాపాడెను. ఇట్టిస్థితియందుఁ బ్రభువులజీవనమునకును భాగ్యమునకును హేతుభూతములగు మాయిరువురియుపకారములును జ్ఞప్తియందుంపఁబడుట చాల నావశ్యకము. ఛత్రసాలుఁ డొనరించినప్రార్థన మాయుపకారములతోఁ బోల్చిచూచినఁ జాలస్వల్పము. ఈసమయమున సామ్రాజ్యమందలి యొకచిన్నభాగమునకు స్వాతంత్ర్యమునొసంగఁ బ్రభువారి కెట్టిసందేహమును గలుగదని నాయాశ.

ఇప్పటికిని నౌరంగజీ బేమియుఁ బ్రత్యుత్తర మొసఁగఁడాయెను. ఆతఁ డెద్దియో గొప్పయాలోచనయందు నిమగ్నుఁడైన ట్లాతని ముఖము సూచించుచుండెను. ఆతఁడు చాలసేపు మిన్నకుంటఁ గాంచి ఛత్రసాలుఁ డిట్లుపలికెను:—

„ సరియే! నాప్రార్థన మస్వీకృతమని తెలిసినది. అదియే మంచిది. ఈవిధమున బిచ్చమడిగి స్వాతంత్ర్యము సంపాదింపనాసించుటకూడ మౌర్ఖ్యమే. ప్రభువులవారు వ్యర్థముగ నధికచింతాకులు కాకుందురుగాక! మేము దీనికై పట్టుపట్టుట లేదు. (కొంచెమాఁగి) ఇఁక మాకనుజ్ఞ లభింపఁదగును.”

ఇట్లుపలికి ఛత్రసాలుఁడు వెడలిపోవుటకు సంసిద్ధుఁడయ్యెను. చంపతరాయలతేజశ్శాలితయుఁ బౌరుషమును తీసిపోవునవి కావు. ఆతఁడుగూడఁ దనయాసనమును వదలిలేచెను. ఆతఁడు లేచుచుండఁ గాంచి యౌరంగజేబిట్లుపలికెను:—

„ చంపతిరాయజీ! మీయుపకారముల నెఱుంగుదు బుందేలఖండస్వాతంత్ర్య మొకలెక్కలోనిది కాదనుట నిస్సందేహమే. కాని, కాఫరులను స్వతంత్రులుగ నుండనిచ్చుటయు, సైవతులఁగావించుటయుఁ, బరమపావనుఁడగు సర్వేశ్వరునియిచ్ఛకు విరుద్ధములు. దేశాధీశులు లోకమందంతట నిస్లాముజయభేరి మ్రోగింపవలెననియుఁ, దమసమస్తపాలితుల ముసల్మానులఁ జేయవలయుననియు, మతప్రవర్తకుల యాజ్ఞ. మొదట దేశముల వశముచేసికొని తరువాత నచ్చటిప్రజలను ముసల్మానులఁజేయక స్వతంత్రులఁగావించుట గొప్పపాపము. కావున మీరు మఱియొకవిన్నప మొనరించుట యుక్తముగనుండును.”

చంప—నా కెట్టిపదవులును బిరుదములు నక్కఱలేదు. మేము వేఱెదియు విన్నపముసేయఁ బోవుటయు లేదు. నా మొదటివిన్నపమును గూడ నుపసంహరించుకొనుచున్నారము—ఏలయన—బుందేలఖండము స్వయముగ బుందేలులది. దానిని స్వతంత్రముగ నుంచుటకూడ వారిచేతియందే కలదు.



ఇట్లుపలికి చంపతరాయలు తనవెంట ఛత్రసాలునిదీసికొని యచటినుండి వెడలిపోయెను. అచట నెక్కువసే పుండుట యనుచితమని యాతఁ డెంచెను.

---

## పదుమూఁడవప్రకరణము.

### ఉషాసుందరి—అరుణుఁడు.

విపులనీలగగనమున నుషాసుందరి సలజ్జయై యాకాశగంగాతీరమున నవ్వుచు నిలువఁబడియుండెను. గగనవిహారిణులగు నసంఖ్యాకతారకలను గాంచ నాబాలికకు మిగుల నచ్చెరువు జనించుచుండెను. తారాపతి క్షీణబలుఁ డగుచుండఁగాంచి క్రమముగఁ దారకాసుందరి గగనమండపమును వీడి పోవుచుండెను. తారక లిట్లు వెడలి పోవుటం గాంచి తత్పతి మిగులఁ జింతించుచుండెను. „వీరి కింతటిస్వాతంత్ర్య మొసంగకుండిన నీరీతిగ నన్నుఁ బరిత్యజింపకుండియుందురుకదా!” యని యతఁడు పశ్చాత్తపించుచుండెనో యన్నట్లుండెను. తారకాపతిసంసార మిట్లు విచ్ఛిన్నమగుటఁ గాంచి, యుషాసుందరి మిగుల విచారించెను. వనితలను యవనికాభ్యంతరమున నుంచినఁగాని పాతివ్రత్యాదిసద్గుణరక్షణము జరుగదా యని యామె విచారించుచుండెను. తాను స్వయముగ యవనికనువీడి యాకాశగంగాతీరమునకు

వచ్చి నిలువఁబడియుండుటచే నామె ప్రసన్నవదన మించుక గంభీరమయ్యెను. తనసద్గుణశీలములుగూడ వినష్టములగునో యని యాదివ్యసుందరి భీతిల్లుచుండెను. పరమేశ్వరుని యగాధరచనానైపుణిని, ననుపమస్వర్గంగాసౌందర్యమును, బరీక్షించుటమాని యాత్మశీలరక్షణముం గోరి యామె యవనికంజార సంసిద్ధయయ్యెను. పాప మామెకుఁ బ్రాపంచికానుభవ మేమియు లేకుండుటచే నొక్క తారానాథుని యుదాహరణముంగాంచియే భీతిల్లెను. యవనికను ద్యజించివచ్చు చంచల యాత్మపతియగు మేఘునియెడ నెట్టిభక్తిపూర్ణవ్యాపారము నెఱపునో, యెన్నఁడును దెరయందుండని ప్రభాకాంత యాత్మేశ్వరుఁడగు దివాకరునిఁగూడి దినమంతయుఁ దిరుగుచు నతని కెంతటివాస్తవసాహాయ్యమొనర్చుచున్నదో జవనిక నించుకయైన లెక్కఁగొనని సంధ్యాయువతి యెట్లాత్మనాథుఁడగు నంధకారుని యాజ్ఞానువర్తినియై యున్నదో, యజ్ఞానినియగు నా బాలిక యెఱింగినచో మరలఁ జాటునకుఁ బోవు నిచ్చ యామె కెన్నఁడును గలిగియుండదు. "నా ప్రాణేశ్వరుఁ డరుణుఁడు నన్ను వెదకుచు గగనమున కేతెంచును. అతనిఁ గనఁజాలనుగదా" యని యామె మిగులఁ జింతించెను. అరుణద్వితీయయై యవర్ణనీయగగనసౌందర్యము నీక్షించుటయుఁ, బరమేశ్వరు నమేయలీలాగుణగాన మొనర్చుచుఁ బవిత్రానందముఁ జూఱఁగొనుటయు నెక్కడ! దుష్టలగు కొందఱవనితలదశకు భీతిల్లి చెఱలోనుండి విరహదుఃఖము ననుభవించుటెక్కడ? ఒకట లభించు దివ్యాద్వితీయాలౌకిక సుఖానందములయొక్కయు, మఱియొకట లభించు నసహ్యచింతామనస్తాపములయొక్కయుఁ జిత్రములదెస కాయుషాసుందరి తనమనోనేత్రములఁ జూచుచుండెను. తన్నట్టిస్వర్గీయసుఖమునుండి వంచితనొనర్చిన చందురునిపై నామె మిగులఁ గ్రోధముఁ దాల్చెను. క్రోధాతిశయమున



నామెవదన మెఱ్ఱవడెను. ఆమె మనసుననే విచారించుచు గగనయవనికచాటున దాఁగఁజొచ్చెను. శీతకరసాన్నిధ్యమున వర్తించుచుఁ దత్సేవానిరతయైయున్న రోహిణిదెస కామెమనసు పోయెను. ఆమెనుగాంచి యుష మరలఁ గొంతధైర్యమున బయటికి రాఁ దొడంగెను. కేవలయవనికామూలముననే వనితల పాతివ్రత్యశీలములు రక్షింపఁబడుచున్నవను నామె యుద్దేశము క్రమక్రమముగ నశించుచుండెను. చపలలు నీతివిదూరలు నగు కాంతలు, యవనికలో దాఁపఁబడినను, సప్తమహాతాళమునకుఁ గొంపోఁబడి యందడఁచియుంపఁబడినను స్వీయప్రవర్తనప్రదర్శనమునకు వెనుకాడరుకాని, శీలవతులగు యువతులు స్వతంత్రసంచారావకాశము లభించినను స్వశీలమును వీడరు. ఇట్లే యెంచి యాదివ్యబాలిక మరలఁ బ్రసన్నయై మందహాస మొనర్పమొదలిడెను. ఆకసము నిజముగ జవనిక కాదనియుఁ దచ్ఛాయామాత్రమే యనియుఁగూడ నామె యెంచెను. అప్పు డామె మరలఁ దనప్రియుఁడగు నరుణుని నిరీక్షింపఁ దొడంగెను. కేవల సౌందర్యసద్గుణములనేకాక యాంతరికవిషయములఁ గూడ స్వర్గంగాతీరమున నిలువఁబడియున్న యుషాసుందరినిబోలియున్న మానవ్యుష జాహ్నవీసోదరియగు యమునాతటమున నిలువఁబడి మందహాస మొనరించుచుండెను. ఉషాకాంత దివ్యాళయప్రతిబింబ మామెహృదయముపైఁగూడ నారీతినే పడుచుండెను. ఉష దివ్యజ్యోతి. బదరున్నిసా యైహికజ్యోతి. ఉష యమరలోకమును స్వసౌందర్యతేజశ్శోభితముగఁ జేయుచుండ బదరున్నిసా మర్త్యభువనము నాత్మీయలావణ్యప్రదీపితముగ నొనరించుచుండెను. ఉష నేఁడు గగనయవనికఁ దొలఁగించినట్లుగనే బదరున్నిసా తనతండ్రి చక్రవర్తిమందిరమును ద్యజించెను. తనకై స్వర్గంగాతీరము నిచ్చగించిన బదరున్నిసా యమునాతీరమున నిలువఁబడి యుండెను. "నేనెట్టి

యాశయములతో నీయమునాతటమున కేతెంచితినో యట్టియాశయములతోనే యీయుషాకాంతయు దివ్యగంగాతీరమున స్వవిచారమగ్నయై నిలువఁబడియున్నదా" యని యెఱుంగఁగోరి బదరున్నీసా నిశ్చలదృష్టితో నామెవంకఁ జూచుచుండెను. "ఉషయు నాయట్టికాముకురాలే. ఆమెవదనముఁగూడ నావదనముంబోలి లజ్జారుణితమైయే యున్నది. ఆమెనేత్రములుగూడ నానేత్రములువోలె సకుతూహలములేయై యున్నవి." యని యామె తలంపఁజొచ్చెను. "ఆదివ్యవనితయుఁ బ్రేమ పూజ్యమనియే యెంచుచున్నదా! ఈప్రేమ మానుషవికారము కాక దివ్యగుణమే యగునా! ఉషాసన్నిభయగు దివ్యకాంతనుగూడ బలవంతుఁడగు పరమేశ్వరుని యవనికనుండి తొలంగించి రప్పించునంతటి పవిత్రమా యీప్రేమ! తప్పక ప్రేమ యత్యంతపవిత్రమగు వస్తువు. తప్పక యది దివ్యగుణమే యగును. స్వర్గీయవనితలుగూడ దానిని పూజించుచుండనోపు. లేకున్నఁ బిత్రాజ్ఞానుసారిణియగు నాయట్టికాంత అట్టివ్యాపారమున నేలపడును? నిశ్చయముగఁ బ్రేమ విలక్షణమాధురీభరితము; అద్భుతసుగంధమిళితము; కాఁబట్టియే యామె దివ్యసుఖముల విడనాడి యమరతరంగిణీతటమునకు వచ్చియున్నది. మానవులనేకు లాస్వర్గీయసుఖానుభవమునకే యేతత్ప్రపంచికసుఖసర్వస్వమును ద్యజించివైచుచున్నారు. తనదివ్యభోగముల విడనాడి యుషయాకాశనదీతీరమునకు వచ్చియుండ నేను రాజభవనమును వీడిన నంతఁ దప్పేమి?" బదరున్నీసా యాసమయమున యమునాంతర్గతమగు నుషాప్రతిబింబమును జూడఁ దొడంగెను. వెంటనే తత్పార్శ్వముననే తత్ప్రియుఁడగు నరుణునిప్రతిబింబముగూడఁ గానవచ్చెను. అరుణోదయ మెప్పుడయ్యెనని యాలోచించుచు నామె చూడసాగెను. ఉషతోడి యరుణుని ప్రేమపూర్వకసంభాషణము నామె యాలకించె



ను. "నాకుఁగూడ నిట్టియనురాగవచనముల నాలకింపనగునా" యని యామె చింతింపఁదొడంగెను. ఇంతలోననే మనోహరదివ్యస్వర మామె కర్ణములఁ బడెను.

"సుందరీ! నీవాస్వర్గభవనమునువీడి యిటకేలవచ్చితివి? నీవులేమి నచట కోలాహలము జనించినది. తారావిద్యుదింద్రధనువులు స్వకార్యములఁ ద్యజించినవి. నీవిట కేలవచ్చితివి?"

ఆకసమున నరుణుఁడు తనప్రియయగు నుషతో నీమాట లాడుచున్నాఁడని బదరున్నీసా యెంచెను. ఉషప్రత్యుత్తరము వినఁగోరి యామె తదేకమగ్నచిత్తయై యామెదెస చూచుచుండెను. ఇంతలో మరల నామనోహరదివ్యస్వరమే వినవచ్చెను.

"సుందరీ! ఆకసమున నీవేమిచూచుచున్నావు! తత్సౌందర్యము నంతను నీవే జయించితివి. ఇఁక నాదెసకుఁజూడ నేమియయ్యెడు? ఇప్పుడు గగనము నీపాదములపై దొర్లుచున్నది. నీకైకొన్నదాని మరల నిచ్చివైతువుగాక." బదరున్నీసా క్రిందిదెసకుఁ జూచెను. గగనమంతయు నిర్మలయమునాప్రవాహమునఁ బ్రతిబింబితమయ్యెను. తత్ప్రతిబింబసహితములై యమునాతరంగము లామెచరణములతో నాడుకొనుచుండెను. ఉషారుణులపరస్పరసంభాషణమున కవకాశ మొసంగి యామె యెదుటికిఁ జూచెను. ఏది దర్శింపఁగోరి తనమందిరమువీడి యామెవచ్చియుండెనో యాయువకుఁ డామెయెదుట ప్రత్యక్షమై యుండెను. అరుణదర్శనమున నుషాకాంత కెంతటియానంద మయ్యెనో యీయువకునిఁజూచుటచే నీమెకంతటియానందము కలిగెను. ఆయానందము లజ్జాసమ్మిళితమగుటఁ దన్ముఖ మధికతరమాధురీపరిపూర్ణ మయ్యెను.

తన్మాధురీదర్శనలోలుఁడగు నాయువకుఁ డిట్లనియె:—

“చంచలా! స్వర్గంగా తారకలసౌందర్య మంతయు లాగికొని నను నీమనసింకను నిండలేదా? నీవింక నాకసమున దేని నుండనీయవా?”

బద—మన్నింపుఁడు. బహుశః మీరిచటి కేతెంచి చాలసేపై యుండనోపు. నేనేదియో యాలోచనలో మునింగియుంటిని. నాదృష్టి మఱియొకదెస నుండెను.

బదరున్నిసా మృదుమధురస్వరమును విని యాయువకుఁ డత్యంతానందితుఁడై గద్గదస్వరమున నిట్లనెను:—

“నేఁడు శ్రేష్ఠమగు భగవంతుని సురచనానైపుణ్యాహారణము నొకదానిని జూచుచున్నాను. నేఁడు నిన్నుఁగాంచి ధన్యుఁడనైతినని తలఁచుచున్నాను.”

బద—(సాశ్చర్యముగ) ఇదియే మొదటిసారిగ మీరు నన్నుఁ గాంచుచున్నారా?

యువ—ఇందేమిసంశయ మున్నది? పరమేశ్వరుని యీరచనను—సౌందర్యరూపము నొక్కసారి చూచువాఁడు తనజీవితమున నెన్నఁడును మఱవఁజాలఁడు.

బద—కాని, మీరు రెండుదినములనుండియు నాయెదుట సంచరించుచునేయున్నారు!

యువ—అట్లుకాదు. అట్లైన నేఁటికిఁ జాలకాలమునకు ముందే నాహృదయము శకలితమై యుండెడిది. నానేత్రములు మిఱుమిట్లుగొనియుండెడివి. ఇట్టిరూపము నింతకుము న్నెన్నఁడును నేను చూచియుండలేదు.

బద—మిగుల నాశ్చర్యకరమగువిషయము. బాగున్నది. మీరు నన్నెప్పుడును జూచియేయుండకున్న నిప్పు డిచ్చటి కెట్లువచ్చితిరి?



యువ—నిన్న జయసింహునిపుత్త్రికయగు జయ రేపటియుషఃకాలమున యమునాతటమున నెవ్వరో నన్నుఁ గలిసికొనఁగోరుచున్నారని చెప్పినది. ఆమెమాటపై నేఁడిట్లువచ్చితిని. నిన్నుఁ గాంచుచున్నాఁడను.

ఆయువకునిమాటలు విని బదరున్నిసా మిగుల వచ్చెరువందెను. ఆమె యిట్లాలోచించెను:—“నేనీవేసవితోడనే మీనాబజారులో నాదుకాణముపైఁ గూర్చుండియుండ నీతఁ డెన్నియోసారులు నాయెదుటినుండి యిటునటుఁ దిరుగుచుండెను. ఇతఁడు నాహృదయము నాక్రమించినట్లుగనే నాయెడ నితఁడుగూడఁ గొంతమనసుఁగలిగియుండునని తలంచుచుంటిని. ఆకారణముననే జయచే నేనీతనికి సందేశ మంపితిని. నేఁడీతనిఁగలియ నిట కేతెంచితిని!” ఈయంతిమాలోచనమున బదరున్నిసా కొంచెముగ లజ్జితకూడ నయ్యెను. తదేకదృష్టితో నామెదెసంజూచుచున్న యువకుని కధికాశ్చర్యము జనించెను. ప్రథమమున నధికసంతుష్టయై కాన్పించినయీమె పిదప నచ్చెరువునకు లోనై, తుదకు విచారమున మునింగియున్నదే యని తలంచి యాతఁ డిట్లనెను:—

“నేనింతదనుక నిశ్చలదృష్టితో నీవంకఁ జూచుచున్నందులకు నన్ను మన్నింపుము. నేను నీదుఃఖమునకుఁ గారణభూతుఁడనైతినో యని నాకు మిగుల విచారము గలుగుచున్నది. కాని, యందలిదోసమున నాకేకాక యిప్పటిదనుక నాచూపులను దనదెసకాకర్షించుకొన్న నీసౌందర్యమునకుఁగూడఁ బాలుకలదు.”

బద—నాకేవిషయమునను విచారములేదు. కాని, నేఁటికి మున్నెన్నఁడును మీరు నన్నుఁ జూచియుండలేదని మీరాడినమాట నాకాశ్చర్యజనకమై యున్నది.

యువ—ఐన నింతకుము న్నేడనైన నేను నిన్నుఁ గాంచియుంటినని నీతలంపా ?

బద—మీరు వరుసగ రెండునాళ్లు నాయెదుటనుండియే సంచరించుచుంటిరి.

యువ—(సాశ్చర్యముగ) నీవు నన్నెప్పు డెచ్చటఁ జూచితివి ?

బద—మీనాబజారునందు.

బదరున్నీసామాటలువిన్నకొలఁది నాయువకునియాశ్చర్య మంతరించుచుండెను. అతఁడు నవ్వుచు నిట్లుపలికెను:—

"అగునగును. నీమాట సరిగనే యున్నది. రామసింహకుమారుని యనురోధముపై నేను చాలసారు లావిపణివీథిని దిరిగితిని. అయ్యదనున నాదృష్టి మఱియొకదెస నుండెను. ఛత్రసాలుఁడు విడిపోయెను. వానిచింతనే తగుల్కొని యుంటిని. మఱిదేనిని జూచుటకు నామన సొప్పకుండెను. కాఁబట్టియే నేను నిన్నుఁ జూడఁజాలకపోయి యుండవచ్చును. కృపాణసమర్పితధ్యానులగువారిమన సిట్టివిషయముల నధికముగఁ గొనదన్న నీవు వెఱఁగందనక్కఱలేదు. ఇందుచేతనే ఛత్రసాలుఁడు మమ్ము బుద్ధిపూర్వకముగఁ బరిత్యజించి యమునాతీరమున నెచ్చటనో పోయికూర్చుండెను. కాని, రామసింహుని నిర్బంధమున నాకు మీనాబజారునఁ దిరుగనయ్యెను.

ఇప్పుడు బదరున్నీసా సంశయవిముక్తయయ్యెను. ఏమియో స్మరణకువచ్చినట్లామె యిట్లు ప్రశ్నించెను:—

"ఈఛత్రసాలుఁ డెవరు ? సార్వభౌముని ప్రాణరక్షకుండగు ఛత్రసాలుఁడు కాఁడుకదా !"

యువ—అగు నతఁడే

బద—మీయిరువురి కెట్టిసంబంధము ?



యువ—అతఁడు నాజనకుని ప్రాణశత్రునికుమారుఁడు......

బద—ఐన నతఁడు నీకుఁగూడఁ బరమవైరియే కదా !

యువ—అగును. నేను నాతండ్రిగారివిరోధమునే పాటించిన నట్లే. కాని, మాయిరువురిసంబంధ మట్టిదికాదు.

బద—ఐన నింతకు మీరతని నెట్లు భావించుచున్నారు !

యువ—కేవలమిత్రునిగ—మఱియు నంతకన్న నధికముగఁ గూడ. అతనికై నాసుఖదుఃఖముల నించుకంతయుఁ బాటింపను. ఇంతయేల ! నాప్రాణములనుగూడ లెక్కగొనను. అయ్యరుణదివాకరులసాహచర్యముంగాంచుము—నన్నరుణునిగను, ఛత్రసాలుని దివాకరునిగను భావింపుము.

బదరున్నీసా యాకాశస్థుఁడగు నరుణునిఁ గాంచెను. ఆసమయమున నరుణుఁ డనురాగపూర్ణమగు నుషావీక్షణమున మునింగియుండెను. తనహృదయమున దాఁచియుంచిన యనురాగము, ఆమె ప్రత్యంగమున నాట్యమొనరించుచుండెను. ప్రేమ యామెపై నిప్పుడు సంపూర్ణమగు నధికారమును వహించెను. అట్టిదశలో నామె యిట్లనెను. "మీరరుణులుగదా !"

యువ—(నిష్కపటముగ) అగును. ఛత్రసాలునింబోలురవియెదుట నేనరుణుఁడనే యగుదును.

బద—ఇప్పుడు కొంచె మాయుషనుజూడుఁడు. అరుణసమేతయై యామె యెట్టిసౌఖ్యము ననుభవించుచున్నదో ! ఉషనుగాంచి యీర్ష్యాగ్రస్తకానివనిత యుండఁజాలదు.

యువ—కాని, నీయీసౌందర్యము నెదుట నాయుషాసౌందర్యమేపాటిది. నిన్నుఁ జేపట్టఁగలభాగ్యశాలి యాయరుణునికన్న లక్షగుణము లధికుఁడు. అట్లైనో యుషనుగాంచిన నీకింతటియసూయ కలుగనేల?

"ఆమె స్వర్గంగాతీరమునఁ జేరినసమయముననే నేను యమునాతీరమును జేరితిని. ఆసమయమున నిరువురిహృదయము లేకమాత్రవిచారగ్రస్తములే యయ్యెను. కాని, యిప్పు డామె యొక్కతెయే యానంద మనుభవించుచున్నది. నేను—" ఇంక నేమియుఁ జెప్పఁజాలక యామె తదేకదృష్టితో నాయువకునిఁ జూడసాగెను.

యువ—ఈయుషకుఁ గూడ నేభాగ్యశాలినైన లభింపనున్నాఁడా ?

బదరున్నీసా యువకుని యీప్రశ్నమున కేమియుఁ బ్రత్యుత్తరము నొసంగలేదు. అధోదృష్టిని యమునాసంగతమగు నుషాప్రతిబింబమును జూడసాగెను.

యువ—గగనప్రభయగు నాయువవోలె నీయుషయుఁ బృథ్వీప్రభయగును. యమునాంతర్గతమగు యువకునిప్రతిబింబమును గాంచుచు బదరున్నీసా యిట్లడిగెను:—"నేనీపృథ్వీపై ఉషనని మీరంగీకరించుచున్నారుగదా !"

యువ—అవును. నీ వుషవే—నీవీపృథ్వికి మనోహరాలంకారమువు.

బద—స్వర్గీయారుణుఁడు తనయుషను ప్రేమపూర్వకముగ స్వీకరించుతెఱంగున నీమానవ్యుషనుగూడ మానవారుణుఁడు స్వీకరింపఁడా! ఆమెవలె నీమెయు ధన్యురాలు కాఁజాలదా !

ఇప్పు డాయువకున కీప్రేమగాథ లన్నియు నెఱుకపడినవి. కాని, యిప్పుడు తాను విన్నయమృతనిభములగు నావచనములు వాస్తవములా, లేక స్వాప్నికములా యని యెఱుంగ నాతనికిఁ జాలసేపు పట్టెను. తుదకు హర్షకంపితస్వరమున నాతఁ డిట్లనియెను.

"ఈయుష నన్నే యరుణునిగ నెంచుచున్నదా! నన్ను నేనం



తటిభాగ్యశాలిగఁ దలంపవచ్చునా! కాని—" యిట్లనుచునే యాయువకుఁడు గంభీరతరుఁ డయ్యెను.

"నేనిట్టిరూపవతిని బరిగ్రహింపఁదగునా! ప్రేమాంధుఁడగు నాయరుణుఁ డుషను దనజాలమునఁ దగిల్చికొనినవిధమున నేను నీమానవ్యుషను వశపఱుచుకొని తద్భావిసుఖమును వినష్టమొనర్పఁజాలను. ఆయరుణుఁడు మహామాయావి. తనజీవన మంతయు రవిసేవ కర్పింపనున్నాఁడు. ఇప్పుడు తానీయుషతోఁ గలసి మెలసి యనురాగపూరితసంభాషణ మొనర్చుచున్నాఁడో, యీయుదయమునఁ దాఁటినఁ దనజీవితకాలమున మరల నెన్నఁడు నాయుషాసందర్శనావకాశమైనఁ దనకు లభింపఁదని యతఁడు బాగుగ నెఱుంగును. అట్లయ్యు నతఁ డమాయికయగు నుషను దనయనురాగజాలములోని కాకర్షించుచున్నాఁడు. ఇది మహాపరాధము; మిగులనన్యాయము. లక్ష్మీపుత్రుఁడై నిన్ననురాగరంజిత నొనర్పఁజాలి, యాత్మజీవనమంతయు నిన్నుఁగూడి సుఖమునఁ గడుపఁజాలియున్న యేప్రభువంశసంజాతునో యేరాజకుమారునో నీయరుణునిగ నొనర్చుకొనుము. నాయట్టిభాగ్యహీనుఁడు నీకట్టిసౌఖ్యము నొసంగఁజాలఁడు."

బద—మీరు నన్నవమానించుచున్నారు. నేను భోగైశ్వర్యగౌరవలాలసతచేఁ బ్రేమించుచున్నానని నుడువుటచే అస్మదీయవిశుద్ధానురాగమును గళంకిత మొనర్చుచున్నారు. ఐశ్వర్యము, గౌరవాభిమానములు, మున్నగువానిని వాంఛించు ననురాగము, విపణివిక్రీతమగు ననురాగముకన్న శ్రేష్ఠతరముగాదు. మీరు నన్నుఁ బ్రేమించి ధన్యురాలిగ నొనర్పుఁడనిమాత్రమే మిమ్ముఁ బ్రార్థించుచున్నాను. మీసంపద్గౌరవములమాటనైన నేనెత్తలేదు. విశుద్ధప్రేమము నిర్వ్యాజమైయొప్పు. దాని కన్యపదార్థావశ్యకత లేదు.

యువ—(మఱింతగంభీరుఁడై) నీవు నాయభిప్రాయ మెఱుంగ నైతివి. కావుననే నీకుఁ గొలఁదివిచారము జనించెను. నీతోడియనురాగసంబంధమున నేననేకవిషయముల కుత్తరవాదిని గావలసియుండును. ఐనను నేను వానినిదలంచి యేమాట నాడియుండలేదు. నాకు నీ సుఖము—

బద—మీరు నాసుఖచింత వీడుఁడు. నేనెప్పు డాత్మహృదయమున మీకు స్థానమొసంగితినో, యప్పుడే మీతోపాటు శాశ్వతముగ సుఖదుఃఖానుభవసంసిద్ధ నైతిని. ఇఁక సుఖవిచారమేల? నాసౌఖ్యము లన్నియు సిద్ధించినవి. అన్యుల కేరికి నూహింపరాని సుఖములనేననుభవించితిని. సర్వసౌఖ్యవిలాసములు బద్ధాంజలియుతములై నాయెదుటఁ నిలిచినట్లుండును. కాని, యిప్పు డావిలాసములవంక నా[illegible] దేనియెదుట నీప్రపంచికసౌఖ్యము లన్నియు వ్యర్థములై యుండునో యేదియైశ్వర్యమూలమున కలభ్యమో, యట్టిసౌఖ్యమున కాఁకలిగొని యున్నాను. (వస్త్రాంచలముసాఁచి) మీనుండి యట్టిసుఖమును నేను ఇచ్ఛించున్నాను.

యువకుఁడు తనమనమున నిట్లాలోచింపఁదొడఁగెను. "ఓ ఈశ్వరుఁడా! ఇప్పుడు నేనీమె కేమిప్రత్యుత్తర మొసంగువాఁడను! ఈ సౌందర్యవతిని బరిత్యజించి దేశసేవావ్రతనిర్వహణ మొనరింతునా లేక యావ్రతమును ద్యజించి యీామె యనురాగజాలమునఁ దగుల్కొందునా! ఉషానురాగజాలమగ్నుఁడై కర్తవ్యవిస్మృతుఁ డగున యగుణునిపోల్కి నేనుఁగూడ నగుదునా! అట్లుకాదు. కొలఁదిసేపటిల నతఁడు తనవిలాసముల నన్నిటి విస్మరించి, ప్రతాపశాలియగు సహస్రకరునిసాయమునకై యేఁగును. ఇఁక నేను పౌరుషహీనుఁడ ట్లిచటనే కూర్చుండి వనితాసంభాషణలోలుఁడనై యుండుదును. ఛత్రసాలు!

